# చతుర

సంపుటి : 5 నవంబర్ – 1982 సంచిక : 10


"లేదురా ఇటువంటి భూమి ఇంకెందు'' అని మానవుడు మురిసిపోయేంత సుందరమైన గ్రహం మనభూమి. అలాంటి భూగోళం చిన్నాభిన్నం అయిపోయే ప్రమాదం ముంచుకు వచ్చింది. ఎన్నో మెగాటన్నుల అణుబాంబుల ప్రయోగం వల్లగానీ నాశనమవబోని గ్రహ శకలం ఒకటి భూమి దిశగా దూసుకురాసాగింది. వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధిని సాధించిన మనిషి దాన్ని అంతరిక్షంలోనే ఎదుర్కొని పేల్చివేసి భూమిని రక్షించే బృహత్కార్యక్రమంలో భాగంగా అంతరిక్ష నౌకలతో రోదసిలోకి దూసుకుపోయాడు. గ్రహశకలాన్ని ఎదుర్కొనే ప్రయత్నంలో అగ్రరాజ్యాలనౌకలు నాశనమవగా 1000 కోట్ల ప్రపంచ జనాభాను కాపాడవలసిన బాధ్యత భారతీయ రోదసీ నౌక



# అశ్విని



మిదనే పడింది. మరి అశ్విని తన ధ్యేయాన్ని నెరవేర్చ గలిగిందా? భారతీయ వ్యోమగాములు అంతరిక్షంలో ఎదుర్కొన్న సమస్యలు, చూసిన చిత్రవిచిత్రాలేమిటి? అనుకున్న లక్ష్యాన్ని సాధించి అశ్విని భూమికి తిరిగి రాగలిగిందా?

## రాపేటి రామకృష్ణారావు

భవిష్యత్ కాలంలో మానవుడి వైజ్ఞానిక ప్రగతిని చిత్రించి, అనుక్షణం సస్పెన్సులో ముంచితేల్చేలా రచించిన సైంటిఫిక్ ఫిక్షన్ 'అశ్విని' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం- జగ్‌మోహన్

రెండవ కవరు
మూడవ కవరు } బ్రహ్మదేవ్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.*

# స్వేచ్ఛ!

## స్త్రీ తమ స్వేచ్ఛ—నెలలో 5 రోజులు కోల్పోవలసిందేనా?



స్వేచ్ఛ. ప్రతి పరిపూర్ణ స్త్రీ ఆనందించే స్వేచ్ఛ. అది ఆమె వ్యక్తిత్వంలో ఒక భాగం.
ఫ్రీడం—ఆ స్వేచ్ఛను దక్కించుకునేలా ఆమెకు సహాయపడుతుంది.
న్యూ ఫ్రీడం—ఆమెకు ఆత్మవిశ్వాసం, సౌఖ్యం, రక్షణ కలిగిఉన్నా నన్న భావన కలిగిస్తుంది.




న్యూ ఫ్రీడం, సుతిమెత్తని, వెన్నెల లాటి తెల్లని శానిటరీ నాప్‌కిన్లు—విదేశీ
యంత్రాలపై ఆరోగ్యవిధుల కనుగుణంగా, అద్భుతంగా చెప్మను పీల్చుకునేలా,
శరీర భాగాలకు చక్కగా అమరేల· అతి జాగ్రత్తగా చేయబడ్డాయి.



ప్రత్యేక రక్షణ కవచం:
పెరఫొరేటెడ్ ''ప్రొటెక్టా''
కవచం విసూత్రం కారని
విధంగా ఈ న్యూ ఫ్రీడం
నాప్‌కిన్‌ను దిగ్బంధం
చేస్తుంది.



శ్రేష్ఠమైనది:
ప్రత్యేక ''విస్కోస్''
రేయాన్ పొర. తేమను లోపలి
భాగంలో అద్వితీయంగా
పనిచేస్తుంది. మృదువైన
మెత్తని రేయాన్ పొర
మెరిక ఉపరి ఆహార్యం
రంగదాన్ని నివారిస్తుంది.

తక్కువ ధరలో నమ్మ శక్యంగాని నాణ్యత!
ఈ రోజే న్యూ 'ఫ్రీడం'కు మారండి! స్వేచ్ఛగా అడుగు ముందుకు వెయ్యండి.

**న్యూ ఫ్రీడం ఆ సహజమైన మనోభావన కోసం**

DAZZAL/FD/TL

# విచిత్ర ప్రపంచం

## పునస్సమాగమం

రెండో ప్రపంచ యుద్ధ సమయంలో రష్యావాళు విలియమ్ డిక్ అనే అతన్ని యుద్ధ ఖైదీగా పట్టుకున్నారు. యుద్ధం అయిపోయి ఆయా దేశాలు ఎవరి దేశానికి చెందినవారిని వారికి అప్పగించుకున్నాయి. ఆ సందర్భంలో విలియమ్ డిక్ అనే ఖైదీ మరణించినట్లుగా ప్రకటించింది రష్యా ప్రభుత్వం. ఈ వార్త విన్న అతని భార్య విషాద సాగరంలో మునిగిపోయి తర్వాత తీరికగా చనిపోయిందని కబురు వచ్చింది. ఆ తర్వాత నదరు డిక్‌గారు బ్రతికే ఉన్నట్లు తేలింది. నిర్బంధంనుంచి విడుదలయ్యాక మరణించిన భార్యను నీళ్ళు వదలి రష్యాలోనే వుండిపోయాడు. 1963లో ఓ జర్మన్ స్త్రీని పెళ్ళాచాడు. ఆమె 1977లో మరణించింది. వీరికి పిల్లలు పుట్టలేదు. అదే సమయంలో డిక్ మొదటి భార్య బ్రతికే ఉన్నట్లు తేలిందె. పైగా భర జీవించే వున్నాడని తెలిసి వెంటనే రష్యా ప్రభుత్వానికి రాసి విలియమ్ డిక్ జర్మనీ తిరిగి రావడానికి అనుమతి పొందారు. 36 సంవత్సరాల దీర్ఘమైన ఎడబాటు అనంతరం విలియం డిక్ వెస్ట్ జర్మనీ వచ్చి భార్యను కలుసుకున్నాడు.





# పెళ్ళి వంటకం

అసలు పెళ్ళే ఒక ఆచారం అయితే ఒక్కో ప్రాంతానికి, ఒక్కో దేశానికి ఒక్కోపద్ధతి వుంటుంది. ఒక దేశంలోవాళ్ళు ఇంకో దేశంలో వున్నా, ఈ పెళ్ళిళ్ళ ఆచారాల్ని, సంప్రదాయాల్ని మాత్రం ససేమిరా మార్చుకోరు.

సిమ్లా, హిమాచల్ ప్రదేశ్‌లలో నివసించే చైనీయులు పెళ్ళికి కొన్నినెలల ముందునుండే సన్నాహాలు ప్రారంభిస్తారు. వాళ్ళకో గమ్మత్తయిన ఆచారంకూడా వుంది.

పెళ్ళికి 5 నెలలముందు మూడు పందుల్ని కొని వాటిని ముక్కలు ముక్కలుగా కోసి ఓ పెద్దగొయ్యి తవ్వి దాన్లోవేసి, ఘాటైన మసాలా జోడించి, ముక్కలు, మసాలా బాగా కలిసేలా కలియబెట్టి మూతవేస్తారు. ఓ వారం-పదిరోజులకి మూత తీసి చూస్తే మాంసం అంతా కుళ్ళిపోయి పురుగులతో కుతకుతలాడుతూ వుంటుంది. మళ్ళీ మామూలుగా మూతవేసేస్తారు. పెళ్ళినాటికిఒకపురుగుని ఇంకో పురుగు తిని మొత్తం ఒక పెద్ద పురుగు తయారవుతుంది.

ఈ పురుగుని ఓ పెద్ద బట్టలో చుట్టి సలసల కాగే నీళ్ళలో ఆ బట్టను ముంచుతారు. అలా పురుగు చచ్చిపోయేవరకూ ఆ నీళ్ళలో ముంచి ఉడికిస్తారు.



ఉడికిన పురుగు వెన్నలా మెత్తగా అయ్యాక దాన్ని చిన్నచిన్న ముక్కలుగా చేసి ఘుమఘుమలాడే ఘాటైన గరంమసాలా జల్లి అతిథులకు వడ్డిస్తారు.

జపానులో కొందరు ఓ గొయ్యిలో పాలు పోసి వుంచేస్తారు. అదే చివరికి ఓ పెద్ద పురుగుగా మారుతుంది. ఆ తర్వాత పద్ధతంతా పైన చెప్పిందే.

ఏమిటి వికారంగా వుందా? ఏం చేస్తాం చెప్పండి- ఎవరి అలవాట్లు, ఆచారాలు వాళ్లవి. వాంతి చేసుకోడం మినహా మనం చేసేదేం లేదు.

# పిల్లి ప్లాస్టిక్

**రా**జుల కాలంనాటి స్వర్ణ, రజిత పాత్రలు పోయి రాగి, ఇత్తడి, కంచు మరుగున పడి స్టీలు తళతళలు, జర్మన్ సిల్వర్ మిలమిలల మధ్య జిగేల్‌మనే రంగులతో ఎక్కడ చూసినా ప్లాస్టిక్ రాజ్యం చేస్తోంది మధ్య. ఒక్క వంట చేసుకోడానికి తప్పించి మిగతా అవసరాలన్నింటికీ ప్లాస్టిక్ వెనకాల పరిగెడుతున్నారు ప్రజలు.

అసలు మొట్టమొదట్లో ఈ ప్లాస్టిక్ చాలా తమాషాగా, అనుకోకుండా యాక్సిడెంటల్‌గా కనుక్కోబడింది. ఎడోల్ఫ్ స్పిచర్ అనే జర్మన్ రసాయనిక శాస్త్రవేత్తగారికి స్వయంగా ఓ లేబొరేటరీ వుంది. 1890లో ఓరోజు రాత్రి ఆయన లేబొరేటరీలో కూర్చుని ఏదో పని చేసుకుంటుంటే అలవాటుగా ఆయన పెంపుడు పిల్లి కనబడిన ఎలక వెనకాల పడింది. దాదాపు ఓ పది నిమిషాలు పిల్లికిచెలగాటం ఎలుకకి ప్రాణ సంకట పోరాటం జరిగాకి ఎలుక పిల్లికి ఆహారం అయిపోయింది. ఈ గందరగోళంలో పిల్లి తన్నిన ఓ డబ్బా ఎగిరెళ్ళి ఎలకల బోనుమీద పడి దాంట్లోని ద్రవం ఒలికిపోయింది. దాంతో ప్రొఫెసర్‌గారు లేబొరేటరీకి తాళం వేసి ఇంటి కెళ్ళి ఓ పెగ్గు విస్కీతాగి నిద్రపోయేడు.

మర్నాడుదయం ఎలకలబోను శుభ్రం చేద్దామనిచూసేటప్పటికి అందులో ఎలకల కోసమని పెట్టిన జున్నుముక్క రాయిలా గట్టిగా అయిపోయివుండడం చూసి

ఆశ్చర్యపోయాడు. డబ్బాలోని ఫార్మాల్ డిహైడ్ దోసులోని జున్నుముక్క మీద పడ్డం వల్ల అలా అయింది. ఫార్మాల్డిహైడ్ కోల్‌తార్‌కి బైప్రొడక్టు, వెంటనే ఏదో ఆలోచన వచ్చి ఎడోల్ఫ్ కాసినీ పాలు తీసుకొచ్చి ఫార్మాల్‌డిహైడ్‌లో పోశాడు. కాసేపటికి పాలు, ఫార్మాల్ డిహైడ్‌తో కలసి రసాయనిక మార్పుజరిగి 'కాసిన్' తయారయింది. ఇదేప్లాస్టిక్‌కి తొలిరూపం. పెంపుడుపిల్లి చేసిన అల్లరి తన మంచికే జరిగిందని తెగమురిసిపోయి పిల్లి ప్లాస్టిక్ అనిముద్దుపేరు పెట్టుకున్నాడు ఎడోల్ఫ్. ప్రస్తుతం వాడుకలో వున్న ప్లాస్టిక్ రావడానికి ముందు సదరు 'కాసిన్' కొన్ని వేల మార్పులు చెందివుంటుందని వేరే చెప్పాలా!

## టెస్ట్‌ట్యూబ్ దూడ

'పిల్లల్లేరు మొర్రో అని ఏడవకపోతే టెస్ట్‌ట్యూబ్ బేబీలని పుట్టించుకోకూడదా' అని డాక్టర్లంటే 'అయ్యో అపచారం అపచారం. అంతమాటనకండి. పిల్లల్లేకపోతే ఎవర్నయినా పెంచుకుంటాంగాని చచ్చినా పరీక్షనాళికల్లో పిల్లల్ని మాత్రం పుట్టించుకోము' అనేవారు ఏదేశంలో మాటెలావున్నా మన దేశంలోమాత్రం లెక్కకు మించి ఉన్నారు.

ఇహ మనుషుల్తో లాభంలేదు, జంతువుల పని పడదాం అని ఆ ప్రయత్నంలో పడ్డారు శాస్త్రవేత్తలు, వైద్యులు కలిసి. ఆవుకి ఒక ఈతకి ఒకే దూడ పుడుతుంది. పందికి పది పదిహేను పిల్లలు పుడతాయి- ఈ రెండింటినీ జోడిస్తే ఎలావుంటుందీ అని ఆలోచించి మహత్తర విజయం సాధించేరు.

పందిలోని ఎక్కువ సంతానోత్పత్తికి కారణమైన హార్మోనులను తీసుకుని వాటిని ఆవుల్లో ఇంజక్షన్‌ద్వారా ప్రవేశపెట్టారు. సంవత్సరానికోసారి ఒకే ఒక దూడనిచ్చే ఆవులు ఈ దెబ్బతో ఈతకు ఆరు- ఏడు నుండి పది- పన్నెండు దూడల్ని వేస్తాయన్నమాట. ప్రత్యేక పర్యవేక్షణలో ప్రయోగాలకోసం పెంచబడే ఈ ఆవులు సహజత్వానికి దూరంగా కృత్రిమ మందులు, హార్మోన్లవల్ల అధిక సంతానాన్ని వుత్పత్తి చేయవల్సిరావడంవల్ల పాలధారతగ్గి చాలా తక్కువ పాలనిస్తాయి. ఈనడం అయిపోయిం తర్వాత పాలధార మామూలుగానే వుంటుంది. గొడ్డుమోతు ఆవులమీదకూడా ఈ ప్రయోగం జరిపి గర్భధారణ జరిగేలా







"అసాధారణమైన
అల్లం ముక్కని.
'ప్రియ'
స్పైమూంతో కాకలు దీరిన
కమ్మ దనాన్ని!"




"ప్రియ దృష్టిలో పదాలంటే నాలా కండకలిగి నిండుగా తాజాగా ఉండాలి. అప్పుడే మేలయిన మసాలాలు, స్వచ్ఛమయిన నూనెల సహచర్యం లభిస్తుంది. అదే విధంగా చక్కని ఆరోగ్య సూత్రాలతో అధునాతన ఫాక్టరీలో రుచులన్నీ నింపుకొని మీ విందుకు వస్తాను. అందమైన సీసాల్లో కళకళలాడుతూ నిలబడతాను. అదుగో... అప్పుడే మీ నోరూరుతోంది మరింక మాటలనవసరం!"

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 'ప్రియ' పచ్చళ్లు 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

- మామిడి కాయ
- నిమ్మకాయ
- టొమాటో
- అల్లం
- గోంగూర

Kiron/PF/8016

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by.
MARGADARSI MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad 500 004

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

చూసి విజయం సాధిస్తున్నారు. కేవలం ఆవులకేగాక గేదెలకికూడా ఈ ప్రయోగం వర్తిస్తుంది.

ఇంకేం ఎవరైనా డైరీఫారం పెట్టుకో దల్చుకుంటే రెండు ఆవుల్తో ప్రారంభిస్తే చాలు నాలుగు సంవత్సరాల్లో ఓ పెద్ద డైరీఫారమ్‌కి యజమాని అయిపోవచ్చు పై ప్రయోగ ఫలితాలవల్ల. బెస్ట్ఆఫ్‌లక్.

## రెడీమేడ్

'టాప్ లెస్' దృశ్యాలున్న సినిమాల్ని విరగబడి చూస్తారు జనం. ఏ పత్రికలో నైనా నగ్న చిత్రాలున్నాయంటే తిండి అయినా మానేసి ఆ పుస్తకం కొనుక్కొని వీలైతే బహిరంగంగా లేదా చాటు మాటుగా ఆ చిత్రాల్ని చూసి ఆనంది స్తుంటారు. కేబరేలకు కొదువలేదు. ఆధు నిక విలాసినుల వస్త్రధారణలో దుస్తులు పాతిక వంతు శరీరాన్ని మాత్రమే కప్పి ఉంచగలుగుతున్నాయి. ఇవన్నీ చూస్తుంటే మళ్ళీ మనం 11వ శతాబ్దిలోకి వెళ్ళిపోతున్నామనిపిస్తోంది. ఎందుకంటే అప్పటి రోజుల్లో పురుషులు ధోవతి కట్టు కొని, భుజాన ఓ అంగ వస్త్రం వేసుకునే



వారు. స్త్రీల శరీర నడుము పైభాగాన ఎటు వంటి ఆచ్ఛాదనా ఉండేది కాదు.

ఆ తర్వాత వస్త్రధారణ మన అల వాట్లలో అలవాటుగా మారిపోయి బట్టలు లేని జీవితాన్ని ఊహించలేని స్థితికివచ్చాం. బజార్లో విరివిగా దొరికే మామూలు బట్టలు కట్‌పీసులతోబాటు హాయిగా అలా కొని ఇలా వేసుకోడానికి వీలుగా రకరకాల 'రెడీమేడ్' దుస్తులు కూడా కొల్లలుగానే ఉన్నాయి ప్రస్తుతం. మనదేశంలో రెడీమేడ్ దుస్తులు మొట్టమొదటిసారిగా చంద్రగుప్తుని కాలంలో వాడుకలోకి వచ్చాయి. అది కూడా కేవలం సైనికులే ధరించేవారు. అలెగ్జాండరు సైనికులు ధరించిన దుస్తుల నమూనాలో గ్రీసు నుంచి దిగుమతైన ఆ దుస్తుల పట్ల చంద్ర గుప్తుడు ఎటువంటి ఆకర్షణా చూపలేదు.

భారతీయ దుస్తుల్లో ఆధునికత అక్బర్ చక్రవర్తితో మొదలయిందని చెప్పొచ్చు. దుస్తులు వ్యక్తుల అభిరుచిని, వ్యక్తిత్వాన్ని ఎత్తి చూపిస్తాయని చెప్పిన మొదటి భారతీయ చక్రవర్తి అక్బరే. గ్రీకు, హిందు, పర్షియా నమూనాల కలయికతో ఓ కొత్త పంథాలో దుస్తుల్ని రూపొందించే వారు భారతీయ దర్జీలు. అక్బరు ధరించే దుస్తుల ఫాషన్ ఓ 30–40 ఏళ్ళపాటు కొనసాగింది. జోధ్‌పూర్, రాజస్థాన్‌లలో ఇప్పటికి అక్బరు డ్రస్సులాంటివి వాడుకలో ఉన్నాయి.

కాస్త ఖరీదెక్కువే అయినా రెడీమేడ్ దుస్తులు చాలా షోగ్గా, అందంగా ఉంటా యని కొందరంటే...డబ్బెక్కువయిగాని మామూలు బట్టకొనుక్కొని దర్జీచేత కుట్టించుకున్న సుఖం ఉండాని కొంద రంటారు. లోకోభిన్నరుచిని రెడీమేడ్ వర్తకులు బాగానే డబ్బు చేసుకుంటు న్నారు.



అతడికి 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు

# మీ పాపాయికి కావలసినది ఫారెక్స్

## పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

### 3 నెలల వయస్సు-ఘన ఆహారం ప్రారంభించవలసిన సమయం

3 నెలలు నిండాక, పాపాయి పెరిగే అవసరాలకు కేవలం పాలు మాత్రమే సరిపోవు. పాపాయి చురుకుగా, తొందరగా పెరుగుతూంటాడు. అంచేత కేవలం పాలు ఇవ్వగలిగే వాటికన్నా ఎక్కువ కాలరీలు అతడికి కావాలి. పాలు తాగడాన్ని తగ్గించి, హెచ్చు కాలరీలు ఇచ్చేదీ, నమలడం అలవాటు చేసేదీ అయిన ఘన ఆహారం పాపాయికి అవసరం.

### 3 నెలలు వయస్సు—మరింతగా ఐరన్ కావలసిన సమయం

"పాపాయికి ఘన ఆహారాలు ప్రారంభించేందుకు 2-4 నెలల మధ్య వయస్సు ఉత్తమమైనది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్‌గల ఘన ఆహారాలు కావాలి.

—డాక్టర్ సుభాష్ సి. ఆర్య: "ఇన్‌ఫేంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్."

### డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడినది. ఇందులో ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు వున్నాయి. ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా వుంది. అందుకే, పాపాయి సంపూర్ణమైన పెరుగుదల కోసం ఆదర్శవంతమైన ఘన ఆహారం ఫారెక్స్.




డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్
సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం.



# అగ్ని

రాపేటి రామకృష్ణారావు

క్రీ.శ. 2086, ఫిబ్రవరి 8వ తేదీ.

రోదసీ నౌక అశ్వని భూమి నుంచి బయలుదేరి మూడు సంవత్సరాలు నిండిన, రోజది.

ఏస్ట్రో ఫిజిక్స్ ప్రొఫెసర్ ప్రసాద్ తన గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. ఆలోచనలు భూమి వేపే సాగిపోతున్నాయి. గంట క్రితమే భార్య సుశీలని భూమి నుండి టెలివిజన్‌లో చూశాడు. ఆ టెలికాస్ట్‌లో ఆమె చూపిన ఆవేదన జ్ఞాపకానికి వస్తోంది.

టైము చూసుకున్నాడు. ఇపుడు భూమి మీద ఉదయం పది గంటలవుతుంది. ఈ ఎలక్ట్రానిక్ వాచీ గనక లేకపోతే రోదసిలో టైముకి అర్థం లేదు.

కాలం ఎంత విచిత్రమైనది. దేవుడిలాగే అది కూడా ఆదిమధ్యాంతరహితమైనది. కాంతిలాగా సెకెండుకి 186272 మైళ్ళ వేగంతో ప్రయాణిస్తే జరిగే మార్పులను గురించి 1905లో ఆల్బర్ట్ ఐన్‌స్టెయిన్ తన స్పెషల్ థియరీ ఆఫ్ రిలేటివిటీలో చెప్పింది ప్రసాద్‌కి జ్ఞాపకం వచ్చింది. ఆ థియరీ ప్రకారం వేగం పెరిగినకొద్దీ వస్తువు పొడవు తగ్గుతుందట. కాలంలో కూడా మార్పులు వస్తాయట. ఆ వస్తువు కాంతి వేగానికి చేరువౌతూన్నకొద్దీ దూరం తరిగిపోతుందట. వస్తువు పరిమాణం పెరిగిపోతుందట. కాంతితో సమానమైన వేగాన్ని చేరుకోగానే దానికి పొడవు అనేది వుండనే వుండదట. గడియారం కూడా మెల్లనై మెల్లనై కాలం స్థంభించినట్లు ఆగిపోతుందట. అవన్నీ ప్రయోగ రీత్యా శాస్త్రజ్ఞులు నిరూపించారు. కాని కాంతి వేగంతో ప్రయాణించే మనిషి, భూమిమీద మనిషిలాగా కాలంతో పాటు ఎదగడని చెప్పాడు. దానిని ఇంకా ఎవ్వరూ నిరూపించలేదు. అది నిజమౌతుందా? కాలంయొక్క కఠోరహస్తాలు సోకకపోతే ఇంకా ఏమన్నా వుందా? రోజాపూలు వాడిపోతాయా ? పండుటాకులు రాలుతాయా ? నిరూపించబడేదాకా ఏదీ చెప్పలేం అనుకున్నాడు.

కోట్లమైళ్ళ దూరంలో వున్న భూమి మీది హైదరాబాదునీ,విశాఖపట్నాన్నీ,చుట్టాలు, స్నేహితుల్నీ తలచుకోగానే వారు మదిలో సాక్షాత్కరించసాగారు. మనోవేగం నిజంగా ఆశ్చర్యకరంగదా! సుశీల ఇప్పుడేం చేస్తుంటుంది? తననే తలచుకుంటూ వుంటుంది. తనకన్నా పది సంవత్సరాలు పెద్దవాడైన తనను ఏం చూసి పెళ్ళి చేసుకుందో? అసలు వివాహమే చేసుకోకుండా శాస్త్రపరిశోధనకే జీవితం అంకితం చేయాలనుకున్నాడు తను. కాని సుశీల కూడా వివాహం చేసుకోకుండా వుండిపోయి నీడలాగ వెంటాడింది. ఆ ఆరాధించే పెద్ద కళ్ళను తను తిరస్కరించలేకనే వివాహం చేసుకున్నాడు. ఇంతలో ఈ రోదసీ ప్రయాణం తగిలింది. వివాహాన్ని మరో రెండేళ్ళు పొడిగించినా సుశీలకీ, తనకీ ఈ వియోగం తప్పేదే!

అసలు సుశీల తనతో సుఖిస్తుందా? ఏమో! ఆమె తన అసంతృప్తిని వైవాహిక జీవితం గడిపిన రెండేళ్ళలో ఎప్పుడూ వ్యక్తం చెయ్యలేదు.

కనిపించే వయోభేదం తప్ప తమ మధ్య దాంపత్యసుఖానికి లోటు ఏముంది గనక. మరోమారు ఐన్‌స్టెయిన్ సిద్ధాంతం మనస్సులో మెదిలింది. ఆ సిద్ధాంతం నిజమై మా వ్యోమగాములందరికీ కాలం ఆగిపోతే... తాము కాంతి వేగంతో ప్రయాణిస్తున్నారు గనకనా...





కొంతలో కొంతయినా కాలం కలిసొస్తే ఎంత బాగుంటుంది. సుశీలా తనూ చిలకా గోరింకల్లా అయిపోరూ అనుకున్నాడు.

ఉదయం టెలివి జన్‌లో "ఏమండీ! మళ్ళీ మనం కలుసు కోగలమంటారా? ఇంకా మీరు చేరుకో వలసిన గమ్యాన్నే చేరుకోలేదు. మూడు సంవత్సరాలు దాటిపోయాయి. ఎంత కాలమైనా పరవాలేదు. మీరు క్షేమంగా తిరిగి రావాలని వెయ్యి దేవుళ్ళకు రోజూ మొక్కుకుంటున్నాను. నాగురించి, మన బాబుని గురించి మీరు దిగులుపెట్టుకో వద్దు" అని దీనంగా స్త్రీ సహజమయిన భయంతో మాట్లాడుతుంటే 'మనం తప్ప కుండా కలుసుకుంటాం సుశీలా...తప్ప కుండా కలుసుకుంటాం! నువ్వు దిగులు పడకుండా వుండు' అని చెప్పాలను కున్నాడతను.

కాని రోదసిలో నలభై కోట్లమైళ్ళ దూరం ప్రయాణించడానికి రేడియో తరం గాలకి కూడా కనీసం నలభై నిమిషాలు పడుతుంది. భూమికి ఒక వార్త వెళ్ళి రావడానికి గంటన్నరదాకా పడుతుంది. టెలిఫోనులో లాగ వెంటనే మాట్లాడుకోవ డానికి వీలుండదు. టైమ్‌లేగ్‌ని కూడా దృష్టిలో పెట్టుకోవాలి.

ప్రసాద్ తన ఉద్వేగాన్ని తనలోనే అణచుకుని తను మాట్లాడవలసినది మాట్లాడి రూమ్‌కి వచ్చేశాడు. తనసలు ఈ ప్రయాణానికి రాకుండా వుండవల సింది. కాని అటువంటి పరిస్థితులలో రాకుండా ఎలా వుండగలడు ... అను కుంటుండగానే కంట్రోలు రూమ్ నుంచి కమాండర్ కెప్టెన్ జగదీష్ ఇంటర్ కమ్‌లో పిలవటం వినుపించింది.

ప్రసాద్ ఈ లోకంలోకి వచ్చాడు. సమావేశానికి టయిమయిందన్న మాట. ఇంకా ఏమీ తిననేలేదు. గబగబా నాలుగు పుడ్ టేబ్లెట్లు మింగి కంట్రోలు రూముకి బయలుదేరాడు.

* * *

ప్రసాద్ కంట్రోల్ రూం చేరేసరికే కమాండర్ జగదీష్, సూర్యకుమార్, డాక్టర్ సరోజ, నరేంద్ర వాళ్ళ వాళ్ళ స్థానాలలో కూర్చుని వున్నారు. ప్రొఫెసర్ ప్రసాద్ రాగానే అందరూ పరామర్శిం చారు.

జగదీష్ ఉదాసీనంగా వున్న ప్రసాద్ ముఖం చూసి "ఏమిటి ప్రొఫెసర్‌గారూ! మీ శ్రీమతిగారు ఇంకా మదిలో నుంచి కదలలేదా?" అన్నాడు నవ్వుతూ.

ప్రసాద్ తన ముఖంలో అంత విచారం వ్యక్తం అవుతోందా అనుకుని "నో నో...అయామ్ ఆల్‌రైట్! ఏమిటి విశేషాలు. టెలిస్కోప్‌లో మనకి పట్టిన గ్రహాన్ని ఇంకా చూడలేదా?" అన్నాడు తనూ నవ్వుతూ.

"లేదు. మీ కోసమే ఎదురు చూస్తు న్నాము" అని రిఫ్లెక్టర్ టెలిస్కోప్‌ని తెల్లని మేఘం లాగ కనిపిస్తున్న ధనుస్సురాశి వేపు తిప్పి ఫోకస్ చేశాడు నరేంద్ర.

టెలివిజన్ స్క్రీన్‌మీద కనిపిస్తున్న తెల్లని మచ్చని గమనించసాగాడు ప్రసాద్. రేడియో టెలిస్కోప్ ఆ గ్రహ శకలాన్ని ఎప్పుడూ ఫాలో అవుతూనే ఉంది. అశ్విని నౌక పైభాగాన వున్న రాడార్ పేరబ్లా భూమి దిక్కుగా వస్తున్న ఆ గ్రహశకలాన్నివదలకుండా నిరంతరం సంకేతాలు పంపి గ్రహిస్తూనే వుంది.

నరేంద్ర ఫోకస్ చెయ్యగానే ఐపీస్‌లో కన్నువుంచి చూశాడు కెప్టెన్ జగదీష్

# ఉజ్జ్వల ప్రపంచానికి కవాటాలు తెరుద్దాం... రండి!



జీవితంలో రకరకాల అవకాశాలు వస్తూ ఉంటాయి. వచ్చిన అవకాశాలను తెలివిగా ఉపయోగించుకొనే వారినే విజయం వరిస్తుంది. అవకాశాలు అంది రావడానికి డబ్బు అవరోధం కాకుండా మార్గదర్శి మీకు తోడ్పడుతుంది.

మార్గదర్శిలో మీ అవసరాలకు అనుగుణంగా వివిధ రకాల చిట్‌లు ఉన్నాయి. తేలికయిన వాయిదాల్లో మీరు పొదుపుచేసే వీలుంది. లాభసాటి డివిడెండ్లు తోడవుతూ పెరిగి పెద్దయ్యే మొత్తాన్ని తిరిగి మీరు పొంద వచ్చును. మీ జీవితమూ, మీ తోటివారి జీవితాలూ మరింత శోభాయమానం కావడానికి ఆ మొత్తం ఉపక రిస్తుంది. మార్గదర్శిలో పొదుపు చెయ్యడం నవజీవనానికి నాంది అని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి ?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**




**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● శంకర్‌రావు రోడ్, [illegible] ● మెయిన్ [illegible], గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

KIRON/MCF/81/3

'నిన్నటికన్నా బాగా' పెద్దదిగా కనిపిస్తోంది. చూశారా ? నేను అనుకున్నది నిజమే. ఇది మామూలు గ్రహ శకలం లాంటిదికాదు. వాటికి ఒక నిర్దిష్టమైన ఆకారం వుండదు. అష్టవంకరలతో వుంటాయి. ఇది చూడండి వృత్తాకారంగా చిన్న కృత్రిమ గ్రహంలాగ వుంది" అన్నాడు.

దాని దూరాన్ని లెక్కకట్టాడు. రాడార్ సిగ్నల్‌కి గ్రహాన్ని తాకి రావడానికి ముప్పైసెకెండ్లు పడుతోంది. రాడార్ సిగ్నల్‌ని గ్రహించిన కంప్యూటర్ అది గంటకు యాభైవేలమైళ్ళ వేగంతో అశ్విని దిక్కుగానే వస్తున్నట్లు కనుగొన్నాడు. వారం క్రితం దాని వేగం ఇంతకన్నా తక్కువగా వుండేది. చార్టుని బట్టి రోజురోజుకీ దానివేగం పెరుగుతున్నట్టు గ్రహించాడు.

అందరినీ ఉద్దేశించి "చూశారా! రాను రాను ఆ గ్రహం వేగం పెరుగుతోంది. అంటే సూర్యుని ఆకర్షణ శక్తి రానురాను దానిమీద ఎక్కువౌతోందన్నమాట. ఈ లెక్కన మనం మరో ముప్పై గంటల్లో ఆ గ్రహాన్ని ఎదుర్కొంటాం. అంటే మరో రోజులో ఆ గ్రహం మన పరమాణు బాంబులతో తునాతునకలై పేలిపోతుంది. ఇంక ఇది భూమిని ఢీకొనే ప్రశ్నే వుండదు. మరో రెండేళ్ళలో భూమికి జరగబోయే ప్రమాదాన్ని ఆపివేసినట్లే" అన్నాడు.

"ఈలోగా మనం రష్యా, అమెరికా నౌకల ఫైండిగ్స్ కూడా కనుక్కోవడం మంచిది కదా" తన ఉద్దేశాన్ని తెలియజేశాడు సూర్యకుమార్.

వెంటనే వైర్‌లెస్‌లో రష్యా, అమెరికా రోదసీ నౌకలను కాంటాక్ట్ చేశారు. వాళ్ళు కూడా వాళ్ళు సేకరించిన విషయం తెలియజేశారు. బేరీజు వేసుకుంటే సరిపోయింది. అంటే మరో రోజులో పని పూర్తి చేసుకుని భూమికి తిరుగు ప్రయాణం సాగించవచ్చును అని అందరూ సంతోషించారు. ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

రోదసీ యాత్రికులకు భూమితో సంబంధాన్ని కలిపేవి రేడియో, టి. వి. ప్రసారాలే. లేకపోతే వీడియో కేసెట్ రికార్డ [illegible] పాత సినిమాలు చూడడం, పుస్తకాలు చదువుకోవడం, అదీ కాకపోతే ఎవరికి వారు ఆలోచనల్లో మునిగిపోయి నిద్రపోవడం.

ప్రొఫెసర్ ప్రసాద్ తనగదికి చేరీ చేరగానే వినిపించిన డేంజర్ బజర్ శబ్దానికి ఉలిక్కి పడ్డాడు. ప్రమాదాన్ని సూచిస్తూ ఎర్రలైటు వెలిగి ఆరిపోతోంది. వెంటనే కంట్రోల్‌రూం చేరుకున్నాడు. ప్రసాద్ చేరిన మరునిమిషంలోనే అందరూ అక్కడికి చేరుకున్నారు. ఉల్కాపాతాల నుంచి నౌకని రక్షించడానికి నాలుగు రాడార్లని నాలుగువేపులా బిగించారు. అందులో ఒకటి ఉల్కని గుర్తించింది. ఉల్కపరిమాణాన్ని బట్టి నౌకకి పదివేల మైళ్ళదూరంలో వున్నదనగానే గుర్తించి కంప్యూటర్‌కి సమాచారం పంపుతుంది. కంప్యూటర్ ఆటోమాటిక్‌గా నౌక దిశను మారుస్తుంది. ప్రమాదం తప్పుతుంది. కాని ఈ ఉల్క ఊహించని వేగంతో వచ్చి నౌకని ఢీకొని కుదిపివేసింది.

జగదీష్ ఆపరేటర్ సీటులో కూర్చుని పేనల్ మీటర్లను లోపాలేమైనా జరిగాయా అని చూశాడు. బయటగదులలో ఎయిర్ ప్రెషర్ తగ్గుతున్నట్లు మీటర్ చూపుతోంది. వెంటనే బయటిగదులకి,

లోపలి గదులకి మధ్యవున్న ఎయిర్ లాక్‌లను మూయించేశాడు. ఉల్కాపాతం వలన నౌక ఉపరితలానికి ఎక్కడో రంధ్రం అయిందని గ్రహించారు. సెకెండుకి ఘనపు అంగుళానికి ఐదు పౌన్ల చొప్పున వాయుపీడనం తగ్గిపోతున్నట్లు కనుక్కున్నారు. ఇదే లెక్కన గాలి శూన్యంలోకి తప్పించుకుపోతే కొన్ని నిమిషాలలో బయటి గదులలోని గాలి పూర్తిగా పోతుంది: అలాగనక మొత్తం నౌకలోని గాలి తప్పించుకుపోతే తమకు ప్రాణాపాయమే.

భూమి మీదనున్న మనుషులకి గాలి వొత్తిడి శరీరం మీద ఎంత వున్నదీ తెలియదు. వాతావరణాన్ని దాటి శూన్యంలో రోదసీయానం చేసే వ్యక్తి స్పేస్‌సూట్ ధరించి తగిన గాలి ఒత్తిడితో నింపబడిన నౌకలో గనక వుండకపోతే శరీరం ఉబ్బిపోయి చర్మ రంధ్రాలు తెరుచుకుని చెవులనుంచీ, ముక్కునుంచీ, చర్మంనుంచీ రక్తం స్రవించి చనిపోతారు. సముద్ర జీవాలు కూడా లోతున జీవించేవి పైకి వచ్చినా నీటి ఒత్తిడి తగ్గి చనిపోవటం ఇలాగే జరుగుతుంది.

కెప్టెన్ జగదీష్ వెంటనే రొబాట్ ప్రతాప్‌ని నౌక బయటకు వెళ్ళి రంధ్రాన్ని వెల్డింగు చేయమని ఆదేశాలిచ్చాడు.

అందరూ చూస్తుండగానే ఎయిర్‌లాక్ తెరుచుకుని బయటి గదిలోకి వెళ్ళి మళ్ళీ ఎయిర్‌లాక్ మూసేశాడు ప్రతాప్. ప్రతాప్ తలుపు మూసెయ్యగానే అందరి చూపులూ క్లోజ్ సర్క్యూట్ టి.వి. తెర వేపు మళ్ళాయి. ప్రతాప్ చేస్తున్న దృశ్యాలు టెలికాస్ట్ చెయ్యబడి ఆ టెలివిజన్ తెరమీద అందరికీ కనిపిస్తున్నాయి. ప్రతాప్ మొదట నౌక ఉపరితలానికి వెళ్ళే తలుపు తెరిచాడు. శూన్యం గదిలోకి వెళ్ళి మళ్ళీ తలుపు మూసేశాడు. వాక్యూమ్‌చాంబర్ నుంచి బయటికి వెళ్ళే తలుపు తెరిచాడు.

ప్రతాప్ స్టీల్‌రోప్‌ని బయటికి వెళ్ళే ముందు క్లిప్ చేసుకుంటాడో లేదో గమనించటం కోసం, బయటికి వెళ్ళే ముఖద్వారం దగ్గరి టి.వి. కెమేరాని ఆన్ చేశారు. ప్రతాప్ స్టీలు తాడుని మరిచిపోకుండా తగిలించుకున్నాడు. తలుపు దగ్గరనుంచి బయటికి నిచ్చెన వుంది. నౌక ఉపరితలాన్ని చుట్టూ తిరిగి పరిశీలించడానికి, రిపేర్ చెయ్యడానికి వృత్తాకారపు రైలింగ్ బిగించబడి వుంది. దానికి ఆరడుగుల ఎత్తున మరో వృత్తాకారపు రింగు చుట్టూ బిగించబడి వుంది. పైది చేతులతో పట్టుకోవడానికి, కిందిది కాళ్ళు వేసుకోవడానికి ఉద్దేశించబడ్డాయి. ప్రతాప్ వాటి ఆధారంతో నౌక చుట్టూ కలయతిరిగాడు. ఒక చోట రేకు తొత్తపడి కనిపించింది. పక్కనే చిట్లినట్లున్న రేకుని తీసి తన టి.వి.కళ్ళతో పరికించాడు ప్రతాప్. అక్కడ తన మైక్రోఫోను చెవులను ఆనించాడు. బయటికి వస్తున్న గాలి సోకి హోరు వినిపించింది. వెంటనే వీపుమీది వెల్డింగు సెట్‌తో రంధ్రాన్ని పూడ్చివేశాడు.

కంట్రోలు రూమ్‌లోని ప్రెషరు మీటరు రీడింగు తగ్గడం మానేసింది. ప్రసాద్ వైర్‌లెస్‌లో ప్రతాప్‌ని వచ్చెయ్యమన్నాడు. సంకేతం అందగానే ప్రతాప్ పనిచాలించి తలుపు వేపు రాసాగాడు. ఉల్కాపాతం వలన రైలింగ్ ఒకచోట దెబ్బతిని విరిగిపోయి ఉండటం చేత ప్రతాప్ నౌకనుంచి విడిపోయాడు.





ప్రతాప్ నౌకని ఇనుపతాడు ఆధారంతో చేరుకోగలడు. కాని గంటకు ముప్పైవేల మైళ్ళ వేగంతో పోతున్న నౌక నుంచి జారడం వలన ఆ తాడు తెగిపోయింది. ప్రతాప్ తన వేగాన్ని పోగొట్టుకోవడం వలన రానురాను నౌకకి దూరం కాసాగాడు.

కంట్రోల్ రూమ్‌లోని టి.వి. తెరమీద నౌక ఉపరితలం కనిపిస్తూ కనిపిస్తూ ఒక్కసారే తెల్లగా అయిపోయింది. ప్రమాదాన్ని వెంటనే గుర్తుపట్టారు. నౌక బయటి ఆరు కెమేరాలని ఆన్ చేశారు. ఒక టి.వి.లో దూరంగా శూన్యంలోకి ఎగిరిపోతూ ప్రతాప్ కనిపించాడు. కెమేరాకి కూడా అందకుండా రాను రాను దూరం కావడం చూసి మొదట కంగారుపడ్డారు. ఎందుకంటే వారి రోదసీ యాత్ర అనుకున్నట్లు పూర్తికావాలి అంటే ఇలాంటి అవాంతరాలు జరగకూడదు ప్రతాప్ మరమనిషే. అయినప్పటికీ అతని కోసం నిర్దేశించబడిన ఎన్నో పనులున్నాయి. ఆ పనులు ఎవరు చేస్తారు. అతను ఒక డొమెస్టిక్ రొబాట్. ఉన్నట్లుండి వంట మనిషి మానేస్తే యింట్లో ఎంత యిబ్బందో ప్రతాప్ లేకపోతే అశ్వని నౌకలోని నావికులకు అంతకన్నా యిబ్బంది. అందు చేత వాళ్ళు ఎటువంటి పరిస్థితులలోనూ ప్రతాప్‌ని కోల్పోదలచుకోలేదు.

కెప్టెన్ జగదీష్ వెంటనే రిట్రారాకెట్లు పేల్చించి నౌక వేగాన్ని తగ్గించాడు. "హనుమాన్‌ని ప్రతాప్‌ని తేవడానికి ఉపయోగిద్దాం" అన్నాడు.

ఎంతో అత్యవసర పరిస్థితులలో తప్ప హనుమాన్‌ని నౌక బయటికి పంపడానికి రూల్సు ఒప్పుకోవు. భారత శాస్త్రజ్ఞులు తమ తెలివినంతటినీ ఉపయోగించి తయారుచేసిన మరమనిషి హనుమాన్. అతను మాట్లాడగలడు కూడా. కాని భూమినుంచి అనుజ్ఞ పొందడానికి సమయంలేదు. అది జరిగేలోగా ప్రతాప్ రోదసిలో తప్పిపోతాడు.

అందుకని జగదీష్ తనే నిర్ణయం తీసుకున్నాడు. ప్రసాద్, సూర్యకుమార్, నరేంద్ర, సరోజ అతని నిర్ణయాన్ని ఆమోదించారు.

జగదీష్ తలుపులు తెరిచి స్పెషల్ రూమ్‌లో హనుమాన్ వున్న చోటకి వెళ్లాడు. హనుమాన్ మామూలు పరిసితులలో తన శక్తిని ఖర్చుచెయ్యడు. ఎవరైనా జీవులుగాని, ఏ వస్తువైనాగాని ఆరు అడుగుల దూరంలో వుండగానే అతని నుదుట బిగించిన శాశ్వత అయస్కాంత క్షేత్రంలో మార్పు జరిగి ఒక రిలే స్విచ్చి పనిచేస్తుంది. అప్పుడు నిద్ర లేచినట్లు మేల్కొంటాడు హనుమాన్.

అందుకే జగదీష్ ఆ పరిధిలోకిరాగానే శక్తివంతుడై కళ్లుతెరిచి "యస్ బాస్" అన్నాడు.

"నీ కోసం ఒక అర్జంటు పనికాచుకుని వుంది. నాతోరా" అన్నాడు జగదీష్.

"అలాగే" అంటూ సమ్మినబంటులాగ అనుసరించాడు హనుమాన్.

హనుమాన్, ప్రతాప్ యిద్దరూ మరమనుషలేకాని తేడా వుంది. ప్రతాప్ తనలోని బేటరీతో పనిచేస్తాడు. హనుమాన్ సూర్యరశ్మితో పనిచేసాడు.

ప్రతాప్ బేటరీలో కరెంటు వున్నంతసేపూ చెప్పిన విషయం అర్థంచేసుకుని పని చెయ్యగలడు. కాని మాట్లాడలేడు.

హనుమాన్ మాట్లాడగలడు. రోదసిలో రాకెట్‌లాగ సౌరశక్తిని వినియోగించుకుని ఎగరగలడు. వెళ్లిన తోవనే మళ్ళీ

రాగలడు. అతి నవీనమైన కంప్యూటరు అతని మెదడులో బిగించబడివుంది.

ప్రతాప్ తప్పిపోయిన లొకేషన్, ఏంగిల్ ముదలైనవి చెప్పి తీసుకురమ్మని హనుమాన్‌కి పురమాయించాడు జగదీష్. అప్పటికే టెలిస్కోప్‌కి కూడా అందని దూరంలో ప్రతాప్ వుండిపోయేడు. అతనిని సులువుగా గుర్తించడంకోసం రిమోట్ కంట్రోల్ సిగ్నల్ ద్వారా ప్రతాప్‌లోని వైర్‌లెస్ ట్రాన్స్‌మీటర్‌ని ఆన్‌చేశాడు. రేడియో రిసీవర్‌లో బీప్-బీప్-బీప్ అనే శబ్దాలు, ఆసిలోస్కోప్‌లో వెలుగుతూ ఆరుతూ తెల్లని చుక్క ప్రతాప్ ఉనికిని చూపిస్తూంచే తెలియ జెయ్యసాగాయి.

హనుమాన్ ఆ రేడియో తరంగాల దిక్కుగా డాప్లర్ ఎఫెక్టు ఆధారంతో చేతులు బారసాచుకుని రాకెట్‌లాగ దూసుకపోయాడు.

కంట్రోలు గదిలోని ఒక టెలివిజన్ తెరమీద హనుమాన్ కనిపిస్తూనే వున్నాడు. అతనిని ఫాలో అవుతున్న ఒక రాడార్ అతనినుంచి సంకేతాలను గ్రహించి ప్రదర్శించసాగింది. మరి కాసేపట్లో టి. వి. తెరమీద మరోచుక్క కనిపించింది. రెండు చుక్కలూ దగ్గ రయ్యాయి. హనుమాన్ ప్రతాప్‌ని దొరక బుచ్చుకున్నాడని కంట్రోలుగదిలోనివారు గ్రహించారు. మరో పదినిమిషాలలో ఎయిర్‌లాక్ తెరుచుకుని హనుమాన్ ప్రతాప్‌ని లోనికి తీసుకువచ్చాడు.

కంట్రోలు గదిలోని అందరూ ఆ మరమనుషలను చుట్టుముట్టారు. ప్రతాప్‌లో చలనంలేదు. నరేంద్ర విరిగి





నట్లున్న ప్రతాప్ చెయ్యిని పరిశీలించాడు. తెరిచిచూస్తే కొన్ని వైర్లు తెగివున్నాయి.

"కాలు జారినప్పుడు చేతితో గట్టిగా ఇనుపకమ్మిని పట్టి వుంటాడు వైర్లు కాస్తా తెగాయి" అని ఆ వైర్లను కలర్ కోడ్ ప్రకారం అతికాడు. ఆ వైరుల్లోనే లోపలి బేటరీని కలిపే వైరు కూడా తెగిపోవడం చేత ప్రతాప్ అచేతనంగా ఉండిపోయాడు. వైర్‌లెస్ సెట్‌కి బేటరీ కనెక్షన్ సరిగ్గానే వుంది గనక పని చేసింది. వైర్లు అతకగానే ప్రాణం వచ్చినట్లులేచాడు. అందరూ చచ్చిన మనిషి బ్రతికినంత సంతోషాన్ని పొందారు.

కమాండర్ జగదీష్ హనుమాన్‌ని చూసి "థేంక్యూ హనుమాన్" అన్నాడు.

"వెల్‌కమ్ బాస్"

"నువ్వింక వెళ్ళి రెస్టు తీసుకో" అని జగదీష్ చెప్పగానే "థేంక్యూ బాస్" అని హనుమాన్ తన రూమ్‌లోకి నిష్క్రమించాడు.

కమాండర్ జగదీష్ భూమి మీది హైదరాబాదులోని రోదసీ కేంద్రానికి తాము హనుమాన్ సర్వీసుని అత్యవసర పరిస్థితులలో వాడుకున్న విషయాన్ని ప్రసార యంత్రంలో తెలియజేశాడు. ఆ సందేశం భూమి వేపు ప్రయాణిస్తుండగానే ఎవరి గదులకు వాళ్లు వెళ్ళిపోయారు.

ప్రొఫెసర్ ప్రసాద్ తన గది వేపు నడిచాడు. అతని ఆలోచనలు మరోసారి భూమికి సాగిపోయాయి. ఇంతకాలం రోదసీలో ఎప్పుడూ వుండలేదు. ఇంకా ఆ గ్రహాన్ని పేల్చాల్సి ఉంది. ఆ తర్వాతే భూమికి బయలుదేరాలి. భూమిని చేరడానికి మరో రెండేళ్ళ టైం తీసుకుంటుంది.

ఆ రోజున బంగాళాఖాతంలో ఆ పెద్ద ఉల్క పడకపోతే ఈ గ్రహశకలం భూమి వేపు వస్తున్నట్లు తెలిసేదేకాదు. తెలియకపోతే భారతదేశం ఈ అశ్విని నౌకని, అమెరికా, రష్యా దేశాలు మరో రెండు వ్యోమ నౌకలను అణుబాంబులతో పంపేవికావు. సుశీలా నేనూ హాయిగా ఏ టేంక్‌బండ్‌కో, గండిపేటకో షికారుకి పోయేవారు. పెళ్ళయిన రెండేళ్ళలోనే ఈ ఎడబాటేమిటి, స్పేస్‌మెన్ ట్రయినింగు, స్పేస్‌నేవిగేషన్, ఏస్ట్రోఫిజిక్స్‌లో డాక్టరేట్ ఇవన్నీ తనని తగిన అభ్యర్థిగా నిర్ణయించాయి.

ఈ రోదసీ యానానికి ఒప్పుకుని తను తప్పు చేశాడా? భూమికి ప్రళయం నిజంగా వస్తే మొత్తం జీవరాశి నశిస్తుంది. పది కిలోమీటర్ల వ్యాసంగల ఈ గ్రహం గనక భూమిని ఢీకొంటే ఇంకా ఏమన్నా వుందా! అందరూ చనిపోతే సుశీలా, తనూ మాత్రం బతుకుతారా?

అతని ఆలోచనలు గతంలోకి వెనక్కి వెళ్లాయి. రోదసీయానానికి నాందిపలికిన ఆనాటి సంగతులు జ్ఞాపకం రాసాగాయి.




ఆ రోజు 2080 సంవత్సరం, జూన్ ఎనిమిదో తేదీ. తెల్లవారుజామున నాలుగు గంటలౌతోంది. విశాఖపట్నం పౌరులు గాఢ నిద్రలో వున్నారు. 25 లక్షల జనాభాగల విశాఖపట్నం రోడ్లు ఎప్పుడూ




నిర్మానుష్యం కావు. ఒకటీ అరా కార్లు నున్నటి రోడ్ల మీద సాగిపోతున్నాయి. ఉన్నట్లుండి ఆకాశంలో మెరుపు మెరిసి నట్లు పట్టణం తెల్లగా వెలిగింది. వేలాది సెర్చిలైట్లు వెలిగించినంత కాంతి. భయంతో కార్ల మీద పోతున్న జనం ఆగిపోయారు.

ఆకాశంలోంచి వేలాది ఉల్కాలు ఒక్కసారిగా నేల రాలుతున్నట్లు కొండంత మరుగుతున్న లోహం బంగాళాఖాతంలో తీరానికి పదిమైళ్ళ దూరంలో పడింది. ఆ కాంతిని చూసిన వాళ్ళలో కొందరు అంధులయ్యారు. సముద్రం మరిగి నీటి ఆవిరులు లేచాయి. పెద్ద ఆటంబాంబు పేల్చినంత ధ్వని తరవాత వినిపించింది. ఉధృతమైన గాలులు వీచాయి. ఉప్పెన లాంటి పెద్ద కెరటాలు రావడం మొదలు పెట్టాయి. పదిహేను మీటర్ల ఎత్తైన తరంగాలు విశాఖపట్నం భీమునిపట్నం, మచిలీపట్నం, కళింగపట్నం తీరాలను తాకాయి. తీరం పొడుగునా కొన్ని మైళ్ళ దాకా గల తీర గ్రామాలు, పట్టణాలు మునిగి లక్షల మంది జనం చని పోయారు. ఎంతో ఆస్తినష్టం జరిగింది.

కొన్ని లక్షల టన్నుల బరువుగల గ్రహశకలం సూర్యునివేపు పోతూ భూమ్యాకర్షణకు లోనై పడిపోయిందని శాస్త్రజ్ఞులు లెక్కలుకట్టి తెలియజేశారు.

భారత రోదసీ సంస్థ ఈ ఉల్కా పాతాల నుంచి ఎలా తప్పించుకోవాలి, ఏ చర్యలు తీసుకోవాలి అనే విషయం చర్చించడానికి ప్రపంచదేశాల శాస్త్రజ్ఞులను, ఇతర రంగాలలోని ప్రముఖులను ఢిల్లీలో సమావేశపరిచింది. ఆ సమా వేశానికి అధ్యక్షత వహించిన భారత రోదసీ సంస్థ డైరక్టరు ఆహ్వానితులనుద్దే శించి—

"గత శతాబ్దంలో ఇలాంటి ఉత్పాతం ఎప్పుడూ జరగలేదు. ఆ గ్రహశకలం మరికాస్త పడమరగా పడినట్లైతే విశాఖ పట్నం మొత్తం దగ్ధమయ్యేది. ఉల్కాలు భూమిమీద పడడం విచిత్రంకాదు. రోజుకి కోటి ఉల్కాలు భూమిమీద పడుతున్నాయని ఖగోళ శాస్త్రజ్ఞులు చెపు తున్నారు. అవి వాతావరణంలోనే దగ్ధం అయిపోతాయనీ, పెద్దవి భూమిని ఢీ కొంటాయనీ మనకి తెలుసు. గ్రీన్‌లేండులో ఎడ్మిరల్ పియరీ కనుక్కొన్న 36 టన్నుల ఉల్కా న్యూయార్కు మ్యూజియంలో ఉన్న సంగతి మనకు తెలుసు.

క్రీ.శ. 1908,జూన్ 30న ఒక ఉల్కా మాస్కో నగరాన్ని మట్టుపెట్టి వుండేదే. అదృష్టవశాత్తూ ఆ నగరానికి నాలుగువేల కిలోమీటర్లదూరంగా సైబీరియా ఎడారిలో పడింది. అది నిర్మానుష్యమైన ప్రదేశం గనుక సరిపోయింది. అలాగే 1947 ఫిబ్రవరి 12న మరో ఉల్కా వ్లాడివోస్టాక్ పట్టణాన్ని నాశనం చెయ్య వలసిందేగానీ గండం తప్పింది. అవి ఆ రోజుల్లో నిర్మానుష్య ప్రాంతాలుగనక జననష్టం జరగలేదు. ఆ రోజుల్లో భారత ప్రజలు ఆసేతు హిమాచల పర్యంతం అనే వాక్యం జనసాంద్రత పెరుగుతున్న దనే అర్థంలో వాడేవారు. ఈనాడు సహారా ఎడారిలేదు. సైబీరియాలేదు. సముద్రంలేదు. కొండ కొమ్ములేదు. సూటిగా చెప్పాలంటే భూ, నగ,సాగర, ధృవతల పర్యంతం జనాభా నిండిపోయి వుంది. గనుక ఇలాంటి ఉల్కాపాతాలను గురించి అశ్రద్ధచెయ్యలేము.

మొన్న బంగాళాఖాతంలో పడ్డదాని కన్నా పెద్దది రేపే మధ్యధరా సము

ద్రంలో పడవచ్చును. ఇటలీ మొదలైన తీరప్రాంత ఐరోపా దేశాలు, వెనిస్ వంటి ఎంతో చరిత్రను, పురాతన కళాఖండాలను కలిగివున్న పట్టణాలు సముద్రగర్భంలో కలిసిపోవచ్చును. లేదా మరో వంద ఏళ్ళదాకా ఏ ఉల్కా పడకపోవచ్చును. కాని ఇలాంటి అనిశ్చిత స్థితిలో బతకవలసినరోజులు కావుయివి అని నా ఉద్దేశం.

శాస్త్రీయ విజ్ఞానం నేడు ఎంతో పెంపొందింది. బుధగ్రహం మీద సూర్యుని మచ్చలు, వేడికి సంబంధించిన సమాచారం పంపడానికి ఒక పరిశోధన శాలను ప్రతిష్టించామ్ము. సూర్యరశ్మితో



పనిచేసే ఎన్నో ఉపగ్రహాలను రోదసి నుంచి రేడియో, టి.వి. కార్యక్రమాలను రిలే చెయ్యడం కోసం ప్రయోగించాము.

చంద్రునిమీద కృత్రిమ వాతావరణం నింపిన డోమ్‌తో స్టేడియం నిర్మించి అందులో లూనార్ ఒలింపిక్స్ నిర్వహిస్తున్నాము..

గురుగ్రహపు ఉపగ్రహం యూరోపా మీద, శనిగ్రహపు ఉపగ్రహం మిమాస్ మీదా మన పరిశోధనశాలలున్నాయి.



ఇంత ప్రగతి సాధించిన మనం భూమ్యాకర్షణలో పడిన గ్రహశకలాల ఉనికిని గుర్తించి భూమిమీది రోదసీ కేంద్రాలకు తెలియజేసే ఉపగ్రహాలను ప్రయోగించకపోవడం చాలా శోచనీయం. అందుకని ఆ అభిప్రాయాలు తెలియజేయమని భారతదేశం కోరుతోంది" అని తన ఉపన్యాసాన్ని ముగించాడు.

అమెరికా, రష్యా, జపాన్, బ్రిటన్, దేశాల శాస్త్రజ్ఞులు ఆ వాదాన్ని సమర్థించారు. వెంటనే సంచారి-1, సంచారి-2 సంచారి-3 అనే మూడు, ఉపగ్రహాలను స్థిర కక్ష్యల్లో ప్రవేశపెట్టాలని నిర్ణయించారు. ఆ ఉపగ్రహాలు అన్ని వేపులా

రోదసీని పరిశీలించి భూమి ఆకర్షణకులోనై పడిపోతున్న ఉల్కలను గుర్తించి అవి ఏ ప్రాంతంలో పడబోతున్నదీ కంప్యూటర్ల ద్వారా లెక్కకట్టి ఆయా ప్రాంతాల రోదసీ కేంద్రాలకు తెలియజేసేలాగ రూపొందించాలనుకున్నారు.

ఆ మేరకు అనుకున్నట్లుగానే వాటి రూపకల్పనను పూర్తిచేసి 2082 సంవత్సరం డిసెంబరులో మూడు సంచారి ఉపగ్రహాలను స్థిరకక్ష్యలో ప్రవేశపెట్టారు.

ఆ నాటి నుంచీ మరో ఆరునెలల దాకా పది కిలోగ్రాముల కన్నా పెద్దగా వున్న ప్రతి ఉల్కనీ భూమి వాతావరణంలో చొరకుండానే గైడెడ్ మిసైల్‌తో మార్గ మధ్యంలోనే పేల్చివేసి జన నష్టం లేకుండా ఆ గస్తీ ఉపగ్రహాలు చూస్తున్నాయి. భారతదేశం నడుం కట్టి అంత మంచి సూచన చేసినందుకు ప్రపంచ దేశాలు కొనియాడాయి.

* * *

2083, జూన్ 20న హైదరాబాదు రోదసీ కేంద్రంలోని రిసీవరు ప్రమాద సంకేతాన్ని వినిపించింది. అపరేటర్లు విషయాన్ని గ్రహించారు. సంచారి-3 ఉపగ్రహం ధనుస్సు నక్షత్రరాశి దిశగా పెద్దగ్రహశకలం రావడం గుర్తించింది. దాని పరిమాణం పది కిలోమీటర్ల వ్యాసం కలిగిన పెద్ద గోళం లాగ వుంది. అది సూర్యుని ఆకర్షణకు లోనైన, యితర నక్షత్రమండలానికి చెందిన గ్రహశకలం అని ఋజువైంది.

సంచారి ఉపగ్రహాలలోని కంప్యూటర్లకు అంగారక, గురుగ్రహాల మధ్యనున్న గ్రహశకలాల గతులు పరిమాణాలు మొదటే శాస్త్రజ్ఞులు పరిచయంచేశారు. కేరెస్, పల్లాస్, జూనో మొదలుగాగల యాభైవేల గ్రహశకలాలను గుర్తుపట్టడమే గాక కొత్త వాటిని కూడా జ్ఞప్తిలో వుంచుకుంటున్నాయి. ఈ కొత్త గ్రహశకలం వాటిల్లోది కాదని తెలిపాయి.

ప్రపంచంలోని అన్ని రోదసీ కేంద్రాలకీ ఒకే సమాచారం అందింది. వెంటనే శ్రద్ధ తీసుకుని ఆ గ్రహశకలాన్ని గనక మధ్యలోనే పేల్చివెయ్యకపోతే ఆరు సంవత్సరాలలో అది భూమిని తాకుతుంది. అది గనక ఢీకొంటే ప్రళయం సంభవించడం ఖాయం అని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు. అది మామూలు చిన్న చిన్న టి.ఎన్.టి బాంబులతో నాశనం కాదని, ఎన్నో మెగా టన్నుల శక్తిగల అణుబాంబులు దాని కభిముఖంగా పేలిస్తే తప్ప అది పేలదని కనుక్కున్నారు.

ప్రపంచదేశాలు ఎవరికి వారు రోదసీ నౌకల మీద తగినంత అణుశక్తితో రోదసీ నావికులను పంపి ఆ గ్రహశకలం అంగారక గ్రహాన్ని చేరుకునే లోగానే ఎదురువెళ్ళి పేల్చెయ్యాలని నిర్ణయించారు. భారతదేశం తన వంతుగా అశ్వని అనే రోదసీ యుద్ధ నౌకని సుశిక్షితులైన రోదసీ నావికులను ఎన్నిక చేసి ప్రయోగించాలని నిశ్చయించింది.

* * *

అశ్వని రోదసీ నౌకలో ప్రయాణించే నావికులను ఎన్నికచేశారు.

నౌక కమాండరుగా కెప్టెన్ జగదీష్‌ని నియమించారు. అతను 2035లో పుట్టాడు 2057లో మెకానికల్ ఇంజనీరింగు పాసయ్యాడు. అదే సంవత్సరంలో ఎయిర్‌ఫోర్స్‌లో కమిషన్ దొరికింది. పైలట్ ఆఫీసరుగా శిక్షణ పొందాడు. స్పేస్




నేవిగేషన్, స్పేస్‌మెన్ ట్రయినింగుకూడా పూర్తిచేశాడు. ఎయిర్‌ఫోర్సు నుంచి 2072లో బయటికి రావడానికి ముందు ఎన్నోమార్లు చంద్రుని మీదకి నెల నెలా వెళ్లే చంద్ర నౌకని దిగ్విజయంగా నడిపాడు. రక్షణ శాఖకు చెందిన ఎన్నో రిసెర్చి టీమ్స్‌ని కెప్టెన్ జగదీష్ చంద్ర తలం మీద దించి దిగ్విజయంగా వెనక్కి తీసుకువచ్చాడు. 2073లో భారతీయ రోదసీ సంస్థలో సివిలియన్ స్పేస్ పైలట్ ఆఫీసరుగా చేరాడు.

భారాధిక స్థితిలో గాని, భారరహిత స్థితిలోగాని అతని గుండె పని చేసిన తీరు ఒక రికార్డు స్థాపించింది. రోదసీ యాత్రికులకు ఇచ్చే శిక్షణలో (స్పేస్‌మెన్ ట్రయినింగు) మూడు రెట్లు గురుత్వాకర్షణ శక్తిగల ఒత్తిడికి 15 నిమిషాలు తట్టుకున్నాడు. ఐదునిముషాల కన్నా ఎక్కువ సేపు ఎవరూ తట్టుకోలేరు. మొత్తం రోదసీలో రెండు సంవత్సరాలకిపైగా భారరహిత స్థితిలో వున్నది భారతదేశంలో కెప్టెన్ జగదీష్ ఒక్కడే! చంద్రుని మీద ప్రపంచదేశాలు ఒలింపిక్ డోమ్‌ని 2075లో నిర్మించినప్పుడు భారతదేశపు సాంకేతిక నిపుణులని తరలించింది కూడా ఆయనే! అందుకని అశ్వినిని నడిపి ఆ గ్రహశకలాన్ని ధ్వంసం చేసే పనికి సమర్థునిగా భావించి అశ్విని నౌకకి కమాండరుగా ఎన్నికచేశారు.

రెండో అభ్యర్థి ప్రొఫెసర్ ప్రసాద్. ఇతను 2030లో హైదరాబాదులో జన్మించాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చదివి 2052లో ఏస్ట్రోఫిజిక్స్‌లో ఎమ్.ఎస్‌సి. పాసయ్యాడు. భూమిమీద దొరికిన ఉల్కలు, బొలైడ్‌లమీద పరిశోధన చేశాడు.2057లో డాక్టరేట్ పొంది భారత రోదసీ సంస్థలో చేరాడు. పరిశోధన మీద ఉత్సాహం చేత వివాహం కూడా చేసుకోలేదు. తర్వాత స్పేస్ నేవిగేషన్, స్పేస్‌మెన్ ట్రయినింగు శిక్షణ పూర్తి చేశాడు. చంద్రశిలల మీద పరిశోధన చేశాడు. చంద్రలోకయాత్ర ఒలింపిక్ డోమ్ కట్టడానికి ముందే ఎన్నోసార్లు చేశాడు. అప్పుడే తన ప్రాణాలను లెక్క చెయ్యకుండా మరొకరి ప్రాణాలను కాపాడతాడని రుజువుచేశాడు. ఒకమారు చంద్రతలం సర్వే చెయ్యడానికి, ఉల్కావశేషాలను గ్రహించడానికి మరో రోదసి పైలట్‌తో కలిసి నౌకని వదిలి స్పేస్ సూట్, ఆక్సిజన్ సిలెండర్లు ధరించి ఫర్లాంగు దూరం దాకా వెళ్లారు. ఉన్నట్టుండి ఆ పైలట్ కిందపడి కొట్టుకుంటూ సిలిండరు వేపు చూపించాడు. ప్రసాద్ ఆ సిలిండరులో ఆక్సిజన్ అయిపోయిందని గ్రహించాడు. అతనిని కాపాడడానికి తన సిలిండర్ని అతనికి తగిలించడం ఒకటే మార్గం. వెంటనే వీపు మీది సిలిండర్ని విడదీసి ఊపిరితిత్తుల నిండా ఆక్సిజన్ పీల్చుకుని అతనికిసిలిండర్ని అమర్చాడు. నౌక వేపు గబాగబా పరుగుతీశాడు. స్వచ్ఛమైన ప్రాణవాయువు పీల్చి ఎవరైనా అయిదునిమిషాలదాకా వుండవచ్చును. కాని ప్రసాద్ పది నిమిషాలలో నౌకని చేరి మరో సిలిండరు తగిలించుకుని ఆ పైలట్ ప్రాణాలను కాపాడడమే గాక తన ప్రాణాలను కూడా కాపాడుకుని నౌకలోని అందరి మన్ననలను పొందాడు.

2081లో తన యాభై ఒకటో ఏట వివాహం చేసుకున్నాడు. అతనిని ఒక అభ్యర్థిగా రోదసీ సంస్థ ఎన్నికచేయటంతో వివాహం జరిగిన రెండేళ్ళలోనే ఈ

ప్రయాణం తగిలింది. అతనిభార్య ఎద్దని ప్రాధేయపడినా ప్రసాద్ బయలుదేర డాన్ని రోదసీ సంస్థలోని అందరూ ప్రశంసించారు.

మూడో వ్యక్తి ఇంజనీర్ సూర్య కుమార్. రాకెట్ ఇంజనీరింగ్, రోదసీ నౌకల తయారీ, శూన్యంలో మండే ద్రవ ఇంధనాలు, ఇంజన్లు పనిచేసే తీరు మీద ఎన్నో పుస్తకాలు రాశాడు. ఇంజనీరే కాకుండా మంచి ప్రాక్టికల్ మెకానిక్ కూడాను. జగదీష్, ప్రసాద్‌లకన్నా చిన్న వాడు. స్పేస్‌మెన్ ట్రయినింగులోనే వాళ్లతో పరిచయం అయింది.

ఏ విషయాన్నైనా జాగ్రత్తగా ఆలో చించే తత్వం. రిస్కు తీసుకోవడానికి జంకని వ్యక్తిత్వం. ఎన్నో సందర్భాలలో రోదసీ ప్రయాణాలు చేశాడు. భూమి నుంచి భారతదేశం ప్రయోగించిన రోదసీ

ప్రయోగశాలలకు కావలసిన ఇంధనం భూమినుంచి సరఫరా చేసే సందర్భాలలో రోదసీ ప్రయోగశాలలకి రోదసీ నౌకని సందాన పరచడంలో సిద్ధహస్తుడు.

ఇండియన్ ఎయిర్ లైన్స్‌లో పనిచేసే డాక్టరు సరోజని వివాహం చేసుకున్నాడు.

నాలుగో వ్యక్తి డాక్టరు సరోజ. రోదసీ నౌకలో ఒక డాక్టరు అవసరం. ఆ వేకెన్సీలో తన భర్తతో ప్రయాణించే అవకాశం కల్పించమని, తనకి భయంలేదని అప్లికేషన్ పెట్టుకుంది. కాని ఆమె స్పేస్ మెన్ ట్రయినింగు అవలేదు. ఆ శిక్షణ పొందకుండా సెకండుకి ఏడు మైళ్ళ వేగంతో భూమినుంచి దూసుకుపోయే వేగానికి తట్టుకోవడం కష్టం. అదే విషయాన్ని ఆమెకు అభ్యంతరంగా తెలియజేశారు.

ఆమె ఆ శిక్షణను నెలరోజుల్లో పూర్తి చేస్తానని ముందుకి వచ్చింది. ఆ శిక్షణ పొందే వ్యక్తిని రంగుల రాట్నంలాంటి అతివేగంగా భ్రమణాలు చేసే సెంట్రి

ఫ్యూజ్ లో వుంచుతారు. అందులో భూమి ఆకర్షణకన్నా రెండు, మూడు రెట్లు ఆకర్షణ శక్తి కలుగుతుంది. శిక్షణ సమయంలో భారాధికస్థితి కలుగుతుంది, ఆ స్థితికి తట్టుకోలేని వ్యక్తి చేతిలోని స్విచ్చిని నొక్కగానే బయట ఎర్రని లైటు వెలుగుతుంది. అప్పుడు సెంట్రిఫ్యూజ్ భ్రమణాలు ఆపివేస్తారు. మెల్లమెల్లగా శిక్షణ పొందుతున్న వ్యక్తికి మూడురెట్లు భారాధిక స్థితికి తట్టుకునే సామర్థ్యం అలవడుతుంది. డాక్టరు సరోజ ఆ శిక్షణని పూర్తిచేసి అశ్వనిలో డాక్టరుగా వెళ్లే అర్హతని సంపాదించుకుంది.

అశ్వనిలో వెళ్లడానికి ఎన్నికైన ఐదవ చివరి వ్యక్తి నరేంద్ర. మంచి క్రీడాకారుడు. శిక్షణపొంది, 2080లో జరిగిన లూనార్ ఎలక్ట్రానిక్స్ లో యమ్. యస్ సి. పాసయ్యాడు. కంప్యూటర్ ప్రోగ్రామింగ్ లో డిప్లొమా వుంది.

నరేంద్ర భారరహిత స్థితిలో కూడా అన్ని పనులూ భూమి మీదలాగే నిర్వహించి ఎన్నో బహుమతులు గెలుచుకున్నాడు. ముఖ్యంగా చంద్రుని మీద భూమిలో ఆరోవంతు ఆకర్షణ శక్తిలో బేలన్సు చేసుకుంటూ పడకుండా ఉండటాన్ని సాధించడం అతనిని గొప్పవాణ్ని చేశాయి. అతనే తనంత తానుప్రయత్నించి అశ్వనిలో ప్రయాణించడానికి అనుమతి సంపాదించుకున్నాడు. కొన్ని అత్యవసర పరిస్థితుల్లో అటువంటి వ్యక్తి అవసరం వుంటుందని రోదసీ సంస్థ అధికారులు అంగీకరించారు.

వారితోబాటు ఇద్దరు మర మనుషులు వున్నారు. అందులో ప్రతాప్ ని సూచనలు గ్రహించి ఏ పనుల నైనా నిర్వహించడానికి రూపొందించారు. కాని మాట్లాడడానికి ప్రోగ్రామ్ చెయ్యబడలేదు. అందుచేత నమ్మినబంటులాగ పనిచెయ్యడమే తప్ప ఎదురు మాట్లాడడు.

రెండో మరమనిషి హనుమాన్ లా ఎన్నో రకాల ప్రజ్ఞా పాటవాలు ప్రదర్శించగల రొబాట్ ని మరే ఇతర దేశమూ తయారు చెయ్యలేదు. దగ్గరకు వెళ్లి స్విచ్ నొక్కే పనేలేదు. దూరం నుంచే శబ్ద తరంగాలనుగ్రహించి అర్థం తెలుసుకొని ఆ పని నిర్వహించగలడు.సమాధానం కూడా చెప్పగలడు.హనుమాన్ ని అశ్వనిలో పంపడానికి అధికారులు ఎప్పుడైతే నిర్ణయం చేశారో కమాండర్ జగదీష్, ప్రొఫెసర్ ప్రసాద్ మొదలైన అశ్వనిలో ప్రయాణించబోతున్న అందరికీ కొండంత ధైర్యం వచ్చింది.

రోదసీ యాత్రకు ఎన్నికైన వారందరూ తెలుగువారు కావడం ఒక విశేషంగా భారతదేశంలో అందరూ భావించారు. దానికి కారణం స్పేస్ మెన్ ట్రెయినింగ్ శ్రీహరికోటలో వుండడం, లూనార్ ఎక్స్ కర్షన్ టూర్లు శ్రీహరి కోటనుంచే కండక్టు చెయ్యడం, నెలకొకమారు చంద్ర నౌక చంద్రుని మీదకు బయలుదేరుతుండడం చేత తెలుగువాళ్లు ఆ రంగంలో ముందుకు వచ్చారని అర్థం చేసుకున్నారు. కాకపోతే హనుమాన్ ని తెలుగు మాట్లాడేలాగ రూపొందించలేకపోయారు. దానికి కారణం తెలుగు నిఘంటువుని మైక్రో చిప్ లో ప్రోగ్రాం చెయ్యలేకపోవడమే. హనుమాన్ ని ఇంగ్లీషు అర్థం చేసుకునేలాగ, మాట్లాడేలాగ రూపొందించారు.

15 సంవత్సరాలకు సరిపడా కండెన్సుడు ఆహారం సమకూర్చి 208లో, జనవరి నాటికి సన్నాహాలు పూర్తి చేసి





ప్రయోగించడానికి నన్నాహాలు ప్రారంభించారు.

* * *

అశ్వని రోదసీ నౌకకి రూపకల్పన చెయ్యడంలో ఇంజనీర్లు వాళ్ల శక్తి సామర్థ్యాలు పూర్తిగా చూపించారు. దాదాపు యాభై కోట్ల మైళ్లు ప్రయాణించి రావడానికి ఆరు సంవత్సరాలు పడుతుంది. అంత ఎక్కువ కాలం రోదసీలో వుండే నావికులకు తగిన సౌకర్యం లేకపోతే కష్టం. భూమి మీదనేవున్నట్లు మామూలు గదులలో లాంటి ఫర్నిచరు అదీ సమకూర్చారు.

గాలి ఒత్తిడి భూమి మీద వున్నట్లే నౌకలో నింపారు. భూమి ఆకర్షణ శక్తి ఎంత వుంటుందో అంతే శక్తితో నేలను ఆనుకుని నిలబడేలాగ సెంట్రిఫ్యూగల్ ఫోర్సులో సాధించారు. ఆ సెంట్రిఫ్యూగల్ ఫోర్సు రాబట్టడానికి పది సెకెండ్లకు నౌక ఒక భ్రమణం చేసేలాగ ఏర్పాటు చేశారు.

అలాగ చెయ్యడం వలన నౌక అంతర్భాగంలోని అన్ని వేపుల గోడల మీద నిలబడి అన్ని పనులు నిర్వహించవచ్చును. బయటినుంచి చూసే వ్యక్తికి మాత్రం వాళ్లు గోడకి కొట్టిన మేకుల్లాగ కనిపిస్తారు. కాని వాళ్లకి మాత్రం నేలమీద నిలబడినట్లే అనుభూతి కలిగేలాగ రూపొందించారు. నౌక మధ్యభాగంలో మాత్రం గురుత్వాకర్షణ అసలు వుండక భార రహిత స్థితి మనిషి అనుభవంలోకి వస్తుంది!

నౌక మధ్య శూన్య ప్రదేశాన్ని అలాగే వదిలేస్తే తల పైకెత్తి చూసే మనిషికి అవతలి గోడమీద నిలబడ్డ మనిషి తల కిందులుగా రూఫ్ పైనుంచి వేలాడినట్లు కనిపిస్తాడని, దాని వలన రోదసీయానం చేస్తున్నాననే జ్ఞాపకం వస్తుందని మధ్యభాగాన్ని మూసివేశారు.

యాభై అడుగుల వ్యాసం కల నౌక మధ్యభాగాన్ని వృత్తాకారపు రేకుతో మూసివేశారు. ఆ రేకు నెత్తి మీద రూఫ్ లాగ కనిపించేలాగ చేశారు. ఆ మధ్య భాగంలో రాకెట్‌ని నడిపే 'అణుయింధనాన్ని, యితర నీటి టేంకు, ఖారజలం టేంకులలాంటివి బిగించారు.

అన్ని గదులను వృత్తాకారంగా నిర్మించి ప్రతిగది ఎదురు గుండా నౌక చుట్టూ లోన తిరగడానికి వీలుగా వరండాతో కలిపారు. ఒక్కొక్క నావికునికి ఒక్కొక్క గది అన్ని సౌకర్యాలతో తీర్చిదిద్దారు.

ఒక గదిని మాత్రం వారు నౌక బయటి ఉపరితలానికి వెళ్ళడానికిగాను విడిచిపెట్టారు. ఆ గదిలోని బయటి భాగంలో వేక్యూమ్ గది, దానికి ఎయిర్ లాక్స్ అమర్చారు.

సబ్‌మెరీన్ సముద్ర గర్భంలో వున్నప్పుడు బయటికి రావాలన్నా, లోనికి పోవాలన్నా ఒక నీటి గది, దానికి పైనా కిందా తలుపులూ ఎలాగ వుంటాయో రోదసీ నౌకకి దానిలోని గాలి తప్పించుకుపోకుండా ఎయిర్‌లాక్స్ వుంటాయి. ఆ లాక్స్‌ని ఫూల్ ప్రూఫ్ పద్ధతిలో ఇంజనీర్లు తయారుచేశారు.

రోదసీ నౌకలో వాళ్లు మానసికంగా హాయిగా వుండడం కోసమే నౌకని అలాగ తీర్చిదిద్దారేగాని, నిజానికి రోదసీలో గురుత్వాకర్షణ లేకపోయినా శరీరం తన పనిని సక్రమంగానే నిర్వహించగలదు. గుండె ఎంతో సునాయాసంగా కొట్టుకుంటుంది. కాళ్ళూ, చేతులూ లాంటి కర్మేంద్రియాలు; కళ్ళు, చెవులూ



లాంటి జ్ఞానేంద్రియాలు యధావిధంగా పని చేయగలుగుతాయి. కిందా మీదా అనేది వుండదు గనుక గాలిలో గిరగిరా పల్టీలు కొట్టుకుంటూనే పనిచెయ్యగలదు. కాకపోతే తల్లకిందులుగా వున్నప్పుడు మాత్రం మానసికంగా కాస్త ఇబ్బంది కలుగుతుంది. ఆ విధంగా కూడా చాలా సేపు పనిచెయ్యవచ్చును. దీనిని బట్టి గురుత్వాకర్షణ పెద్ద సహాయం చెయ్యడం గాని, హాని చెయ్యడంగాని అంతవుండదు. శరీరానికి కావలసిన ఆహారం సమకూర్చాలే గాని ఎన్ని సంవత్సరాలైనా నిశ్చింతగా రోదసిలో జీవించవచ్చును. గుండె కూడా రక్తాన్ని పంపు చెయ్యడానికి అంత శ్రమపడదు.

అశ్వనిలో ప్రయాణించడానికి ఎన్నికయినవాళ్ళందరూ ఒక్క డాక్టరు సరోజ తప్ప రోదసిలో అతిసాధారణ పద్ధతిలో ఏళ్ళతరబడి ఉన్నవారే! అయినా చాలా కాలం వుండాలి గనక నౌకకి మంచి రూపకల్పన చేశారు. నౌక భూమ్యాకర్షణ దాటిపోయేదాకా మాత్రం నౌక కింది భాగం నేలలాగా కనిపిస్తుంది. ఒక్కసారి తూర్పుకి తిరిగి గమ్యం వేపు చూసుకపోయిన తరువాత నౌక, భ్రమణాలు చేయించడానికి పక్కలకు చిన్న రాకెట్లను అమర్చారు. అవి పనిచేసి నౌక పది సెకెండ్లకు ఒక భ్రమణం చేస్తుంది. అప్పుడు భ్రమణాలు చేసుకుంటూ గమ్యం వేపు ప్రయాణం చేసేలా తయారుచేశారు.

అన్ని విధాలా అశ్వని నౌక ప్రయాణానికి సౌకర్యంగా వుందని, నిర్మాణంలో ఎటువంటి లోపం లేదని నిపుణులు నిర్ధారణ చేశారు. 2083 జనవరి నాలుగో తేదీని అశ్వని బయలుదేరింది. అనంత విశ్వంలో ధనుస్సురాశి వేపుగా ఆ గ్రహశకలాన్ని పేల్చెయ్యడానికై పోతోంది. అప్పుడే మూడేళ్ళు గడిచిపోయాయి. మరో 30 గంటలలో ఆ గ్రహాన్ని ఎదుర్కోబోతున్నారు.

నౌకని తాకిన ఉల్క తలంపునకి రాగానే ప్రొఫెసర్ ప్రసాద్ గుండె ఝల్లుమంది. 'హనుమాన్ ప్రమాదంలో ఆదుకుని ప్రతాప్‌ని మళ్ళీ తీసుకురాకపోతే ఏమయ్యేది' అనుకుంటూ నిద్రలోకి జారిపోయాడు.




ఇంటర్‌కమ్ బజర్ వినిపించి ఉలిక్కిపడి లేచాడు ప్రసాద్. టైము చూసుకున్నాడు. చాలా సేపు నిద్రపోయినట్లు గ్రహించాడు. టెలిఫోను క్రెడిల్ నుంచి లేపాడు.

"హల్లో! ప్రసాద్ హియర్" అన్నాడు.

"అయామ్ జగదీష్. నా రూముకి వెంటనే రండి. కొన్ని విషయాలు మాట్లాడాలి"

"నిమిషంలో వస్తున్నాను"

టెలిఫోను పెట్టేసి జగదీష్ గది వేపు దారి తీశాడు ప్రసాద్. మధ్యలోనే సూర్యకుమార్, డాక్టరు సరోజ గది వుంది. వాళ్లు నిద్రపోతూ వుంటారు అనుకుని ముందుకి సాగిపోయాడు. జగదీష్ గది ముందు ఆగి కాల్‌బెల్ నొక్కాడు.

"కమ్ ఇన్" అని జగదీష్ తలుపు తెరిచి లోనికి ఆహ్వానించాడు.

ప్రొఫెసర్ లోనికి ప్రవేశించి గెస్టు కోసం నిర్దేశించబడిన కుర్చీలో కూర్చున్నాడు.

ఎదురుగా వున్న మరో కుర్చీలో కెప్టెన్ జగదీష్ కూర్చుని "మీకు బాగా నిద్రపట్టిందా ప్రొఫెసర్" అనడిగాడు.

"మీకు తెలియనిదేముంది. ఏదో కలత నిద్ర మాత్రమే! నిన్న జరిగిన సంఘటన తరువాత ఏవేవో ఆలోచనలు" అన్నాడు.

"నాకూ అంతే! ఏమీ తోచక కంట్రోలు రూములో ఒక్కడినీ గ్రహశకలాన్ని రిఫ్లెక్టర్ టెలిస్కోప్‌లో చూస్తూ కూర్చున్నాను. మనం దానికి చాలా దగ్గరకి వచ్చేశాం. మరో పది గంటల్లో మన అసలు కార్యక్రమం మొదలౌతుంది. దానికోసం మనం చెయ్యవలసినదేమీ లేదని మీకు తెలుసును గదా! ఒక బటన్ వత్తితే చాలు. గైడెడ్ మిసైల్స్ బాంబుల్ని మోసుకుపోయి ఆ గ్రహాన్ని తాకి పేలుతాయి. కాని ఈలోగానే టెలిస్కోపులో గ్రహాన్ని చూసి ఒక కొత్త విషయాన్ని గ్రహించాను" అని చెప్పాడు.

ఆసక్తితో కమాండర్ మాటలు వింటున్న ప్రసాద్ కుతూహలంతో "ఏమిటది కెప్టెన్" అనడిగాడు.

"పదండి - కంట్రోలు రూముకి వెళదాం. టెలిస్కోప్‌లో చూపిస్తూ వివరిస్తాను" అని గది బయటికి నడిచాడు.

ఇద్దరూ కంట్రోలు రూము ప్రవేశించారు. టెలిస్కోపుని గ్రహశకలానికి ఫోకస్ చేశారు. ప్రసాద్ ఐ పీస్‌లో కన్ను వుంచి చూశాడు. ఆ గ్రహశకలం విచిత్రంగా కనిపించింది. గుండ్రని బంతి లాగ భ్రమణాలు చేస్తోంది. చాలా పెద్దదిగా కనిపిస్తోంది. 'ఇదేదో గ్రహం మరేదో సూర్యుని ఆకర్షణ నుంచి బయట పడి ఇలా శూన్యంలోనికి తప్పించుకుని భూమికేసి వస్తోంది కాబోలు' అనుకున్నాడు

"ఏం కనిపెట్టారు" అనడిగాడు కెప్టెన్.

"మీరు మొదటినుంచీ అనుకుంటున్నదే! సందేహం లేదు. ఇదేదో గ్రహం"

"అది సరే, మరో కొత్త విషయం గ్రహించలేదా?" అనడిగాడు.

"నో. చెప్పండి ఏమిటది?"

"భ్రమణాలు చేస్తోంది గదా"

"అవును"

"దాని ఇరుసు భాగం దగ్గర కని పెట్టి చూడండి". అని జగదీష్ వివరించాడు.

మరో మారు దీర్ఘంగా పరిశీలించి "ఎస్. ఏదో నల్లని గుండ్రని మచ్చ" ప్రొఫెసర్ చెప్పాడు.

"కాదు. ఇంకా బాగా ఫోకస్ చేసి చూడండి" అన్నాడు జగదీష్.

ప్రసాద్ బాగా పరిశీలించాడు. ధృవతల ప్రాంతంలోని ఆ నల్లని, గుండ్రని మచ్చ చుట్టూ మరో మూడు చుక్కలు పరిభ్రమిస్తూ కనిపించాయి. అదే విషయాన్ని జగదీష్‌కి చెప్పాడు.

"కరెక్ట్! ఇప్పుడు నేను గ్రహించిన విషయాలు మీకు వివరిస్తాను. మీరు కూడా ఆలోచించి మీ ఉద్దేశం తెలియజెయ్యండి. నా ఉద్దేశం ప్రకారం అది మరో సూర్యుని చుట్టూ తిరిగే గ్రహం కాదు. అలాంటి దానికి ఇలా ధృవం దగ్గర చుక్కలు




వుండవు. దీనిని ఎవరో మనకన్నా తెలివైనవారు ప్రయోగించి వుంటారు. ఇది తప్పకుండా ఒక కృత్రిమ గ్రహం. మనం అవతలి ధృవాన్ని చూడలేకపోతున్నాం గానీ అవతలి ధృవం మీద కూడా ఇలాంటి మచ్చలే వుండి తీరతాయి" అని వివరించాడు.

ప్రొఫెసర్ ప్రసాద్‌కి అతని ఊహ సబబుగానే కనిపించింది. తను ఎన్నో గ్రహ శకలాలను ఎంతో శక్తివంతమైన టెలిస్కోపుల్లో పరిశీలించాడు. ఇలాంటి రూపు దేనికీ లేదు. దీని ఉపరితలం కూడా నున్నగా, కంపాస్‌తో గీసినవృత్తం లాగ వుంది! వంకరటింకరలు లేవు. ఇదే జగదీష్ ఊహించినట్లు మరో నాగరిక జాతి ప్రయోగించివుంటే వాళ్ళెంత తెలివైన వాళ్ళయి ఉండాలి? పదికిలోమీటర్ల వ్యాసం గల ఇంత పెద్ద కృత్రిమ గ్రహాన్ని రోదసీలోనికి ప్రయోగించడం అంటే మాటలా అనుకున్నాడు.

"ఏమిటాలోచిస్తున్నారు?" అని అతని ఆలోచనలకి అంతరాయం కలిగించాడు జగదీష్.

"మీరనుకున్నది నిజమే"

"నాకిప్పుడొక కొత్త ఆలోచన వస్తున్నది. దీనిని మనం నాశనం చెయ్యడం అంత సబబు అంటారా?" అన్నాడు.

"ఏస్ట్రో ప్రొఫెసర్‌గా ఏ సృష్టినీ నాశనం చెయ్యమని నేనను. కాని మన మిషన్ బయలుదేరినది దీనిని విచ్ఛేదం చేసి భూమిని కాపాడడానికేనని మరిచిపోతున్నారా?"

"సరే అందరంకలిపి దీనిని గురించి ఆలోచించడానికి కావలసినంత వ్యవధి ఉంది. మనం గ్రహించిన సమాచారాన్ని భూమికి తెలియచేద్దాం. వాళ్ళ అభిప్రాయంకూడా తెలుసుకుందాం. ఇది భూమిని ఢీ కొట్టడానికి ఇంకా రెండేళ్ళకి పైగా వ్యవధి వుంది. మనకేం భయం లేదు. ఈలోగా ఎప్పుడంటే అప్పుడు దానిని పేల్చేయవచ్చును. కాని నామట్టుకు నాకు దానిని వెనకగా అనుసరించి దాని మీద ఆ ధృవతలంమీద మన నౌకతో దిగాలని వుంది" అని తన అభిప్రాయాన్ని చెప్పాడు జగదీష్.

ప్రసాద్‌కి జగదీష్ ధైర్యం, పట్టుదల తెలుసు. అతను నౌక కమాండరు. ఎలాంటి రిస్కు అయినా తీసుకోవాలా వద్దా అనేది నిర్ణయించుకోవలసినది ఆయనే అనుకుని "భూమిమీది మనవాళ్ళతో కూడా సంప్రదించండి. అలాగే అమెరికా, రష్యానౌకలకు కూడా మన అభిప్రాయం తెలియజెయ్యడం మంచిది" అని తన ఉద్దేశాన్ని తెలియజేశాడు.

"భూమికి ఇప్పుడే రేడియో మెసేజ్ పంపుతాను. రష్యా, అమెరికా నౌకల కమాండర్లకుమాత్రం మనం కనుక్కున్న విషయాలు చెప్పను. వాళ్ళు మనకన్నా తెలివితక్కువ వాళ్లేమీ కాదు. వాళ్ళ నిర్ణయం వాళ్ళు తీసుకుంటారు. మనం మాత్రం ఎదురుగా ఆటంబాంబులను ప్రయోగించవద్దు. మన నౌకని వెనక్కి మలిపి భూమిదిక్కుగా కొంతదూరం దానిని అనుసరిద్దాము. దాని వేగానికి సరియైన వేగంతో దగ్గరికి చేరి బాగా దగ్గరి నుంచి పరిశీలించిగాని బాంబులు ప్రయోగించడం నాకిష్టంలేదు"

కెప్టెన్ ఆలోచన సరిగానే వుందని అనుకున్నాడు ప్రొఫెసర్ ప్రసాద్.

ఎదురుగా వచ్చేదానిమీద బాంబులు ప్రయోగించినా ఒకవేళ ఆ గ్రహం దెబ్బ తప్పించుకుంటే నౌకని టర్న్ చేసి దానిని

వెంటాడడం కష్టం కావచ్చును. వెనక్కి తిప్పేసరికి గ్రహానికి, నౌకకి దూరం బాగా పెరిగిపోతే దానిని సమీపించడానికి జెట్స్‌వేగాన్ని పెంచవలసి ఉంటుంది. కలుసుకోలేకపోతే దానిని ఎప్పటికీ అందుకోలేము. అది కాస్తా తన పని పూర్తిచేసుకుని భూమిని గుద్దేస్తుంది. దానిమీద దిగడానికి కాకపోయినా చివరిదాకా దానిని వెంటాడి నాశనం చెయ్యడానికయినా ఇదే మంచి పద్ధతి అనుకుని తన ఆమోదాన్ని కెప్టెన్ జగదీష్‌కి తెలియజేశాడు.

మరికాస్తసేపట్లో ఇంజనీరు సూర్యకుమార్, డాక్టరు సరోజ తయారయి వచ్చారు. టెలిస్కోప్‌లో గ్రహాన్ని చూడమని వాళ్ళకి ఆదేశించాడు. వాళ్లు గ్రహాన్ని చూస్తుండగానే ప్రసాద్ వాళ్ళకు అన్ని సంగతులు వివరించాడు. ఈలోగా నరేంద్ర ఆదరాబాదరాగా వచ్చి-

"అయామ్ సారీ. నేను ఆలస్యంగా వచ్చాను. బాగా నిద్రపట్టేసింది" అన్నాడు.

"పర్వాలేదు. నువ్వు చెయ్యవలసిన ఘనకార్యాలు ముందున్నాయి'' అని జగదీష్ జరిగిన విషయాలు చెప్పాడు. నరేంద్ర కూడా టెలిస్కోప్‌లో గ్రహాన్ని చూశాడు - ఏవయినా ధైర్యసాహసాలు ప్రదర్శించే అవకాశాలకోసం ఎదురుచూస్తే









నరేంద్ర.

"నాకేమిటో ఈ రోదసీయాత్ర అనుకున్నంతపని కల్పించలేదు. ఆ గ్రహం మీద నిజంగా దిగడంఅంటూ జరిగితే నాకు ఈ యాత్ర సంతృప్తిని కలిగిస్తుంది" అన్నాడు.

"అవును. నీ సరదాకోసం అయినా మేం ఆ గ్రహంమీద దిగుతాం. పాపం. భూమిమీద చచ్చిన మనుషుల భూతప్రేతాలన్నీ ఈ గ్రహంలో దాక్కున్నాయేమో పీక్కు తినెయ్యగలవు" అన్నాడు సూర్యకుమార్ జోకుగా.

"భూతగ్రహం అంటారేమిటి దీనిని కొంపదీసి. అయితే తప్పకుండా పరిచయం చేసుకోవలసిందే. భూతాలను పీక్కుతిన గల వాళ్లు ప్రాణంవున్న మనుషులే అని ఋజువు చేస్తాను" అన్నాడు నరేంద్ర నవ్వుతూ.

"బాబ్బాబు భూతాలు, దెయ్యాల మాట ఎత్తకండి ఇక్కడ. నాకు ఆంజనేయ దండకం కూడా రాదు" అంది డాక్టర్ సరోజ భయాన్ని నటిస్తూ.

కంట్రోల్ రూములో వాళ్ళందరూ కబుర్లలోకి దిగారు.

జగదీష్ తను కనుక్కున్న విషయాలని హైదరాబాద్‌లోని రోదసీ కేంద్రానికి తెలియజేశాడు. శ్రీహరికోటనుంచి అశ్వనిని లాంచ్ చేసిన దగ్గరనుంచీ దానిని ట్రాక్ చేసేపనిని హైదరాబాద్ రోదసీ కేంద్రానికే అప్పగించారు. తన అభిప్రాయాన్ని తెలియజేసి వాళ్ళ ఆదేశాన్ని వెంటనే తెలియజెయ్యమని కోరాడు.

మరో గంటన్నరకిగాని భూమినుంచి ఏ సంగతీ రాదు. అప్పటిదాకా ఏదో కాలక్షేపం చెయ్యాలి.

నరేంద్రకి ఏ పనీలేక బోర్‌గా ఉంది. సూర్యకుమార్ పనే బాగుంది. భార్యని వెంటేసుకొచ్చాడు అదృష్టవంతుడు. ఇద్దరూ వాళ్ళ గదిలో కాలక్షేపం చేసేయవచ్చును అనుకున్నాడు. అందరూ వారి వారి గదులలోకి వెళ్ళిపోయారు.

* *

భూమినుంచి గ్రీన్ సిగ్నల్ వచ్చింది. గ్రహాన్ని వెనకనుంచి అనుసరించమన్నారు. జగదీష్, నరేంద్ర, సూర్యకుమార్ నౌకని భూమివేపుగా మళ్లించే పనిలో పడ్డారు.





రోదసి నౌక అశ్వని, గ్రహశకలం వేపుగా ధనుస్సు రాశిలోని చిక్కని మేఘంలాంటి పాలపుంతవేపుగా వెళ్లేలాగ ప్రోగ్రామ్ చేశారు. అది ఆటోమాటిక్‌గా వెళ్లేలాగా కంప్యూటర్ నడుపుతుంది.

జగదీష్ నౌకని ఆటోమేటిక్ నుంచి మాన్యూల్ ఆపరేషనుకి తీసుకువచ్చాడు. అందరినీ సీట్లకు బెల్టులను బిగించుకొమ్మని చెప్పాడు. నరేంద్ర అతని పక్కసీటులో కూర్చుని మీటర్లని పరిశీలిస్తున్నాడు.

ప్రసాద్, సూర్యకుమార్, సరోజ కూడా స్టేండ్‌బైలో అన్నీ పరికిస్తున్నారు.

కెప్టెన్ జగదీష్ నౌక గతిని మార్చ దానికి నిర్దేశించబడిన రాకెట్లని పనిచేయించాడు. ఎన్ని డిగ్రీలు కుడికి మళ్లుతుందో మీటర్‌లో గమనిస్తున్నాడు. సరిగ్గా నూట ఎనభై డిగ్రీలు చూపించగానే ఆపేశాడు. కోర్సు కరెక్టుచేసి భూమినుంచి నిరాటంకంగా పంపబడుతున్న వైర్‌లెస్ సిగ్నల్ బీట్ ఆధారంతో డాప్లర్ సిద్ధాంతలో పని చేసే మీటర్ రీడింగు ఎక్కువగా వచ్చేలాగా చూసుకుని, నౌక భూమి దిశగా పయనిస్తున్నట్లు నిర్ధారణ చేసుకున్నాడు. ఆ డైరెక్షన్‌నే మెయింటెయిన్ చేసేలాగా ఆటోమాటిక్‌లోకి స్విచ్‌ని మార్చి కంప్యూటర్ కంట్రోల్‌కి ఇచ్చేశాడు.

నౌక పయనించే దిశలో మార్పులు జరిగినా రాడార్ ఫాలోలోనే వుండటంచేత దాని టార్గెట్‌ని వదలలేదు. పేరబులా 180 డిగ్రీలు వెనక్కి తిరిగిపోయి గ్రహాన్నే కనిపెడుతోంది.

జగదీష్ రాడార్ సిగ్నల్‌తో మళ్ళీ గ్రహానికీ, అశ్వని నౌకకి మధ్యదూరాన్ని కొలిచాడు. రాడార్ సిగ్నల్ గ్రహాన్ని తాకి రావడానికి రెండు సెకెండ్లు తీసుకుంటుంది. అంటే వెళ్ళడానికి ఒక

సెకెండు పడుతుంది. అంటే సెకెండుకి రేడియో తరంగం వేగం ఒక లక్షా ఎనభై ఆరు వేలమైళ్లు (1,86,000) గనక వాటి మధ్యదూరం అంతే వుందన్నమాట. అంటే చంద్రుడుకి భూమికీ, మధ్యదూరం కన్నా తక్కువే అనుకున్నాడు.

మరో పదినిమిషాల తర్వాత మళ్ళీ దూరం కొలిచాడు. దూరంలో పెద్దతేడా లేదు. అంటే రెండూ ఒకే వేగంతో భూమి దిశగా పోతున్నాయన్నమాట.

జగదీష్ విషయాలను అందరికీ వివరించాడు. "రష్యా, అమెరికా నౌకల లొకేషన్ చూడండి" అన్నాడు ప్రసాద్.

"గుడ్. బాగా జ్ఞాపకం చేశారు" అని నౌకలకి నిర్దేశించబడిన ఫ్రీక్వెన్సీకి ప్రసార యంత్రాన్ని ట్యూన్‌చేశాడు. సంకేతాలు వస్తున్నాయి. రాడార్ వాటిదూరం రాను రాను పెరుగుతున్నట్లు కనుక్కుంది. అంటే అవి గ్రహంవేపు ప్రయాణిస్తున్నాయి.

"ప్రసాద్‌గారూ! అవి గ్రహంవేపు పోతున్నాయి. మరో గంట రెండుగంటల్లో వాళ్లు గ్రహాన్ని బాంబులతో ఎదుర్కొనవచ్చును. మనం ఏం చెయ్యాలి. బాంబులను ప్రయోగించవద్దని చెబుదామా?" అన్నాడు అందరివేపూ చూస్తూ.

"వాళ్లు మనమాట వింటారనే నమ్మకం నాకులేదు. అయినా ప్రయత్నించండి" అన్నాడు ఇంజనీరు సూర్యకుమార్.

ట్రాన్స్‌మిటర్ బటన్‌నొక్కి రష్యన్ నౌకని పిలిచాడు జగదీష్. "హలో వోస్టాక్-56...దిస్ ఈజ్ అశ్విని" అని పదిసార్లదాకా పిలిచాడు. పిలుపు పిలుపుకీ మధ్య నిముషం గాప్‌యిచ్చి మళ్లీ పిలిచాడు. ఎలాగయితేనేం సమాధానం వచ్చింది.

"హలో...హలో. రిసీవింగ్ యువర్ కాల్. దిస్ ఈజ్ వోస్టాక్" అని సమాధానం వచ్చింది.

జగదీష్ "గ్రహశకలం మీకెంత దూరంలో వుంది? ఎప్పుడు మీరు దానిని పేల్చెయ్యాలనుకుంటున్నారు?" అనడిగాడు ఇంగ్లీషులో.

మరుక్షణంలో సమాధానం వచ్చింది. "మేము దానికి యాభయివేల కిలోమీటర్ల దూరంలో వున్నాం. వెయ్యి కిలోమీటర్ల దూరంనుంచి బాంబులని ప్రయోగించాలనుకుంటున్నాం. మరో అర్ధగంట పట్టవచ్చు. అదిసరే మీ నౌకకేమయింది? గంటసేపటి నుంచీ అతీగతీలేదు" అని ప్రశ్నించారు వారు.

నిజానికి కెప్టెన్ జగదీష్ రేడియో సంకేతాలని ఇందాక నౌకని దారి మళ్ళించినప్పుడు ఆపుచేశాడు. అందుకనే అశ్విని జాడ రష్యన్ నౌకలోని వాళ్లు తెలుసుకోలేకపోయారు. సిగ్నల్ నిరంతరం ప్రసారం చెయ్యాలనేది నిర్ణయం. లేకపోతే ప్రపంచంలోని కోదసీ కేంద్రాలు నౌకలను ట్రేస్ చెయ్యడం కష్టం. నౌకలమధ్య కూడా సంబంధాలు తెగిపోతాయి.

జగదీష్ "నా ప్రసారయంత్రం చెడిపోయింది" అని అబద్ధం చెప్పాడు. లేకపోతే వాళ్ళకి చెప్పాపెట్టకుండా దారి మళ్ళించడం తప్పుకిందకి వస్తుంది. నౌకల మధ్యదూరం పెరుగుతున్నందుకు కారణం కూడా చెప్పాలి...తప్పదు అనుకుని,

"మేము ఆ గ్రహశకలాన్ని నాశనం చెయ్యదలచుకోలేదు. వెనక్కి తిరిగిపోతున్నాం.దానిని పరికించి చూడండి.ఇదేదో కృత్రిమగ్రహం. మనకన్నా ఎంతో తెలివయిన నాగరికులు మన సౌరమండలం వేపు ప్రయోగించారు" అన్నాడు.

రష్యన్ నౌక కమాండరు "ఆ విషయం మేము మీకన్నాముందే గ్రహించాం. ఇలాంటి నిర్ణయం తీసుకునే అధికారం మీకులేదు. మనల్ని ఎందుకు పంపించారో మరిచిపోయారా? గ్రౌండ్‌నుంచి మీకు పర్మిషన్ వుందా?" అనడిగాడు ఆంగ్లంలో.

"లేదు" జగదీష్ సమాధానం చెప్పాడు.

"మరి ఇలాంటి నిర్ణయం తీసుకునే హక్కు మీకెవరిచ్చారు? ఈ తప్పుకి మిమ్మల్ని కోర్ట్ మార్షల్ చేస్తారు తెలిసిందా. వెంటనే నౌకని వెనక్కి మలపండి" అన్నాడు ఆంగ్లంలో కోపంగా.

"నో. అందమైన ఆ ప్రపంచాన్ని నాశనం చెయ్యలేను. మీరు కూడా దయచేసి దాన్ని నాశనం చెయ్యొద్దు" అన్నాడు జగదీష్.

"డోంట్ బి ఎ సెంటిమెంటల్ ఫూల్. అందంగా వుందని విష సర్పాన్ని ముద్దు పెట్టుకుంటారా? అది భూమిని తాకితే యింకా ఏమన్నా వుందా? అసలు మాత్రం దానికి ఇంత దూరం రావడమెందుకు" అన్నాడు అసహనంగా.

"నాకా సంగతి తెలియదు. మేం వెనక్కి పోతున్నాం. మీ యిష్టం వచ్చినట్లు మీరు చేసుకోండి" అన్నాడు జగదీష్ రేడియో ట్రాన్స్‌మిటర్‌ని ఆఫ్ చేసేస్తూ.

విషయం అందరూ విని గ్రహిస్తూనే వున్నారు. "అమెరికన్ వాయేజర్‌ని కూడా కాంటాక్టు చేద్దామా?" అన్నాడు జగదీష్.

ప్రొఫెసర్ ప్రసాద్ "ఆ రష్యన్ కమాండర్ చెప్పినదాంట్లో తప్పులేదు అమెరికా షిప్ నుంచి కూడా యిలాంటి ఆదేశమే వస్తుంది. ఊరుకుని మనం చేసే పని చేద్దాం. ఒకవేళ వాళ్ళు పేల్చేస్తే మనం చేసేదేమీ లేదు. కాగల కార్యం గంధర్వులే తీర్చారని భూమికి సాగిపోవచ్చును. లేదా మన భారతదేశపు పెద్దల ఆదేశం ప్రకారం నడుచుకుందాం" అన్నాడు.

జగదీష్ ప్రమాదాన్ని శంకించాడు. 'ఈ కోపంతో ఆ రష్యన్‌కెప్టెన్ ఏ గైడెడ్ మిసైల్‌నో ప్రయోగించి అశ్వనిని కూడా ధ్వంసం చెయ్యవచ్చు' అనుకుని నౌక వేగంకాస్తతగ్గించాడు.ఉనికిని తెలియజేసే అన్ని ట్రాన్స్‌మిటర్లు, రాడార్లు ఆఫ్ చేశాడు. రిఫ్లెక్టర్ టెలిస్కోప్‌ని కృత్రిమ గ్రహానికి ఫోకస్ చేశాడు. ఎంతో స్వచ్ఛంగా కనిపిస్తోందది. బాగా ఎడంగా రెండు చుక్కల్లాగ రష్యన్, అమెరికన్ నౌకలు కూడా కనిపించాయి. అవి రానురాను గ్రహానికి దగ్గరౌతున్నాయి. అందరూ ఒకరి తర్వాత ఒకరు టెలిస్కోపులో గ్రహాన్ని తిలకిస్తున్నారు.

ఇంతలో రిసీవరులో భూమినుంచి వచ్చిన వార్త వినిపించింది.

"హల్లో అశ్వని...దిస్ ఈజ్ స్పేస్ స్టేషన్ హైదరాబాద్. కెప్టెన్ జగదీష్... శ్రద్ధగా వినండి. మీరు గ్రహాన్ని అలాగే అనుసరిస్తుండండి. బాగా దగ్గరకి రానివ్వవద్దు. గ్రహానికి బాగా ఎడంగా వెయ్యి కిలోమీటర్ల ఎడంగా జరిగి, దానిని ఓవర్ టేక్ చెయ్యనివ్వండి. మెల్లిగా యిప్పటి నుంచే మీ వేగాన్ని తగ్గించుకోండి. మిమ్మల్ని దాటిపోగానే వేగాన్ని పెంచి ధృవం వేపుగా దానిని సమీపించడానికి చూడండి. ఎటువంటి పరిస్థితులలోనూ ఈక్వేటర్ దరిదాపులకు వెళ్ళకండి.





భ్రమణాలు చేస్తుందన్నారు గదా. మీ నౌకతో సహా మిమ్మల్ని శూన్యంలోకి విసిరేస్తుంది జాగ్రత్త. మేము మళ్ళీ చెప్పే దాకా గ్రహం మీద ధృవ ప్రాంతంలో కూడా దిగవద్దు. కనీసం వంద కిలోమీటర్లు ఎడంగా అనుసరించండి" అని సందేశం ఆగిపోయినట్లు ఆగిపోయి మళ్ళీ "హల్లో! మీరు దగ్గరనుంచి గ్రహించిన విశేషాలు మాకు తెలియజెయ్యండి. అప్పుడు ఏం చెయ్యాలి అన్నది సూచిస్తాము. మరో రెండు గంటల్లో మీ వార్త కోసం వెయ్యి కోట్ల ప్రపంచ ప్రజలు, వందకోట్ల భారతీయులు, పదికోట్ల తెలుగుప్రజలు ఎదురు చూస్తుంటారని మరిచిపోవద్దు. స్పేస్ స్టేషన్ హైదరాబాద్. మెసేజ్ ఈజ్ ఓవర్" అని రేడియో ఆగిపోయింది.

సందేశం మొత్తం రికార్డయింది. భూమి నుంచి వచ్చిన ప్రతి వార్తా ఆటోమాటిక్‌గా రికార్డయేలాగ చేశారు. దానిని మళ్ళీ వేసుకుని శ్రద్ధగా విన్నారు అందరూ.

జగదీష్ భూమికి ఏమేమి విషయాలు మాట్లాడాలి అన్నది అందరితోనూ చర్చించి ట్రాన్స్‌మిటర్ ఆన్ చేశాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ సుశీలకి తన క్షేమసమాచారం అందజెయ్యవలసిందిగా చెప్పమన్నాడు.

జగదీష్ నవ్వి అలాగే అన్నాడు.

జగదీష్ అంత వరకూ జరిగిన విషయాలు, రష్యన్ నౌక కమాండరుతో జరిగిన సంభాషణ మొత్తం పూసగుచ్చినట్లు చెప్పాడు భూమి మీదికి.

* * *

రిఫ్లెక్టర్ టెలిస్కోప్‌లో ఒకరి తరవాత ఒకరు కృత్రిమగ్రహాన్ని పరికిస్తున్నారు. ఎలక్ట్రానిక్ వాచీలు చూసుకున్నారు. రష్యన్ రోదసీ నౌకతో సంభాషించి అరగంట కావస్తోంది. అంటే ఏ క్షణంలోనైనా వారు అణుబాంబుల రాకెట్లను ప్రయోగించవచ్చు.

కెప్టెన్ జగదీష్ చూస్తుండగానే రెండు బాంబర్లు నౌకల నుంచి బయలుదేరాయి. మరు నిముషంలో పెద్ద ప్రేలుడు జరిగింది. కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు. కృత్రిమ గ్రహం చుట్టూ పెద్ద విష్ణుచక్రం మతాబా కాల్చినట్లు పది నిమిషాలు కాలింది. శూన్యంలో వంద మైళ్ళు దాకా దాని వెలుగు మంటలు వ్యాపించాయి. అందరూ చూసి ఆశ్చర్య పోయారు. అటువంటి దృశ్యం అపూర్వమైనది. బహుశా మరెవ్వరికీ ఆ అవకాశం భవిష్యత్తులో కూడా కలగబోదేమో.

మరో పావుగంట తరవాత గ్రహం చెక్కు చెదరకుండా స్వచ్ఛంగా కనిపించింది.

ప్రొఫెసర్ ప్రసాద్ అందరినీ ఉద్దేశించి "చూశారా! గ్రహానికి ఏమీ కాలేదు. మనకి భూమి నుంచి వచ్చిన సూచన సరియైనదే! గ్రహంమధ్య రేఖ ప్రాంతంలో అంటే దాని ఈక్వేటర్ ప్రాంతంలో ఎవరైనా దిగాలంటే దాని వేగంతో సమానమైన వేగంతో చుట్టూ కక్ష్యలో తిరుగుతూ వాలు చూసుకుని దిగాలి. అంతేగాని సూటిగా దాని దరిదాపులకి ఏదీ పోలేదు. మధ్యలోనే తునాతునకలై పోతుంది. అణుబాంబులని మోసుకు వెళ్ళిన రాకెట్లు ముక్కుసూటిగా వెళ్ళాయి. పేలిపోయాయి" అన్నాడు.

"లోగడ శనిగ్రహం తాలూకు ఒక ఉపగ్రహం వేగం తగ్గి దాని దగ్గరకు వెళ్ళబోయి ముక్కలు ముక్కలుగా పేలిపోయి దాని చుట్టూ రింగులాగ మారిందని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారుగదా! దానికి

ఇదే కారణమంటారా?" అని అడిగాడు ఇంజనీరు సూర్యకుమార్.

"అవును! వాళ్ళ దగ్గరున్న అన్ని మెగాటన్ బాంబులనీ వేసినా దానికేమీ కాదు" అన్నాడు ప్రొఫెసర్ ప్రసాద్.

కెప్టెన్ జగదీష్ రష్యన్, అమెరికన్ నౌకల కోసం టెలిస్కోప్‌లో గాలించాడు. కనిపించలేదు. గ్రహం మాత్రం క్లియర్‌గా కనిపిస్తోంది. అవీ ఆ చుట్టు పక్కలే వుండాలి. కాని కనిపించడం లేదు. అందరినీ చూడమన్నాడు. ఎవ్వరికీ కళ్లు పొడుచుకున్నా కనిపించలేదు.

"ఉండండి రేడియో సందేశాలు పంపిద్దాం" అని ప్రసారయంత్రాన్ని ఆన్ చేశాడు జగదీష్.

"హలో అశ్వని స్పీకింగ్...వోస్టాక్ డూయు హియర్ మి" అంటూ నిమిషానికొకసారి ప్రసారం చేసి రిసీవర్లో సమాధానం కోసం విన్నాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా సమాధానం రాలేదు. ఫ్రీక్వెన్సీ కరెక్టుగానే వుంది.

సూర్యకుమార్ "అమెరికన్ నౌకని పిలవండి" అని చెప్పాడు. జగదీష్ ట్రాన్స్‌మిటర్‌ని అమెరికన్ రోదసీ నౌకకి నిర్దేశించబడిన మీటర్లకి ట్యూన్ చేశాడు. రిసీవర్‌లో సెకెండుకి ఒక బీట్ చొప్పున వినిపించాలి. రావడం లేదు. అంటే ఏదో ప్రమాదం జరిగిందన్నమాటే. రష్యన్ నౌకని పిలిచినట్లు అమెరికన్ నౌకని కూడా పిలిచాడు. కాని లాభంలేకపోయింది.

మతి పోయినట్లు కూర్చున్న ప్రసాద్, సరోజలతో అన్నాడు జగదీష్ "రష్యన్, అమెరికన్ నౌకలు ఆ ప్రేలుడులో ధ్వంసం అయిపోయాయనడంలో అనుమానంలేదు. పదివేల కిలోమీటర్ల దూరం నుంచే పేలుస్తామని రష్యన్ నౌక కెప్టెన్ మనకి చెప్పాడు. ఆ గ్రహాన్ని రష్యా, అమెరికా నౌకలు పదికిలోమీటర్ల పక్క నుంచి దూసుకుపోయే లైనులో వున్నట్లు మన లెక్కలు చెప్పాయి. బాంబులు పేలిన పదినిముషాల్లోనే అవిపక్కనుంచి పోయివుంటాయి. ఆ మంటల్లో పేలి, కాలిపోయి వుంటాయి. వాళ్లు బాంబులు ప్రయోగించిన వెంటనే వాళ్ల ట్రాజక్టరీని గ్రహానికి ఎడంగా జరుపుకోవలసింది. పది కిలోమీటర్ల ఎడం చాలుననుకుని వుంటారు. కంప్యూటర్ కంట్రోలుకే వది లేశారు". అని విచారం వ్యక్తంచేసాడు.

డాక్టరు సరోజకి కళ్లలో నీళ్ళు తిరిగాయి "జరగబోయే ప్రమాదాన్ని జగదీష్‌గారు ఆ రష్యన్ కెప్టెన్‌కి మరింత వివరంగా చెప్పవలసింది" అంది నిష్ఠూరంగా.

కెప్టెన్ జగదీష్ కూడా అదే ఆలోచిస్తున్నాడు. తను ప్రయత్నిస్తే వాళ్లని కాపాడగలిగేవాడా? మరికొంచెం ప్రయత్నిస్తే వాళ్లు నౌకలని వెనక్కి మళ్ళించేవారా? అయినా యిలా జరుగుతుందని తను మాత్రం అనుకున్నాడా. కాకపోతే వాళ్లు రోదసిలో గ్రహాన్ని వదిలి దూరంగా పోలేరు. వెనక్కిమళ్ళించుకుని తిరిగివచ్చి మళ్ళీ గ్రహాన్ని చేరుకునే ప్రయత్నం చేస్తారనుకున్నాడు.

"అయామ్ సారీ మేడమ్. ఇలా జరుగుతుందని మాత్రం నేను అనుకోలేదు" అంటూంటే అతని గొంతు కాస్త వొణికింది.

నరేంద్ర కలుగజేసుకుని "నో నో! మీరు అనవసరంగా బాధపడుతున్నారు. అతని ధోరణి చూశాం కదా. ఏదీ వినేటట్లు కనిపించలేదు. పైపెచ్చు మరికాస్త





మాట్లాడితే మనలనే గ్రహం వేపుమళ్ళించే వాడు. మనమూ ప్రమాదంలో యిరుక్కునే వాళ్ళం. భూమి కూడా ప్రమాదంలో పడేది" అని సముదాయించాడు.

సూర్యకుమార్ "జరగవలసిందేదో అలా జరిగింది. ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం. మనం ప్రస్తుతం చెయ్యవలసినదేమిటో అది చూడండి" అని తన అభిప్రాయాన్ని తెలియజేశాడు.

"ముందు జరిగిన సంగతి భూమికి వర్తమానం పంపండి" అన్నాడు ప్రొఫెసర్ ప్రసాద్.

జగదీష్ "అలాగే. కాని మనకన్నా ముందే భూమి మీది వాళ్ళకు ఈ సంగతి తెలుస్తుంది. మరో అర్ధగంటలో నౌకల నుంచి భూమికి జరుగుతున్న ప్రసారాలు ఆగిపోతాయి. వాళ్ళు తెలుసుకుంటారు" అని ట్రాన్స్‌మిటరులో భూమి మీదికి జరిగినది తెలియజేశాడు. అశ్వని వేగాన్ని తగ్గించి వెనుకనుంచి గ్రహాన్ని అనుసరించబోతున్నట్లు తెలియజేశాడు.

రాడార్‌ని ఆన్ చేసి మరోమారు గ్రహంనుంచి దూరం కొలిచాడు. ఇంచుమించు వాటి మధ్యదూరం లక్షమైళ్ళున్నట్లు తేలింది. నౌక వేగాన్ని రిట్రా రాకెట్లు పనిచేయించి మరింత తగ్గించాడు జగదీష్. నౌక వేగం గంటకు పదివేల మైళ్ళకి తగ్గిపోయింది. గ్రహం వేగం గంటకి యాభైవేల మైళ్ళని యిదివరకే లెక్కకట్టారు గనక వాటి మధ్య దూరం తగ్గి గ్రహం నౌకని దాటిపోవడానికి మరో రెండున్నర గంటలకి పైగా పడుతుందని కనుక్కున్నారు.

"మిస్టర్ సూర్యకుమార్, మీరు డాకింగ్ ఎక్స్‌పర్ట్‌లు గదా! ఇంక ఈ నౌక తాలూకు ప్రొపల్షన్ కంట్రోలు తీసుకుని మమ్మల్ని ఆ గ్రహం మీదదించే భారం మీదే" అన్నాడు జగదీష్.

"మీరేం తక్కువ తిన్నారని. నా కన్నా మీరే సమర్థులు. అయినా మీ ఆజ్ఞ సుగ్రీవాజ్ఞలాగా శిరసావహించాలిగదా. గ్రహాన్ని దగ్గరికి రానివ్వండి. నా సామర్థ్యం కూడా చూపించే సమయం వస్తుంది" అని నవ్వాడు.

"ఇంకా ఎలాగూ రెండు గంటలు టైమ్ మనకి రెస్టు తీసుకోవడానికి వుంది. పదండి. ఏమైనా తిని రెస్టు తీసుకుందాం" అని జగదీష్ చెప్పగానే అందరూ ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఆహారం తీసుకుని మెత్తని కుషన్ పరుపులమీద విశ్రమించారు. రోదసీ నౌక అశ్వని భూమి దిశగా గంటకి పదివేల మైళ్ళ వేగంతో పోతోంది. కృత్రిమ గ్రహం గంటకి యాభై వేల మైళ్ళ వేగంతో వెన్నంటి వస్తోంది. వాటి మధ్యదూరం నిమిషనిమిషానికి తగ్గసాగింది.




మరో రెండు గంటల తరువాత అందరూ కంట్రోల్ రూమ్‌కి వచ్చేసరికే సూర్యకుమార్ టెలిస్కోప్‌లో గ్రహాన్ని పరికించి చూస్తున్నాడు. ఇరవైమైళ్ళ దూరం నుంచి టెలిస్కోప్‌లో చేతికందేలాగా కనిపిస్తోందది. గిరగిరా బొంగరంలాగా







తిరుగుతోంది. దానిధృవభాగంలో కెప్టెన్ జగదీష్ గుర్తించిన నల్లనిమచ్చక్లియర్ గా కనిపిస్తోంది. ఆ చుక్క చుట్టూ మరో మూడు చుక్కలు పరిభ్రమిస్తుండటం స్వచ్ఛంగా కనిపిస్తోంది. సూర్యకుమార్ గుర్తించిన మరో కొత్త విషయం–మధ్య ధృవతలంలోని నల్లని చుక్క మధ్యలో తెల్లని సమకోణత్రిభుజం గుర్తింపబడి వుండడం.

అతని ఆశ్చర్యానికి అవధుల్లేవు.

గబగబా అందరినీ పిలిచాడు "రండి. రండి. మీరు ఇదివరకు చూసిన మధ్య చుక్కలో ఒక ముక్కోణ సమభుజ త్రిభుజం కూడా గుర్తించబడి వుంది. బహుశా మనం దానిమీదనే దిగవలసి ఉంటుంది" అని అరిచినంత పనిచేశాడు.

జగదీష్ ముందుగా చేరుకున్నాడు. టెలిస్కోప్‌లో చూస్తూ "ఎస్. ఇట్ ఈజ్ ఎ ఫెంటాస్టిక్ క్రియేషన్. మరో వెయ్యేళ్ళకైనా మన భూమికులు ఇలాంటి, కృత్రిమ గ్రహాన్ని నిర్మించలేరు. చూశారా గ్రహమధ్యరేఖ దగ్గర ఎంత వేగంగా

తిరుగుతోందో" అన్నాడు.

"అదే అర్ధగంటనుండీ చూస్తున్నాను. ఆ త్రిభుజంమీదనే గదూ మనం దిగ వలసి ఉంటుంది" అన్నాడు.

"అవును. అక్కడైనా మన ఇష్టం వచ్చినట్టు దిగలేం. మన నౌక ఆత్మ భ్రమణాలు గ్రహం భ్రమణాలకు సింక్రొనైజ్ చెయ్యవలసి వుంటుంది. లేకపోతే అనుభవం లేకుండా బస్సు దిగిన వ్యక్తిలాగా మన నౌక పడిపోయి మూడు చుక్కలను దాటగానే శూన్యంలోకి విసిరి వేయబడుతుంది" అని జగదీష్ వివరించాడు.

సూర్యకుమార్ ఎంతో నిదానంగా



"నాకు వదిలెయ్యండి. నేను చూసుకుంటాను" అన్నాడు.

సూర్యకుమార్, జగదీష్ చర్చించుకుంటుండగా మిగతావారు టెలిస్కోప్‌లో చూడసాగారు. వాళ్ళ కళ్లను వాళ్లే నమ్మలేకపోయారు. నిజంగా అది వివరించి చెప్పలేని అనుభూతి! అదొక అద్భుత గ్రహంలాగా అందరికీ అనిపించింది.

"ఆ చక్రాల గుర్తులు చూసిన తరువాత నాకొకటనిపిస్తోంది" అని అందరినీ ఉద్దేశించి చెప్పసాగాడు ప్రొఫెసర్.

"అనుమానం లేదు. మధ్యచక్రంమీది త్రిభుజం మీద దిగడానికే ఆ గుర్తులు వేశారు దీనిని రూపొందించినవారు. ఆ చుట్టుపక్కల ఎక్కడో మనకి ఎయిర్ లాక్స్ కనిపించవచ్చును. ఇదొక విశ్వ నౌక"

జగదీష్ అందుకుని "నా అనుమానం కూడా అదే! ఆ ఎయిర్‌లాక్స్ తెరుచుకుని గ్రహపు అంతర్భాగంలోనికి వెళితే ఆ జీవులు మనకి కనిపించవచ్చును" అన్నాడు.

సూర్యకుమార్, నరేంద్ర వాళ్ళ సంభాషణ శ్రద్ధగా విన్నారు.

సూర్యకుమార్ గ్రహంమీద దిగే దారి ఆలోచించాడు. దిగాక దానిని పేల్చెయ్యడానికి మంచి పథకం నిదానంగా రూపొందించుకోవచ్చు. ఆ గ్రహం భూమి దిక్కుగా తమ అశ్వని నౌకని ఇంధనం ఖర్చులేకుండా భూమికి మోసుకుపోతుంది. భూమి మరో లక్షో రెండు లక్షల మైళ్ళో దూరంలో వుండగానే దానిలో బిగించిన ఏటంబాంబులు పేలడానికి టైమ్ సెట్ చేసి హాయిగా అశ్వనిలో టేక్ ఆఫ్ చేసెయ్యవచ్చు. కాని జగదీష్, ప్రసాద్‌లు ఊహించినట్లు ఆ గ్రహంలో ప్రాణికోటి వుంటే అప్పుడేంచెయ్యాలి?

దేవుని దయవలన తనకి చేతినిండా పని దొరుకుతోంది. మొత్తం ఆ గ్రహాంతర్భాగాన్ని పరిశోధించవచ్చును. అసలు కోరి కోరి తను ఈ రోదసీ యాత్ర ఎందుకు కొనితెచ్చుకున్నట్లు? వాళ్ళు చెప్పేది వింటూ గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడానికా? గ్రహం మీద దిగాలి. వాళ్ళనుకున్నది నిజంకావాలి. అందుకు తను తోడ్పడాలి-అనుకున్నాడు నరేంద్ర.

డాక్టరు సరోజకి అంతా అయోమయంగా వుంది. వీళ్ళందర్నీ చూస్తుంటే అగ్నిపర్వతపు జ్వాలాముఖిలోనికి కూడా దూరేలా వున్నారు. ఎప్పుడో రెండు వందల ఏళ్లక్రితం జూల్స్ వెర్న్ అనే ఆయన రాసిన భూగర్భంలోని సాహస యాత్ర అనే నవల జ్ఞాపకానికి వచ్చింది. అది కేవలం ఫిక్షన్. కాని ఈ యిరవ య్యొకటో శతాబ్దంలో నిజంగానే మనిషి ఆ స్థితికి ఎదిగినట్లున్నాడు. లేకపోతే ఆ గ్రహం మీద దిగేద్దాం, దానిలోకి దూరుదాం అనుకుంటున్నారేగాని ఒకవేళ దానిలో విచిత్ర జీవులుంటే ఏంచెయ్యాలి? అలాగాక యిది నిజంగా ఒక నౌక అయినట్లైతే దానిలోనికి దూరితే వాళ్లూరుకుంటారా? మీతో స్నేహం చెయ్యడానికి వచ్చాం అని వాళ్ళకి చెప్పడం ఎలాగ? చెప్పినా వాళ్లు నమ్ముతారా అని ఆలోచించరేం. ఏం మగవాళ్ళు బాబూ గాలివాటు మనుషులు. ముందుచూపు వుండదు. బా...బో...య్. అనుకోకూడదుగాని నిజంగానే యిందాక అనుకున్నట్లు భూతాలూ ప్రేతాలూ కనిపిస్తూ మాయమవుతూ మిమ్మల్ని మింగేస్తాం అంటే ఏం చెయ్యాలి? ఏం జరిగినా ధైర్యంగా ఎదుర్కోవలసిందే. ఏమైనా చేసుకోనీ.




డాక్టరుగా వాళ్ళకి చికిత్స చెయ్యడం తన విధి అని వూరుకుంది.

జగదీష్ మరో అయిదు నిమిషాల్లో గ్రహం అశ్వనిని ఓవర్ టేక్ చేస్తుందనగా అశ్వని వేగాన్ని పెంచాడు. అయిదు నిమిషాల్లో గంటకి నలభైవేలమైళ్ల వేగాన్ని అందుకుంది. మరికాసేపట్లో ఆ గ్రహం అశ్వనిని కుడివైపునుంచి దాటిపోయింది. జగదీష్ సూర్యకుమార్‌కి నౌకని కంట్రోలు చెయ్యమని ఒప్పచెప్పాడు.

పైలట్ సీటుమీదనుంచి నౌక ముందు భాగం స్వచ్ఛమైన అద్దంలోనుంచి కనిపిస్తోంది. దూరంగా గ్రహం కనిపించింది. అశ్వని వేగాన్ని మరికొంచెం పెంచాడు. నౌక గతిని కాస్త కుడికి మార్చి పదిమైళ్ళ దూరంనుంచి ఆ గ్రహాన్ని అనుసరించాడు.

టెలిస్కోపులో విచిత్ర గ్రహాన్ని చూస్తున్న జగదీష్‌కి గ్రహంమీది వేరు వేరు భాగాలు కనిపిస్తున్నాయి. టెలిస్కోపులో చూస్తూ సూర్యకుమార్ నౌకని నడుపుతున్న తీరుని అంచనా వెయ్యసాగాడు. పది నిమిషాలలో ధృవాన్ని గుర్తించి ఆ దిశగా వేగాన్ని పెంచి నడిపాడు. రానురాను గ్రహానికి నౌక దగ్గర కాసాగింది. మైలు దూరానికి దగ్గరగా వచ్చాడు.

సూర్యకుమార్ జగదీష్‌తో "నేను నౌకని భద్రంగా దానిమీద దించగలననే నమ్మకం నాకుంది. భూమినుంచి అనుమతి వచ్చేదాకా యిదే వేగంతో అనుసరిద్దామా లేక దించెయ్యమంటారా?" అని అడిగాడు.

జగదీష్ ప్రొఫెసర్ ప్రసాద్‌వేపు అతని అభిప్రాయం చెప్పమన్నట్లు చూశాడు.

ప్రసాద్ "నామట్టుకి నాకు అనుమతి కోసం ఆగడం మంచిదనిపిస్తోంది" అన్నాడు.

నరేంద్ర "నాకు మాత్రం దానిమీద దిగడమే మంచిదనిపిస్తోంది. ఇలా ప్రతి చిన్నపనికీ భూమినుంచి అనుమతి సంపాదిస్తూ కూర్చుంటే మనమీద ఆ గ్రహంలోనివారు కత్తిదూసినా ఎదురుచూస్తూ వుండాలి. కోట్లమైళ్ల దూరంలోవున్న భూమినుంచి ప్రతిదానికీ ఎదురుచూడడం నాకిష్టంలేదు. కొన్ని నిర్ణయాలు మనం స్వతంత్రంగా చేసుకోకతప్పదు. దిగిన తర్వాత దిగామని వార్త పంపండి" అని అడగకుండానే తన అభిప్రాయాన్ని సెలవిచ్చాడు.

డాక్టరు సరోజకు భూమినుంచి అనుమతిలేకుండా ఏ పనీ చెయ్యడంఇష్టం లేదు. కాని వాళ్లు నలుగురు. వాళ్ళ నిర్ణయానికే వదిలేసి ఏ మాటా చెప్పకుండా ఊరుకుంది.

జగదీష్ "నరేంద్ర చెప్పిందే సమంజసంగా ఉంది. ఒకవేళ ఏమి జరిగినా అర్చగలరా తీర్చగలరా? సూర్యకుమార్ గో ఎ. హెడ్. లేండ్ ది షిప్ కేర్‌ఫుల్లీ" అని ఆదేశించాడు.

చెప్పడమే తడవుగా నౌకని నూట ఎనభయి డిగ్రీలుతిప్పి తలపైకి, కాళ్లు కిందికి వచ్చేలాగచేసి కాళ్ళభాగంలోని రాకెట్‌ని ఆఫ్‌చేశాడు. గ్రావిటీ ఏమైనా వుందా అని చూశాడు. కొంచెం కనిపించింది. ఒకటన్ను బరువు కిలోగ్రామ్‌కూడా తూగదేమో అనిపించింది. నౌక తల భాగానవున్న రాకెట్‌ని పనిచేయించి గ్రహానికి మరింత దగ్గరికి నౌకని నడిపాడు.

నౌక నేలమీద నిలబడడానికి అమర్చిన మూడుకాళ్ళమధ్య ఒక టెలివిజన్ కెమేరా వుంది. దానిని ఆన్‌చేశాడు. ఫ్రంట్ పేనల్ మీది ఒక టెలివిజన్‌తెరమీద నౌక కింది ప్రాంతం కనిపించింది. ఎడమగా వృత్తాకారపు మచ్చ కనిపించింది. దానివేపుగా నౌకని నడిపాడు. దానిమధ్యలో సమకోణ త్రిభుజం కనిపించింది. సరిగ్గా ఆ త్రిభుజం కోణాలమీద మూడుకాళ్లు ఆనుకునేలాగ దించాలనుకున్నాడు సూర్యకుమార్. టెలివిజన్ తెరమీద త్రిభుజం గిరగిరా తిరగ సాగింది. అంటే నౌక భ్రమణాలు, గ్రహం భ్రమణాలు సింక్రొనైజ్ కాలేదన్నమాట. అదే ఎత్తులో వుంచి నౌక భ్రమణాలను తక్కువ చెయ్యడానికి ఉపయోగించే రాకెట్‌ని పనిచేయించాడు. త్రిభుజం మెల్లగా కుడివేపు తిరగసాగింది మరి కొంచెం భ్రమణం తగ్గించాడు. త్రిభుజం ఆగినట్లు ఆగి మళ్ళీ ఎడమకు తిరిగింది. చివరకు ఎలాగో కష్టపడి త్రిభుజం టెలివిజన్‌తెరమీద కాస్తసేపు ఎడమకీ. కాస్త సేపు కుడికీ తిరిగినా చివరికి స్థిరంగా వుండేలాగ చేశాడు. నౌక భ్రమణాలు, గ్రహం భ్రమణాలు సరిగ్గా ఉన్నాయని గ్రహించి తలపై రాకెట్ ప్రొపల్షన్ పెంచి మెల్లగా గ్రహంమీద దించాడు. ఏ కుదుపూ లేకుండా ఆగిపోయింది. రాకెట్లన్నీ ఆపేశాడు.

ఇవన్నీ మొదటినుంచి గ్రహిస్తున్న జగదీష్ సూర్యకుమార్ స్టడీనెస్‌కి మెచ్చుకుని "రైట్‌మేన్ ఫర్ ది రైట్ జాబ్. వెల్‌డన్ మిస్టర్ సూర్యకుమార్" అని మెచ్చుకున్నాడు. సరోజ ముఖం తృప్తితో వెలిగిపోయింది.

కెప్టెన్ జగదీష్ అందరితో "మళ్ళీ భూమినుంచి వార్త వచ్చేదాకా ఎదురు చూద్దాం. వాళ్ళ సందేశం సలహా వినేదాకా అశ్వనినుంచి బయటికి రావద్దు. గ్రహం మీద అడుగుపెట్టవద్దు" అన్నాడు.

డాక్టరు సరోజ "అయితే ఇక్కడెందుకు పదండి మన గదుల్లోకి పోదాం" అంది.

సూర్యకుమార్ భార్యని చూస్తూ "ఇంకేం గదులు అడ్డంగా పడుతున్నాయి" అన్నాడు.

"ఓ అవునుకదూ. మననౌక నేలమీద దిగింది. మళ్ళీ టేక్ ఆఫ్ చేసేదాకా కంట్రోల్‌గదిలోనే గడపాలి" అంది.

కంట్రోలు గదిలో కూడా అందరికీ మంచాలు, కుర్చీలు అన్నీ సమకూర్చబడే వున్నాయి. అందరూ సమావేశమవడానికి ఒక రౌండు టేబిలు కూడావుంది.

రౌండుటేబిలు చుట్టూ అందరూ కూర్చున్నారు. లోకాభిరామాయణం మాట్లాడుకుంటుండగా గదులనుంచి కంట్రోలురూమ్‌లోనికి ప్రవేశించే తలుపు మీదతట్టిన శబ్దం అయింది. ఉలిక్కిపడి అందరూ అటుచూశారు. అందరూ కుర్చీలలో కూర్చుని వున్నారు. గ్రహవాసులు నౌక దిగడం గ్రహించి రాలేదు గదా అనుకున్నారు.

ఇంతలో "మే ఐ కమ్ ఇన్" అని హనుమాన్ గొంతుక వినిపించింది.

గందరగోళంలో మర మనుషుల సంగతే మరిచిపోయారు.

కెప్టెన్ జగదీష్ ఎదురు వెళ్ళి "కమ్ ఇన్ హనుమాన్" అన్నాడు.

హనుమాన్ కంట్రోలు గదిలోని తన కోసం ఎడంగా నిర్దేశించిన కుర్చీలో కూర్చున్నాడు. వాళ్ళనందరినీ చూడగానే హనుమాన్‌లోని సెన్సర్ సర్క్యూట్లన్నీ ఆగిపోయాయి. అతను యోగ

 

నిద్రలోనికి పోయిన తపస్విలాగ అయి పోయాడు.

అశ్వని రోదసీ నౌక 10సెకండ్లకు ఒక భ్రమణం చేస్తుండేది. పది నిమిషా లకి ఒక భ్రమణం చేసే విచిత్ర గ్రహం మీద తన భ్రమణ వేగం తగ్గించుకుని దిగిపోగానే గదులలోని వదులుగా వున్న వస్తువులు జారిపోయాయి.

సెంట్రిఫ్యూగల్ శక్తిలో ఒక నూతిలో మోటారు సైకిలు మీద వల యాలుగా తిరుగుతున్న సర్కస్ డ్రైవర్ తన వేగం తగ్గగానే నూతి అడుగుకి పోతాడు. అలాగే అశ్వని గ్రహం మీద దిగగానే హనుమాన్, ప్రతాప్ మరమను షలు గనక కిందికి జారిపోయారు. ప్రతాప్ స్విచ్ ఆఫ్ చేసి వున్నాడు. కాని హనుమాన్ అలాగ కాదు. ఎటువంటి మార్పులు తన చుట్టూ జరిగినా అతను మేలుకుంటాడు.

కిందికి జారిన హనుమాన్‌కి తన కర్తవ్యం తెలుసును. ఒక వేళ నౌకలోని వారందరూ మరణించినా అశ్వనిని భూమికి తీసుకొచ్చే విధంగా హనుమాన్ లోని కంప్యూటర్‌ని ప్రోగ్రామ్ చేశారు.

ఒకవేళ జగదీష్ గనుక వెంటనే రెస్పాన్స్ యివ్వకపోతే భూమిని కంటాక్ట్ చేసివుండేవాడు. సమాధానం కోసం ఎదురుచూసేవాడు. వాళ్లని సలహా అడిగి అశ్వనిని టేక్ ఆఫ్ చేసి భూమికి తీసుకు వెళ్ళిపోయేవాడు. కాని వాళ్ళను చూడ గానే నిశ్చింతగా వుండిపోయాడు.

హనుమాన్‌ని చూసిన తరువాత వాళ్ళకి ప్రతాప్ జ్ఞాపకం రావటంతో జగదీష్ నరేంద్రతో చెప్పాడు.

నరేంద్ర కంట్రోలుగది దాటి ప్రతాప్ వున్న గదికి వెళ్ళాడు. అడ్డంగా నేల మీద పడున్నాడు. నౌక భ్రమణాలు తగ్గిపోగానే నౌకి గోడ మీద కుర్చీలో కూర్చున్నవాడు కిందికి జారిపోయాడు. అతని వీపు మీద మెయిన్ స్విచ్ ఆఫ్ చేసివుంది. లేకపోతే మళ్ళీ నిటారుగా లేచి నిలబడి అనువైన చోట కూర్చునే వాడే. అతని వీపు మీది స్విచ్‌ని ఆన్ చేశాడు నరేంద్ర. నిద్రలేచినట్లు లేచాడు ప్రతాప్.

"కమాన్ ప్రతాప్", అని కంట్రోలు గదికి తోవతీశాడు. ప్రతాప్ అనుస రించాడు.

ఆ యిద్దరూ కంట్రోలు గదిలోకి రాగానే పక్కనున్న కుర్చీలో కూర్చోమని ప్రతాప్‌కి సంజ్ఞ చేశాడు జగదీష్. వెంటనే నమ్మిన బంటులాగ ఆ కుర్చీలో కూర్చు న్నాడు.

ఇంతలో రిసీవర్‌లో భూమి నుంచి పిలుపు వినిపించింది "హలో! గ్రౌండ్ స్టేషన్ హైదరాబాద్. అశ్వనికి సందేశం. కెప్టెన్ జగదీష్...మీరు పంపిన విషాద వార్త విన్నాం. మీ వార్త భూమికి చేరక ముందే ఆ నౌకల నుంచి ఏ సంకేతాలు రాకపోవడంతో ఏదో ప్రమాదాన్ని మేము కూడా శంకించాం. రష్యా, అమెరికా దేశాలు మీరు క్షేమంగా వున్నం దుకు సంతోషం వ్యక్తం చేశాయి. మీరు జాగ్రత్తగా కృత్రిమ గ్రహం మీద దిగడానికి అనుమతిస్తున్నాం. తొందరపడి మిషన్ ఫెయిల్ చెయ్యకండి. ఇప్పుడు ప్రపంచాన్ని కాపాడవలసిన బాధ్యత కేవలం మీ మీదనే వుంది. రష్యా, అమెరికా నౌకలు ఇంక లేవు గనుక మిమ్మల్ని ఆదుకునేవాళ్ళు మీరే అని మరిచిపోవద్దు. ఏ నిర్ణయం తీసుకున్నా జాగ్రత్తగా ఆలోచించి తీసుకోండి.

లేకపోతే మీకూ, మాకూ కూడా ప్రమాదం. ఏ సంగతీ వెంటనే మెసేజ్ పంపండి. మా మెసేజ్ అయిపోయింది" అని రిసీవరు ఆగిపోయింది.

రికార్డయిన సందేశాన్ని అందరూ మరోమారు విన్నారు.

జగదీష్ ట్రాన్స్‌మిటర్ ఆన్ చేసి "హలో డిసిజ్ జగదీష్ ఫ్రం అశ్వని. మీ వార్త ఇప్పుడే విన్నాం. మేము ఒక గంట క్రితమే గ్రహం మీద దిగగలిగాం. సూర్యకుమార్ సేఫ్‌గా అశ్వనిని విచిత్ర గ్రహం మీద లేండ్ చెయ్యగలిగాడు. మేము మీ ఆదేశం కోసమే ఎదురు చూస్తున్నాం. నా కమాండ్‌లో ఎలాంటి అవకతవకలూ జరగవని మాట ఇస్తున్నాను. ఏ నిర్ణయం తీసుకోవాలన్నా కలిసే తీసుకుంటున్నాం. ఏది జరిగినా మీకు వెంటనే తెలియజేస్తాము. మరో మాట. మాదొక సూసైడ్ స్క్వాడ్‌గా మీరు భావించండి. ఒకవేళ మేము ప్రాణాలతో రాలేకపోయినా ఈ గ్రహాన్ని మాత్రం భూమిని తాకనివ్వం. ఈ గ్రహం తాలూకు ఒక్క శకలం కూడా భూమిని తాకదని మాట ఇస్తున్నాం! మేము ఇంకా నౌకని విడిచి గ్రహం మీదికి సంచారానికిపోలేదు. నరేంద్రని మొదటి సర్వేకి పంపాలనుకుంటున్నాను. తరువాత వివరాలు తెలియజేస్తాను. మెసేజ్ ఈజ్ వోవర్" అని ప్రసార యంత్రాన్ని ఆపుచేశాడు.

జగదీష్ భూమికి పంపిన వార్త విన్న నరేంద్ర ముఖం ఆనందంతో వెలిగింది. తనని ఎప్పుడు గ్రహం మీద దిగమంటాడా అని ఎదురుచూడసాగాడు.

* * *

నరేంద్ర స్పేస్ సూట్ తొడుక్కున్నాడు. ఎలక్ట్రిక్ టార్చిగల హెల్మెట్ టోపీ పెట్టుకున్నాడు. ఒక చిన్న పోర్టబుల్ టెలివిజన్ ట్రాన్స్‌మిటర్‌ని కూడా పట్టుకుని నౌకలోని వారికి వీడ్కోలు చెబుతూ బయటికి వచ్చే ఎయిర్‌లాక్స్ తెరిచి మళ్ళీ మూసేశాడు. శూన్య గది తలుపుతెరిచి బయటికి చూశాడు. ధాదాపు మూడేళ్ళ తరవాత బయటకి అడుగు పెట్టబోతున్నాడు. ఆకాశం నల్లగా వుంది. మినుకు మినుకుమనే చుక్కలు కనిపించాయి. నౌక కిందికి చూశాడు. ఏమీ కనిపించలేదు పక్కనే వున్న స్విచ్ నొక్కాడు. నౌక కింది భాగంలో అమర్చి వున్న లైటు వెలిగింది.

అశ్వని దిగిన ప్రాంతం ఇప్పుడు బాగా కనిపిస్తోంది. ఏ రాళ్ళూ రప్పలూ లేకుండా నున్నటి ప్రదేశం మీద తన మూడు కాళ్ళతో నిలబడి వుంది నౌక. నౌక మీది నుంచి కిందికి దిగడానికి ఇనుపనిచ్చెన వుంది. ముందుగా దానిని దించాలి. పక్కనే వున్న మరో స్విచ్చి నొక్కాడు. ఒక మోటారు పనిచేసి నిచ్చెనను కిందికి జార్చింది. ఆ మెట్ల మీది నుంచి మెల్లగా కిందికి దిగాడు.

కింద నిలబడ్డాడు. అసలు గురుత్వాకర్షణ వున్నట్లే లేదు. తన మీద నున్న ఆక్సిజన్ సిలెండరు, టి.వి. ఎక్విప్‌మెంటు అన్నీ కలిపి పది కిలోగ్రాములకు పైగానే వుంటాయి. అయినా బరువు అనిపించడమే లేదు. నేలను కాళ్ళు ఆనన్నప్పుడు నడిచేది ఎలా? చంద్రుని మీదలాగ ఇక్కడా పరిగెత్తితే బోర్లా పడడం ఖాయం అనుకున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ

నౌక కింది భాగంలో దాని మూడు కాళ్ళ మధ్యా తిరిగాడు. నెమ్మదిమీద నడక అలవాటౌతుందనే నమ్మకం కలిగింది.

ఇయర్ ఫోన్లో జగదీష్ గొంతు వినిపించింది – "నరేంద్రా, టెలికాస్ట్ చెయ్యి. మేము కూడా ఇక్కడినుంచి చూస్తాము" అన్నాడు.

వెంటనే నరేంద్ర చంకన తగిలించుకున్న టి.వి. ట్రాన్స్‌మిటర్ ఆన్ చేశాడు. టి.వి. కెమేరాని చేతుల్లోకి తీసుకుని తను చూస్తున్న ప్రతిదీ నౌకలోనికి ప్రసారం చెయ్యసాగాడు.

నౌక మూడు కాళ్ళ మధ్యభాగంలో గురుత్వాకర్షణ తక్కువగా వుంది. దాని మధ్య భాగంనుంచి కాళ్ళున్న వేపు ఎడంగా జరుగుతున్నకొద్దీ పెరుగుతోంది. ఈ విషయాన్ని గమనించిన నరేంద్ర వైర్‌లెస్‌లో జగదీష్‌కి తెలియజేశాడు.

"గురుత్వాకర్షణ అన్నిచోటలా ఒక్కలాగలేదు సర్. మధ్యభాగంనుంచి ఎడమకి జరుగుతున్నకొద్దీ ఎక్కువౌతోంది" అని చెప్పాడు.

జగదీష్ సమాధానంగా "కరెక్ట్. ప్రొఫెసర్‌గారు ఊహించింది నిజమే. మీ స్పేస్ సూట్‌కి కేబుల్‌ని హుక్ చేసుకుని మరికాస్త బయటిదాకా తిరగండి పరవాలేదు" అన్నాడు.

నరేంద్ర "పరవాలేదు ఏమిటి. మీరు ఊ అనండి. మొత్తం ప్రాంతం అంతా కేబుల్ లేకుండానే గాలించి వస్తాను" అన్నాడు.

జగదీష్ "మనం అలాంటి రిస్కులు తీసుకోలేం. కేబుల్ తగిలించుకోండి" అని చెప్పి నౌక చుట్టూ అమర్చబడిన అన్ని టి.వి. కెమేరాలని ఆన్ చేశాడు. నరేంద్రమీద కాంతి పడుతుండటంచేత వివిధ భంగిమల్లో నరేంద్ర టెలివిజన్ తెరలమీద ప్రత్యక్షమయ్యాడు. కేబుల్‌ని తగిలించుకోవడం కనిపించింది.

అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకి సాగుతున్నాడు. సూర్యకాంతి అతనిమీద పడసాగింది. వృత్తాకారపు పరిధిలో నౌక చుట్టూ అన్నివేపులా కలయతిరిగాడు. నౌక చుట్టూ అమర్చబడిన కెమేరాల దృష్టిని తప్పించుకుని ఎవ్వరూ నౌకని చేరుకోలేని విధంగా అమర్చడంచేత ఒకదాని వ్యూలోంచి తప్పిపోవడానికి ముందే మరో టెలివిజన్ తెరమీద కనిపించసాగాడు.

అందరూ టి.వి. తెరలమీద దృష్టిని కేంద్రీకరించి నరేంద్రని గమనించసాగారు.

నరేంద్ర నౌక ఒక కాలు దిక్కుగా ముందుకి నడవడం సాగించాడు. టెలిస్కోప్‌లో చూసిన త్రిభుజకోణాలకి ఎదురుగా ఉండే నల్లని మూడు చుక్కల కోసం ఆ దిక్కుగా పోసాగాడు. కాస్త దూరం నడవగానే తనముందు నల్లని పెద్ద వృత్తాకారపు తివాచి పరిచినట్టుఉంది. విచిత్రంగా గురుత్వాకర్షణ ఇంచుమించు భూమిమీద ఉన్నంతే ఉన్నట్లు అనిపించింది. మైదానంలాంటి ఆ ప్రదేశాన్ని ఉత్సాహంగా గాలించాడు. ప్రొఫెసర్ ప్రసాద్ ఆ చుక్కలమీదనే ఎయిర్‌లాక్స్ కూడా వుండవచ్చునని చెప్పడం జ్ఞాపకం వుంది.

అనుకున్నట్లే ఒకచోట చక్రంలాంటిది కనిపించింది. దాదాపు బండిచక్రం పరిమాణంలో వుందది.

ట్రాన్స్‌మిటర్ ఆన్‌చేశాడు. "హలో... ఇక్కడ ఒక బండిచక్రం లాంటిది ఉంది.

నేలమీద అడ్డంగా పడివుంది" అని తెలియ జేశాడు.

ఇందాకటినుంచీ అతను తెలియజేయ బోయే సమాచారం కోసం ఎదురు చూస్తున్న కెప్టెన్ జగదీష్ "హలో నరేంద్రా...మేము కూడా నిన్ను ఫాలో అవుతున్నాం. కెమేరాకి చాలాదూరం వెళ్ళిపోయావు. క్లియర్‌గా కనిపించడం లేదు. ఆ చక్రాన్ని ప్రసారం చెయ్యి" అని చెప్పాడు.

నరేంద్ర ప్రసారం చేశాడు. నౌకలోని వారు ఆ చక్రాన్ని చూశారు. గుండ్రంగా నేలమీద బల్లపరుపుగా ఆనించి వుంది. చుట్టూవున్న చక్రపుకమ్మీ దానిని తిప్ప డానికి ఉద్దేశించినట్లు మధ్య మధ్య పట్టు కోవడానికి గ్రిప్స్‌లాంటివి వున్నాయి.

జగదీష్‌కి చప్పున ఒక ఆలోచన వచ్చింది. నరేంద్ర అసలే తొందర మనిషి. ఒకవేళ దానిని ఎలక్ట్రిఫై చేశా రేమో. షాక్ కొడితే ప్రమాదం అనుకుని వైర్‌లెస్‌లో "హలో నరేంద్రా...దాన్ని ముట్టుకోవద్దు" అని చెప్పాడు.

నిజానికి నరేంద్ర నురుక్షణం చెయ్య బోయే పని అదే. "స్టాటిక్ ఛార్జి ఏదైనా వుంటుందని అనుమానిస్తున్నారా?" అని అడిగాడు.

"ఉండవచ్చును. లేకపోవచ్చును. కాని మనం నిర్ధారణ చేసుకోకుండా ఏ పనీ చెయ్యకూడదు. మన విజయం మీదనే వెయ్యి కోట్ల జనాభా చావు బతుకులు ఆధారపడి వున్నాయని మరిచిపోకూడదు"

"ఓకేసార్ ! నన్నిప్పుడేం చెయ్య మంటారు?"

"మీ స్పేస్ సూట్ జేబులో ఒక ఎలక్ట్రో మాగ్నటిక్ ఇండికేటర్ వుంది. దానిని తీసి చక్రానికి దగ్గరగా, దూరంగా జరుపుతూ ఆ మీటరులోని ముల్లుని గమ

ఆనంద్

నించండి. ఆ ముల్లు గనక కంపించక పోతే మీరు ముట్టుకోవచ్చును" అని చెప్పాడు.

నరేంద్ర అలాగే చేశాడు. ముల్లు కదలలేదు. అంటే ఎలక్ట్రిసిటీ, మేగ్నటిజమ్‌కి సంబంధించిన విద్యుత్తు దానిమీద లేదని తెలిసింది. అంత మాత్రం చేత మరో విధమైన ప్రమాదం లేదని ఎలాగ చెప్పగలం? తనకి అలాంటి భయాలేం లేవు. అయినా క్రమశిక్షణతో, కమాండరు చెప్పిన ప్రికాషన్లు తీసుకోవాలి. లేకపోతే ఏది జరిగినా నిష్ఠూరం. తన మీదకి వస్తుంది అనుకున్నాడు.

మొదట అంటీ అంటనట్లు ముట్టుకుని చెయ్యి తీసేశాడు. ఏమీ కాలేదు. తరవాత గట్టిగా పట్టుకున్నాడు. రెండు చేతులతో చక్రాన్ని తిప్పడానికి ప్రయత్నించాడు. బరువుగా అనిపించి చక్రం తిరగలేదు.

నౌకలోనివారు రెప్పపాటు మరిచి పోయి నరేంద్రనే గమనిస్తున్నారు. జగదీష్ ట్రాన్స్‌మిటర్‌లో "అది బిగుసుక పోయి వుండవచ్చు. మీరు ఆ చక్రాన్ని తిప్పడం ఆపండి. మిగిలిన రెండు చుక్కలను కూడా సమీపించి యిలాగే పరీక్షించండి" అని ఆదేశించాడు.

నరేంద్ర జగదీష్ ఆదేశానుసారం తక్కిన రెండు చుక్కలను చేరుకుని చూశాడు. వాటి మీద కూడా యిలాగే చక్రాలను గుర్తించాడు. కాని కుడికిగాని, ఎడమకిగాని తిప్పలేకపోయాడు.

కెప్టెన్ ఆ సంగతి గ్రహించి "నరేంద్రా! యు గెట్ బేక్. మరోగంట తరవాత చూద్దాం. అందరం కలిసి ఒక పథకం రూపొందిద్దాం" అని చెప్పాడు.



కొద్ది క్షణాల్లో నరేంద్ర వ్యోమ నౌకలో ప్రవేశించాడు.

* * *

అప్పటికే ఆ గ్రహంలోకి దూరడానికి లాక్స్ అని భావించబడుతున్న చక్రాలను తిప్పడానికి ఎవరికి తోచిన పద్ధతి వాళ్ళ మనస్సుల్లోనే ఆలోచించసాగారు. చివరికి డాక్టరు సరోజ కూడా అదే ఆలోచించి సాగింది. మానవుని మేధస్సు అలాంటిది. ఇంత సైన్సునీ అవసరమే సృష్టించింది.

"ప్రొఫెసర్ ప్రసాద్! దీనిని తెరిచే మార్గం మీరేదైనా ఆలోచించారా" అని అడిగాడు జగదీష్.

ప్రసాద్ "చూశాం గదా. నరేంద్ర మనందరిలోకి బలమైన యువకుడు. క్రీడాకారుడు. తన శక్తినీ, తెలివినీ వుపయోగించి ప్రయత్నించాడు. ఆలెక్కన ఒక్కొక్కరం దానిని తెరవలేం. అందరం ఒక్కసారే వెళ్ళి తిప్పి చూద్దాం" అన్నాడు.

జగదీష్ "దానికి మాత్రం నేనొప్పుకోను. మనకి తెలియని ఎన్నో ప్రమాదాలు పొంచి వుండవచ్చును. మూకమ్మడిగా ఆ గ్రహంలోనివారు తలుపు తెరిచిన అలికిడికి వచ్చి మీద పడవచ్చును. అటువంటప్పుడు అందరం దెబ్బతింటాం. ఒక్కరో యిద్దరో గనక అయితే పరవాలేదు. నౌకలోవున్న వారు నౌకచుట్టూ అమర్చిన లేసర్‌గన్స్‌ని వాడి వాళ్ళని ఎదుర్కోవచ్చును" అని చెప్పి సూర్యకుమార్ వేపు చూశాడు. "మీకు వేరే అయిడియా ఏదైనా వుంటే చెప్పండి" అన్నాడు.

సూర్యకుమార్ కూడా ఇంచుమించు ప్రొఫెసర్‌లాగే ఆలోచించాడు. నరేంద్రే తెరవలేనప్పుడు ఒంటరిగా మరెవ్వరూ తెరవలేరు. అందుకే ఏమీ మాట్లాడలేదు.

జగదీష్ "సరే నా అభిప్రాయం వినండి. మనందరికీ ఎంతశక్తి వుందో అంతకన్నా ఎన్నోరెట్లు శక్తి మన హను మాన్‌కి ఉంది. నరేంద్రకి తోడుగా హన్‌మాన్‌ని ఫంపుదాం" అన్నాడు.

అందరూ అది బ్రిలియంట్ అయిడియా అని ఆమోదించారు. హనుమంతుడు బల వంతుడని వాళ్ళందరికీ తెలుసును. కాని సమయాన జ్ఞాపకం రాలేదు.

సరోజ అందుకుని "నాకొక సందేహం. హనుమాన్ తెరవగలిగినప్పుడు మళ్ళీ నరేంద్రకూడా ఎందుకు? మీరన్నట్లు ఎవ రైనా మీదపడితే నరేంద్ర రిస్కులో పడడా" అంది.

"నిజమే. ఆ సంగతి ఆలోచించ వలసిందే" అన్నాడు జగదీష్.

నరేంద్ర "ఇలా ప్రతి దానికీ మీన మేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే అయి నట్లే.అయినా నాకొభయంలేదు. నేను హను మాన్‌ని లీడ్ చేస్తాను. ఒకవేళ ఎవరైనా రావాలేగాని వాళ్లు మనని చంపరని నా నమ్మకం. అటువంటి పనిచెయ్యబోతే హనుమాన్ పదిమందికి సమాధానం చెప్ప గలడు" అని తన ఉద్దేశం చెప్పాడు.

రౌండ్ టేబుల్‌కి కాస్త ఎడంగా తన సీటులో కూర్చున్న హనుమాన్‌ని లేపుదాం అనుకున్నాడు జగదీష్.

హనుమాన్ సరిగా పనిచేస్తున్నాడా లేదా అని పరీక్షించడానికి ఒకటే మార్గం. అతని దిక్కుగా ఉసిరికాయ పరిమాణంలో వున్న ఏ వస్తువునైనా విసిరితే దానిని తాకేలోగా గాలిలోనే అందుకుంటాడు. ఆ ఉసిరికాయను అతనికి అభిముఖంగానే విసరవలసిన పనిలేదు.వెనకనించి విసిరినా మెరుపులాగా తిరిగి అందుకుంటాడు.

కోడిగుడ్డును చితక్కుండా పట్టుకో గలడు. సూది బెజ్జంలో దారం ఎక్కించ గలడు. జగదీష్ ఒక రబ్బరు బంతిని హను మాన్ దిక్కుగా విసిరాడు. దానిని గాలి లోనే ఒడుపుగా అందుకుని మళ్ళీ అతని కేసి విసిరాడు హనుమాన్.

జగదీష్ "హనుమాన్!" అని పిలవ గానే శబ్దతరంగాలు చెవిలోని మైక్‌లో తగిలి ఉలిక్కిపడ్డట్టు చూశాడు.

జగదీష్ దిక్కుగా తన టి.వి కళ్ళతో చూస్తూ "ఎస్ బాస్" అన్నాడు

జగదీష్ దగ్గరకు రమ్మని సంజ్ఞ చేశాడు. హనుమాన్ ఆసనం మీదనుంచి లేచి దగ్గరకు వచ్చాడు. నరేంద్రని అనుసరించి అతను చెప్పిన పని చెయ్యమన్నాడు ముందు నరేంద్ర, వెనక హనుమాన్ నౌక బయటికి నడిచారు.

మరో పది నిముషాలలోనే హను మాన్, నరేంద్ర ఒక లాక్ దగ్గరకిచేరారు. టెలివిజన్ తెరమీద వాళ్ళని నౌకలోని వాళ్ళంతా గమనిస్తున్నారు. నరేంద్రకి మాత్రమే కేబుల్ వుంది, హనుమాన్‌కి ఏ కేబుల్ లేదు. అతనిని విచిత్రగ్రహం శూన్యంలోనికి విసిరివేసినా తన స్వశక్తితో అశ్వనిని చేరుకొనగలడు. అందుకే హను మాన్‌కి కేబుల్‌లేదు.

నరేంద్ర హనుమాన్‌కి చక్రాన్ని చూపి దానిని కుడివేపు తిప్పమన్నాడు. హను మాన్ మామూలు బలాన్ని వాడి చక్రాన్ని తిప్పబోయాడు. చక్రం కదలలేదు. రాను రాను బలాన్ని పెంచుకుంటూ పోయాడు. అంతే! చక్రం తిరిగింది. సరిగ్గా నూట ఎనభై డిగ్రీలు తిరిగి వూరుకుంది. ఎంత ప్రయత్నించినా మరి తిరగలేదు.

హనుమాన్ "ఇట్ హేజ్ స్ట్రక్ అప్ బాస్" అన్నాడు

"ఫరవాలేదు. చక్రాన్ని పట్టుకుని



పైకి లేపు" అన్నాడు నరేంద్ర.

హనుమాన్ పైకి లేపబోయాడు. లేవ లేదు. అది గ్రహించిన నరేంద్ర "కిందికి తొయ్యి" అన్నాడు.

హనుమాన్ తన శక్తినంతా వినియోగించి చక్రాన్ని అదిమాడు.

ఒక్క కుదుపుతో లోనికి దిగిపోయింది. నరేంద్ర దానిలోకి తొంగి చూశాడు. పెద్ద చీకటి సొరంగం.

అదంతా నౌకలోంచి గమనిస్తున్న జగదీష్ "నరేంద్రా! లోపల ఏమైనా కనిపించిందా?" అనడిగాడు.

"లేదు. లోపల అంతా చీకటి. లోనికి ప్రవేశించి చూడమంటారా?" అనడిగాడు.

"మీరు హెల్మెట్ టార్చ్‌ని వెలిగించండి ముందు. ఆ వెలుగులో సొరంగాన్ని పరిశీలించండి" అని చెప్పాడు.

నరేంద్ర అలాగే చేశాడు. దగ్గర ఎనిమిది అడుగుల ఎత్తు,నాలుగు అడుగుల వెడల్పుగల వసారాలాంటిది ముందుకి మార్గంచూపుతోంది. ఎంత దూరంవుందో ఏమోగాని టార్చికి అందలేదు.

నరేంద్ర "ఏ అలికిడీలేదు. గాలిలేదు గనక అలికిడి ప్రశ్నేలేదనుకోండి. ఏదో టన్నెల్‌లాగ వుంది. పైనా కిందా పక్కల నున్నటి గోడలున్నాయి. దిగి వెళ్ళమంటారా?" అనడిగాడు.

"వెళ్ళండి. కాని హనుమాన్ ముందుండాలి. మీరు హనుమాన్‌ని అనుసరించండి" అన్నాడు జగదీష్.

హెల్మెట్ టార్చి కాంతిలో ముందు హనుమాన్, వెనక నరేంద్ర ఆ టన్నెల్ లోనికిదూరి నడవసాగారు.దాదాపు యాభై అడుగుల దూరం వెళ్ళగానే ఎదురుగా నున్నటి గోడ అడ్డంవచ్చింది. కుడివేపు, ఎడమవేపు గోడలమీద పరికించాడు. మరో లాక్ చక్రం గోడమీద కనిపించింది. ఆ విషయాన్ని కెప్టెన్ జగదీష్‌కి తెలియజేశాడు.

"ఇప్పుడే మీరు జాగ్రత్త వహించాలి. ఇంతవరకూ మీరు వెళ్ళింది శూన్యంగది. దానిలో వాతావరణం వుంటుంది. మీరు లాక్ తెరిచే ప్రయత్నంచేస్తే లోపలి వాళ్ళకి తెలుస్తుంది. లేసర్‌గన్ రెడీగా పొజిషన్‌లో పెట్టుకో! లాక్ తెరిచిన తరువాత హనుమాన్ ముందు వెళ్ళిన తరవాతగాని లోనికి అడుగుపెట్టకు" అని తగిన సలహాలన్నీ యిచ్చాడు జగదీష్.

ఈమారు హనుమాన్ తలుపుని సుళువుగానే తీశాడు. ఒకసారి చేసింది ఎప్పుడూ మరిచిపోడు హనుమాన్. కుడికి $180^{\circ}$ తిప్పి ముందుకి తోశాడు. తలుపు తెరుచుకుంది. లోపల కాస్త వెలుగువుంది. ఆ వెలుగు ఎక్కడినుంచి వస్తున్నట్టు అనుకుని హనుమాన్ వెనకే ప్రవేశించాడు. ముఖానికి కాస్త గాలి తగిలింది. ఎయిర్‌లాక్ పెట్టడానికి కారణం తెలుసు గనక లోనికి వెళ్ళి మూసేశాడు.

అది పెద్ద టన్నెల్. కాస్త ఎడమవేపుకి తిరిగివుంది. చివరిదాకా హనుమాన్‌ని అనుసరించాడు. దాదాపు వంద అడుగుల దూరంపోయిన తరవాత మరో లాక్ కనిపించింది. ఈమారు జగదీష్‌కి చెప్పలేదు. జగదీష్ భావించినట్లే ఎవరైనా జీవులుంటే ఈసరికే హనుమాన్‌ని ఎదుర్కోవలసింది అనుకుని హనుమాన్‌ని లాక్ తెరవమన్నాడు. హనుమాన్ లాక్ తెరిచాడు.

లోనికి తొంగిచూసిన నరేంద్ర తన కళ్ళను తను నమ్మలేకపోయాడు.

కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు. భూమి మీద నివసించే ఎవ్వరికి చెప్పినా




అర్థంకాని విచిత్ర ప్రపంచం. అది నిజంగా మరో ప్రపంచం.

ఎదురుగా ఒక మైలుదూరం వ్యాపించి వున్న నేల తరువాత సముద్రం. ఆ సముద్రం అవతల కనుచూపు మేరలో మళ్లీ నేల. తలని పైకెత్తి చూశాడు ఆకాశం కనిపిస్తుందేమో అనుకున్నాడు గానీ అక్కడా నేలే. గ్రహాంతర్భాగంలో వృత్తాకారంగా ఆవరించుకున్న భూమి. అలాగే వృత్తాకారంగా ఆవరించుకుని పైనా కింద సముద్రమే. నరేంద్రకి ఏమీ అర్థంకాలేదు. సముద్రపు నీరు కిందికి పడిపోదేం ? భూమి ఘన పదార్థం గనక అతుక్కుని వుంది అనుకోవచ్చును. నీరు ఎలాగ పైన అతుక్కుని వుంది ? ఆ ఆశ్చర్యంలో ఒళ్ళుమరిచిపోయాడు. ఎవ రయినా వచ్చి చంపుతారేమోననే భయ మైనా లేకుండా నాలుగడుగులు ముందుకు వేసి అంతా కలయజూశాడు.

అప్పుడు ట్రాన్స్‌మిటర్ ఆన్‌చేసి జగదీష్‌కి వివరించాడు.

సమాధానంగా జగదీష్ "నువ్వు చెప్పేది సరిగ్గా వినిపించడంలేదు. మధ్యలో ఒక రిలే బూస్టర్ పెట్టాలేమో" అనడం వినిపించింది.

నరేంద్ర కొంచెం గట్టిగా "సర్! ఇదొక విచిత్రప్రపంచం. నాకేమీ అర్థం కావడంలేదు. ఎలాంటి జీవీ ఇంకా కని పించలేదు. కనుచూపు మేరలో ఓ మైలు దూరం అనుకోండి. సముద్రం కనిపి స్తోంది. తరువాత మళ్ళీ నేల" అని చెప్పాడు.

"ఆల్‌రైట్! తరువాత అందగం స్టడీ చేద్దాం. ఇంక హనుమాన్‌ని వెంటబెట్టుకుని మీరు వచ్చేయండి. వచ్చేటప్పుడు ఎయిర్ లాక్స్ మూసెయ్యడం మరిచిపోవద్దు" అని చెప్పాడు కెప్టెన్.

నరేంద్రకి గ్రహాంతర్భాగంలో గాలి ఉన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. మెల్లగా హెల్మెట్‌ని తొలగించి ముక్కుకి తగిలించి వున్న ఆక్సిజన్ సిలెండర్ కనెక్షన్ తొల గించాడు. మెల్లిగా కాస్త గాలి పీల్చాడు. చిత్రం! ప్రాణవాయువు ఎక్కువ పాళ్ళలో వున్న స్వచ్ఛమైన గాలి. అబ్బా ఎంత అదృష్టం. ఆ సంగతి వెంటనే జగదీష్‌కి చెప్పుదామనుకుని మళ్ళీ వూరుకున్నాడు. తర్వాత మెల్లిగా చెప్పవచ్చు. మళ్ళీ ముక్కుకి సిలెండర్ ట్యూబ్‌ని, హెల్మెట్‌ని యధాతథంగా అమర్చుకున్నాడు. హనుమాన్‌ని రమ్మని సంజ్ఞచేసి టన్నెల్ లోకిచూశాడు. హనుమాన్ రాగానే లాక్ మూసేశాడు. లాక్‌లు జాగ్రత్తగా మూసు కుంటూ జాగ్రత్తగా గ్రహం ఉపరితలా నికి వచ్చాడు. మరో పది నిమిషాలలోనే హనుమాన్‌తో అశ్వనిలో ప్రవేశించాడు అందరూ నరేంద్ర చుట్టుముట్టారు.

నరేంద్ర తను చూసింది చూసినట్లు తన అనుభూతిని కూడా వర్ణించి వివరిం చాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ నరేంద్ర చెప్పింది విని "ఇది మనం అనుకున్నట్లు నిశీధిలో నిరంతరయానం చెయ్యగల విశ్వసంచార రోదసీ నౌక. అది భ్రమణాలు చెయ్యడం వల్లనే లోపల సెంట్రిఫ్యూగల్ ఫోర్స్ వలన మన వ్యోమ నౌకలోని గోడలమీద నిలబడి అనుకుని సంవత్సరాలు ప్రయా ణించినట్లు - ఈ విశ్వసంచారి గోడలకు నీరు అంటుకుని వుంది" అని నరేంద్రకి వివరించాడు.

ఆరోజు అందరూ నిశ్చింతగా విశ్రాంతి తీసుకున్నారు.



## 5

ఎటువంటి జీవరాశి విచిత్రగ్రహం లోపల కనిపించలేదని నరేంద్ర చెప్పడంచేత డాక్టర్ సరోజని, హనుమాన్‌ని అశ్వనిలో వుంచి తక్కిన నలుగురూ గ్రహాంతర్భాగం పరిశీలించడానికి మరునాడు బయలుదేరారు.

గ్రహం ఉపరితలం లాక్‌ని తెరిచే వుంచేశారు. ఆ లాక్‌నుంచి రెండో లాక్ దాకా వున్నది కేవలం శూన్యమే! గాలి తప్పించుకుపోయే ప్రశ్నే లేదు. లోనికి ప్రవేశించారు. లాక్‌లు దాటుకుని మూసుకుని గ్రహంలోనికి ప్రవేశించారు. భూమి మీద గురుత్వాకర్షణ అంతే ఇంచుమించు కృత్రిమంగా గ్రహభ్రమణం వలన ఏర్పడి వుండడంచేత చకచకా తిరగసాగారు.

నరేంద్ర ముందు తోవ తీశాడు. ఎయిర్‌లాకర్ నుంచి సముద్రతీరాన్ని చేరడానికి అద్దంలాంటి నున్నని రోడ్డు వుంది. ఆ రోడ్డుని పట్టుకుని సముద్రం వేపుగా నడక సాగించారు. ఎవరి పరిశీలన వారు చేయసాగారు. ఏదైనా చిత్రంగా కనిపిస్తే తనకి చెప్పమని జగదీష్ అందరికీ ఆదేశాలిచ్చాడు.

నరేంద్రకి ఆక్సిజన్ సిలెండర్లు బరువనిపించాయి. వాటితో సులువుగా తిరగడం కష్టం. గ్రహంలో ఆక్సిజన్ వుందని ఎలాగూ తెలుసును. గబగబా సిలెండర్, దానికి సంబంధించిన హెల్మెట్ అన్నీ పీకేశాడు. మెల్లగా తను ఇదివరకే ప్రాణవాయువు సంగతి కనుక్కున్నట్లు చెప్పాడు.

జగదీష్‌కి కోపం వచ్చినా నరేంద్ర ధైర్యానికి లోలోపల సంతోషించాడు. వెనువెంటనే ఆ బరువులు తీసిపారేశారు. ఇంక మిగిలివున్నది కేవలం స్పేస్ సూట్ మాత్రమే! అది చలినుంచి కాపాడడానికి వుంచుకున్నారు.

ప్రతాప్ కూడా వాళ్ళని అనుసరిస్తున్నాడు. కెప్టెన్ జగదీష్ ప్రతాప్‌ని ఆక్సిజన్ సిలెండర్ ఎక్విప్‌మెంట్ దగ్గర కాపలాగా కూర్చోమన్నాడు. ప్రతాప్ ఉండిపోయాడు. అసలు వాటికి కాపలా పెట్టవలసిన అవసరమేలేదు. అయినా బేటరీలు కాలడం తప్ప ప్రతాప్ రావడంవలన ఉపయోగమూ లేదు. అందుకనే వదిలేసి వెళ్ళిపోయారు.

జగదీష్ గ్రహంలోని పరిశుభ్రతకి అబ్బురపడిపోయాడు. నడుస్తున్న రోడ్డు మీద చిన్నమరకగాని, దూళిగాని లేదు. ఇంత శుభ్రంగా ఇది ఎలా వుంది? జీవులు లేరు అనడానికి ఇది తార్కాణం. ఉంటే కాస్తయినా మలినం చెయ్యరా అనుకొన్నాడు. తలపైకెత్తి అన్నివేపులా పరిశీలించాడు. పెద్ద మద్దెల లోపలిభాగంలా కనిపించింది. మూడు లాక్‌లదగ్గర నుంచీ మూడురోడ్లు సముద్రాన్ని చేరుతున్నాయి. తలపైకెత్తి కుడివేపు ఒకటి, ఎడమవేపు చూస్తే ఒకటి ఆకాశంమీదినుంచి పోతున్నట్లున్నాయి ఆ రోడ్లు. తాము నడుస్తున్న దానితో మూడు. వృత్తాన్ని మూడు భాగాలుగా విభజించి మూడు రోడ్లని లాక్‌లనుంచి సముద్రానికి




షేశారు అనుకుని ఆశ్చర్యపోయారు.

సూర్యకుమార్ వచ్చేటపుడు బైనాక్యులర్స్ తెచ్చుకున్నాడు. అందుచేత గ్రహాంతర భాగాన్ని అందరికన్నా వివరంగా చూడగలుగుతున్నాడు. సముద్రం దాకా అందరికీ బాగానే కనిపిస్తోంది. కాని సముద్రం అవతలిభాగం మామూలుకళ్లకు సరిగ్గా కనిపించడంలేదు. సూర్యకుమార్‌కి అవతలిభాగం కూడా స్వచ్ఛంగానే కనిపిస్తోంది. అవతలా యివతలలాగే చుట్టూ ఆవరించుకున్న భూమి. బహుశా అవతల కూడా ఇలాగే లాక్సు వుండవచ్చును. అవి గ్రహం అవతలి ధృవానికి దారితీస్తాయని ఊహించుకున్నాడు. ఒకవేళ అక్కని దిగింది ఉత్తరధృవం అనుకుంటే అవతలిది దక్షిణధృవం అవుతుందన్నమాట. అటునుంచి కూడా ఈ విచిత్ర గ్రహంమీద దిగవచ్చునన్నమాటే. ఒకటి రావడానికి, ఒకటి పోవడానికి వాళ్లు ఏర్పాటుచేసే వుంటారు.

ప్రొఫెసర్ ప్రసాద్ తనజేబులోనుండి థర్మామీటరుతీసి గ్రహంలోని టెంపరేచరు చూశాడు. మైనస్ పది డిగ్రీలుచూపించింది. అయితే అందరం రిఫ్రిజిరేటర్‌లో దూరామన్నమాట అనుకున్నాడు. గ్రహంలోని గాలిలో ఎక్కువ పాళ్లు ప్రాణవాయువు వున్నట్లు తెలుసుకున్నాడు. భూమిమీద ఇరవైశాతమే. ఇక్కడ యాభైశాతందాకా వున్నట్లు అంచనా వేశాడు. ఒక్కసారి ఊపిరితిత్తులనిండా గాలి పీల్చుకుంటే మళ్ళీ చాలా సేపటివరకూ ఊపిరి సలుపుతుంది. ప్రాణవాయువు శాతం ఎంతుందో పరీక్షించాలి అని కూడా అనుకున్నాడు. ఇదేగనక ఒక నాగరికజాతి నిర్మించి వుంటే ఇదేశాతం ప్రాణవాయువు ఎప్పటికీ వుండేలాగ ఏదోచేసి వుంటారు. భూమిమీద జంతువులు ప్రాణవాయువుని ఉపయోగించుకుని బొగ్గుపులుసు వాయువుని విసర్జిస్తాయి. వృక్షాలు బొగ్గుపులుసు గాలిని వాడుకుని ప్రాణవాయువుని విసర్జిస్తాయి. ఆ విధంగా ప్రకృతిసిద్ధమైన తూకం అక్కడ వుంది. ఇక్కడకూడా ఏదో వుండివుంటుంది అనుకున్నాడు. సముద్రం చేరగానే కొంతనీటిని శాంపుల్ తీసుకుని డాక్టర్ సరోజకి తీసుకునివెళ్ళి ఏదయినా బాక్టీరియా వుందేమో చూడమనాలి అనుకున్నాడు.

నరేంద్రకి ఇదేంలేదు. గబగబా సముద్రం చేరాలి. దానినికూడా దాటి వీలుంటే అవతలివేపు కూడా త్వరగా సర్వే చేసెయ్యాలి అనిమాత్రం అనుకున్నాడు.

జగదీష్ సూర్యకుమార్ నుంచి బైనాక్యులర్స్ తీసుకుని పరిశీలించాడు. మరికా స్తదూరంలో నాలుగురోడ్ల కూడలి కనిపించింది. బైనాక్యులర్స్‌లో పైకిచూశాడు. వృత్తాకారంగా ఒక రోడ్డు మూడు రోడ్లనీ కలుపుతోంది. ఆ చౌరాస్తానుంచి కుడికి ఒకరినీ, ఎడమకి ఒకరినీ పంపి ఇద్దరు తిన్నగాసముద్రంచేరితే త్వరగా గ్రహాన్ని సర్వేచేసినట్లు వుంటుంది. కాని ఏమయినా ప్రమాదాలు జరిగితే ఒంటరిగా ఎదుర్కోవడం కష్టం అని మళ్ళీ ఆ తలంపుని మానుకున్నాడు.

నాలుగురోడ్ల జంక్షన్ రానేవచ్చింది. నలుగురూ కూడబలుక్కున్నారు. సముద్రం దాకా అందరూ ముందుకి సాగడమా లేక కుడికీ, ఎడమకీ యిద్దర్ని పంపడమా అనే విషయంలోకాస్తసేపు తర్జనబర్జనసాగింది.

జగదీష్ "అందరం కలిసే తిరుగుదాం. ఈ గ్రహం మీద నిజంగానే ఏ ప్రాణిలేదు అని నిర్ధారణగా తేలేదాకా



ఇలాంటి సాహసాలు చెయ్యవద్దు. పదండి ముందుకి" అని తోవ తీశాడు.

నరేంద్ర "ఏం పర్వాలేదు. నేను ఈ కుడివేపు రోడ్డు పట్టుకుని ఆ పైన కనిపిస్తున్న కుడివేపు రోడ్డుని పట్టుకుంటాను. ఆ రోడ్డు ద్వారా సముద్రం చేరి మళ్ళీ ఎడమకి తిరిగి మీరు సముద్రం చేరే లోగానే కలుసుకుంటాను. నాకు రన్నింగ్ ప్రాక్టీసు లేకుండా పోయింది. ప్లీజ్" అని జగదీష్‌ని అభ్యర్థిస్తూ మరోమాటకి తావియ్యకుండా కుడివేపుకి పరుగెత్తాడు.

జగదీష్ "ఈ నరేంద్ర ఎప్పుడో మన పీకల మీదికి తెచ్చేలాగున్నాడు" అని ప్రసాద్, సూర్యకుమార్ వేపు చూస్తూ అన్నాడు.

పరుగెత్తుతున్న నరేంద్రని ఉద్దేశించి గట్టిగా "ఒక్క క్షణం ఆగు" అని అరిచాడు. ఆ గ్రహంలో గాలి వుండడం వల్ల శబ్దతరంగాలు నరేంద్ర చెవులని చేరాయి. నరేంద్ర ఆగాడు. ఇదే గాలిలేని చంద్రుని మీదైతే వైర్‌లెస్‌లో మాట్లాడుకోవలసిందే. చెవుల్లో ఇయర్‌ఫోన్లు, నోటి దగ్గర మైక్రోఫోను. చంద్రుని మీద సంచరించిన రోజులు జ్ఞాపకం వచ్చాయి.

"ఎవరైనా మీదపడితే ఏం చేస్తావ్" అని అడిగాడు.

నరేంద్ర స్వరున జేబులోనుంచి లేసర్ గన్ బయటికి లాగాడు. జగదీష్‌కి చూపిస్తూ "ఇదిగో దీనిని శివుని మూడో నేత్రంగా వుపయోగిస్తాను" అన్నాడు.

జగదీష్ "సరే. ఏమైనా విశేషాలు కనిపిస్తే వైర్‌లెస్‌లో చెప్పు" అని చెయ్యి వూపాడు.

"సరే సర్" అని నరేంద్ర మళ్ళీ పరుగులంకించుకున్నాడు. జగదీష్ నరేంద్ర పరుగెడుతున్న రోడ్డు చివరిదాకా బైనాక్యులర్స్‌లో చూశాడు. సున్నగా పాము కుబుసంలాగ సాగిపోయి ఆకాశం మీదుగా పోతున్న రోడ్డుని కలుస్తోంది.

జగదీష్, ప్రొఫెసర్ ప్రసాద్, సూర్యకుమార్ ఒకరి తర్వాత ఒకరు పరుగెడుతున్న నరేంద్రని గమనిస్తూనే వున్నారు.

ఇంతలో జగదీష్ మెడలో వేలాడుతున్న యఫ్.యమ్. రిసీవర్‌లో వస్తున్న మెష్ ఆగిపోయింది. వెంటనే డాక్టరు సరోజ ఏదో వార్త పంపుతోందని గ్రహించి సెట్‌ని చెవి దగ్గర పెట్టుకున్నాడు.

"హలో...దిస్ ఈజ్ సరోజ ఫ్రమ్ అశ్విని...కెప్టెన్ జగదీష్‌గారూ వింటు

న్నారా? ఓవర్" అని పిలిచింది.

జగదీష్ మైక్రోఫోన్ మీది ట్రాన్స్మీటర్ బటన్ ఒత్తి మైక్రోఫోనులో "ఎస్ జగదీష్ హియర్. రిసీవింగ్, చెప్పండి ఏమిటి విశేషాలు?" అని బటన్ మీదినుంచి వేలు తీసేశాడు.

మళ్ళీ సరోజ గొంతు "ఇప్పుడే భూమి నుంచి వార్త వచ్చింది. అనవసరంగా గ్రహాంతర్భాగాన్ని పరిశీలించుకుంటూ కాలయాపన చెయ్యవద్దని. ఆ గ్రహాన్ని పేల్చెయ్యడానికి తగిన పథకం ముందు ఆలోచించమని అంటున్నారు. నన్నేమైనా మెసేజ్ పంపమంటారా? ఓవర్" అంది.

జగదీష్ మళ్ళీ బటన్ ఒత్తి "వద్దు. నేను వచ్చి మాట్లాడతాను. ఓవర్" అన్నాడు.

"మీరు వచ్చేసరికి ఏ గంటో పడుతుంది. అర్ధగంటలో మెసేజ్ చేరకపోతే కంగారు పడతారేమో...ఓవర్" అంది.

జగదీష్ "ఏం పర్వాలేదు. నిరంతరం వేరే ట్రాన్స్మిటర్ బీట్ ప్రసారం చేస్తూనే వుంది కదా. ఏ కంగారూ పడరు. మరో గంటలో నేను మాట్లాడతానని, మేము గ్రహాన్ని సర్వే చేస్తున్నామని చెప్పండి చాలు. ఓవర్" అని బటన్ని రిలీజ్ చేశాడు.

సరోజ దగ్గర్నుంచి మళ్ళీ ఏమీ సమాధానం రాలేదు.

ప్రొఫెసర్ ప్రసాద్, సూర్యకుమార్ విషయం గ్రహించారు. అయినా వారికి మళ్ళీ వివరించి చెప్పాడు.

అక్కడ పరుగెడుతున్న నరేంద్ర కూడా రిసీవర్లో మెష్ ఆగిపోవడం విని జగదీష్ తనకి ఏదైనా సూచన చెయ్యబోతున్నాడేమో అని చెవికి ఇయర్ఫోన్ను తగిలించుకొన్నాడు. మెసేజ్ తనకి కాదని తెలుసుకున్నా జగదీష్, సరోజల సంభాషణ విని విషయం అర్థంచేసుకున్నాడు. అన్ని వైర్లెస్ సెట్లు ఒకే ఫ్రీక్వెన్సీలో ఆపరేట్ అవడంచేత అందరికీ అన్ని సంగతులు ఏక కాలంలో తెలిసేలాగ ఏర్పాటుచేసుకున్నారు.

జగదీష్వాళ్ళు ఒక ఫర్లాంగుదూరం వెళ్లారో లేదో అప్పుడే దాదాపు నాలుగు ఫర్లాంగుల దూరంలో వున్న నాలుగురోడ్ల కూడలి దగ్గర లాక్ నెంబరు రెండు నుంచి వస్తున్న రోడ్డుని కలుసుకున్నాడు. కుడి వైపు నుంచి వస్తున్న రోడ్డు దూరంగా ఎయిర్ లాక్ రెండు దగ్గరికి పోవడం గమనించాడు. దీనికీ, వాళ్ళు వచ్చిన ఎయిర్ లాక్ ఒకటికీ ఏమీ తేడాలేదు. నాలుగు రోడ్ల కూడలిని విడిచిపెట్టి ఎడమకి తిరిగి సముద్రం వేపు పరుగుసాగించాడు. రెండు ఫర్లాంగులు పరుగెత్తి జగదీష్ వాళ్ల కోసం చూశాడు. తలపైకెత్తితే ఎడమ వేపుగా ఎక్కడో తలకిందులుగా వేలాడుతూ లిల్లిపుట్స్లాగ కనిపిస్తున్నారు. ఈ గ్రహంలో అన్నీ విచిత్రాలే అనుకున్నాడు. బైనాక్యులర్స్ తెచ్చుకోవలసింది. తను కూడా వాళ్లకి తలకిందులుగానే కనిపిస్తున్నాడన్నమాట. అశ్వని నౌకలో మధ్యభాగం మూసెయ్యడంచేత యిది అనుభవంలోకి రాలేదు. ఇక్కడ క్లియర్గా తెలుస్తోంది. ఏవిటో ఈ సెంట్రిఫ్యూగల్ ఫోర్సు అనుకుని ఆశ్చర్యపోయాడు.

వైర్లెస్ సెట్ ట్రాన్స్మిటర్ స్విచ్ నొక్కాడు "హల్లో దిస్ ఈజ్ నరేంద్ర. జగదీష్గారూ వింటున్నారా?" అన్నాడు.

జగదీష్ "ఎస్. రిసీవింగ్...ఏమిటి విశేషాలు?"

"ఏం లేదు. మీరు నాకు తల్లకిందులుగా





కనిపిస్తున్నారు" అన్నాడు.

"అవును. మీరూ మాకు తల్లకిందులుగా కనిపిస్తున్నారు" అని జవాబు చెప్పాడు జగదీష్ నరేంద్ర వేపు తల ఎత్తి చూస్తూ. ఇంకా యిలా సంభాషణ పొడిగించాడు, "మనం ఒకిరి కొకరం నూట యిరవై డిగ్రీల కోణంలో వున్నాం. మరో 60 డిగ్రీలు ఎడమకి జరిగారంటే అసలైన తలకిందులు ఏమిటో తెలుస్తుంది. అది సరే ఈ సంగతి చెప్పడానికేనా, మరే మైనా విశేషాలున్నాయా?" అనిఅడిగాడు.

"ఏమీ లేవు. నేను యిక్కడి నుంచి మిమ్మల్ని బైనాక్యులర్స్‌లో చూడాలని వుంది. తెచ్చుకోలేదు" అని వాపోయాడు నరేంద్ర.

**ఈ సంభాషణ వింటున్న ప్రొఫెసర్ "అతనికంత సరదాగా వుంటే దానిని పోచ్‌బేగ్‌లో పెట్టి విసరండి. మీరు ఒడుపుగా వాలు చూసుకుని విసరగలిగితే అతనికి అందుతుంది"** అన్నాడు.

జగదీష్ "బైనాక్యులర్స్ దెబ్బతింటా యేమో. పోనివ్వండి నౌకలో మరో నాలుగు న్నాయి. అయితే విసురుతాను" అని దానిని బేగ్‌లో పేక్ చేసి బటన్స్ పెట్టేసి ట్రాన్స్‌మిటర్‌లో నరేంద్రతో, "బైనాక్యులర్స్ విసురుతున్నాను. కాస్త అటుయిటూగా మీ దగ్గర పడుతుంది చూసుకోండి" అన్నాడు.

నరేంద్ర వైర్‌లెస్‌లో "ఏమిటి మీ రంటున్నది నాలుగు ఫర్లాంగుల దూరం విసరగలరా? విసిరినా బైనాక్యులర్స్ పగిలిపోవూ." అన్నాడు.

జగదీష్ "మరేం పరవాలేదు. మా వేపు చూడండి. నేను విసురుతున్నాను. ఒక నిముషంలో మీ దరిదాపుల్లో పడు తుంది" అని ఒక ఏంగిల్లో శక్తినంతా ఉపయోగించి పెకె నరేంద్ర దిక్కుగా విసిరాడు.

అది వెళ్ళిన తీరు కూడా విచిత్రం కలిగించింది. మొదట వెగంగా వెళ్ళింది. తరువాత తరవాత వేగం తగ్గిపోయింది. మళ్ళీ వేగం పుంజుకొని నరేంద్ర దిశగా వెళ్ళిపోయింది.

దాని గతిని కాస్త ఆలస్యంగా గెస్ చేసుకోగలిగాడు నరేంధ్ర. ఆ దిశగా పరుగెత్తాడు. మరో పది అడుగుల దూరంలో దానిని మిస్ అయ్యాడు. రోడ్డు పక్కగా అతనికి పదడుగుల దూరంలో పడింది.

గబగబా బేగ్‌లోని బైనాక్యులర్స్ తీసి వాళ్ళని అందులో పరికించాడు. తక్కువ గురుత్వాకర్షణ కావడం చేత బైనాక్యులర్స్‌కి ఏమీ కాలేదు. చేతులు వూపుతూ తల్లకిందులుగా జగదీష్, ప్రసాద్, సూర్యకుమార్ కనిపించారు. వాళ్ళకి చేతులు ఊపి మళ్ళీ పరుగు సాగించాడు.

మరో పావుగంటలో జగదీష్ జట్టు సముద్ర ప్రాంతాన్ని చేరుకున్నారు. సముద్రం గడ్డకట్టివుంది. ప్రొఫెసర్ ప్రసాద్ జేబులోనుంచి ఒక స్క్రూడ్రైవర్ తీసి ఐస్‌ని పెకలించి గ్లోవ్స్ చేతితో ఒక ట్యూబ్‌లో భద్రం చేశాడు. సముద్రపు అవతల ఒడ్డు మరింత క్లియర్‌గా వాళ్ళకి కనిపించింది. దీనిని దాటడం కష్టమే అనుకున్నారు.

కుడివేపు నుంచి రొప్పుతూ నరేంద్ర పరుగెత్తుకుంటూ వచ్చి వాళ్ళని కలుసు కున్నాడు.

సూర్యకుమార్ "ఈమారు పరుగు పందెంలో లూనార్ ఒలింపిక్స్‌లో బంగారు

పతకాలన్నీ మీవేలెండి" అన్నాడు.

నరేంద్ర "ఇంకేం బంగారు పతకాలు లెండి. 2084 ఒలింపిక్స్ ఈ యాత్ర వలన మిస్సయ్యాను. మళ్ళీ 2088 నాటికి ముసలాడినైపోతాను" అన్నాడు.

నలుగురూ సముద్రం ఒడ్డున నడక సాగించారు. వాళ్ళ కాలి బూట్ల గుర్తులు నేల మీద పడసాగాయి. కాళ్ళకి భూమి మీద సముద్ర తీరాన నడుస్తున్నట్లే అనిపించింది.

నరేంద్ర బైనాక్యులర్స్‌తో చుట్టూ కలయజూశాడు. వాళ్ళకి కాస్త ఎడంగా ఒక కట్టడం కనిపించింది. ఎత్తైన స్థంభం దానిపై నుంచి ఒక బ్రిడ్జి లాంటిది సముద్రం మీద వారధిలాగా కట్టబడి వుంది.

"జగదీష్‌గారూ! మనం సముద్రం దాటడానికి శ్రమపడకుండా వాళ్లే బ్రిడ్జి నిర్మించారు'' అన్నాడు. అందరూ అతడు చూపించిన వేపు చూశారు. బ్రిడ్జి కనిపించింది.

జగదీష్ దానిని బైనాక్యులర్స్‌లో చూసి "అబ్బా! దాదాపు రెండు మైళ్లు ఒక్క పిల్లర్ లేకుండా నిర్మించిన ఈ బ్రిడ్జి నిజంగా పెద్ద ఇంజనీరింగ్ ఫీట్ అనే చెప్పాలి" అన్నాడు.

చుట్టూ బైనాక్యులర్స్‌తో కలయజూసి "మరో రెండు కూడా వున్నాయి. మూడు రోడ్లులాగే మూడు బ్రిడ్జిలు. అవతలి ప్రజలు ఇవతలికి, ఇవతలివారు అవతలికిపోవడానికి మార్గాలు. రేపు వచ్చి మళ్ళీ వివరంగా పరిశీలిద్దాం. పదండి. సరోజగారు ఎదురుచూస్తుంటారు" అని రోడ్డు మీద నుంచి లాక్ ఒకటి వేపు బయలుదేరాడు జగదీష్.

తోవలో ప్రతాప్‌ని, ఆక్సిజన్ సెట్స్‌ని తీసుకుని మరో గంటలో అశ్వినిలోకి వెళ్ళిపోయారు. డాక్టర్ సరోజ ఎదురు వచ్చింది.

ప్రొఫెసర్ ప్రసాద్ తాను సేకరించి తెచ్చిన సముద్రపు నీరుగల టెస్ట్‌ట్యూబ్‌ని ఆమెకిచ్చాడు. ఆమె ఒక్క క్షణమైనా ఆలస్యం చెయ్యకుండా మైక్రోస్కోప్‌లో పరిశీలించి ఒక్క సూక్ష్మక్రిమి కూడా లేదని తెలియజేసింది.

* * *

ఆ మరునాడు ఒక ఎలక్ట్రిక్ టూవీలర్ మీద ప్రొఫెసర్ ప్రసాద్, నరేంద్ర గ్రహంలోని భూమిలో ఏవైనా జీవుల అవశేషాలు, లేక ఏవైనా విత్తనాలు కనిపిస్తాయేమోనని వెతకడానికి వెళ్ళారు. ఎలక్ట్రిక్ మోటరు సైకిల్‌తో లోనికి ప్రవేశించారు. నరేంద్ర డ్రైవ్ వేస్తున్నాడు. వెనక సీట్లో ప్రొఫెసర్ కూర్చుని వున్నాడు.

ఇద్దరూ ఎన్నో చోట్ల దిగి రోడ్డుదాటి పక్క నేలని తొలికలతో తవ్వి చూశారు. దాదాపు రెండు గంటలు శ్రమించిన తరవాత ఒకచోట రెండు నల్లని విత్తనాలు దొరికాయి. అవి తామర పిక్కల లాగ వున్నాయి. వాటిని భద్రంగా స్పేస్ సూట్ జేబులో వేసుకున్నాడు.

మళ్ళీ మోటారు స్టార్టుచేసి బీచ్ చేరారు. నరేంద్ర బ్రిడ్జిదాకా తీసుకువెళ్ళాడు.

ప్రసాద్‌తో "బ్రిడ్జి దాటి వెళదామా?" అని అడిగాడు నరేంద్ర.

"వద్దు. కెప్టెన్ అనుమతి లేనిదే బ్రిడ్జి దాటవద్దు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. వెనక్కి పోదాం" అన్నాడు ప్రసాద్.

నరేంద్ర మోటారుని క్రితంరోజు వాళ్ళు సంచరించినచోట బీచ్ ఒడ్డున





ఆపాడు. వాళ్ళు అంతక్రితం రోజున తిరిగినస్థలం ఏదో తెలుసుకోలేకపోయారు. కాళ్ళ బూట్ల జాడలు లేవు. వాళ్లు అక్కడే బిస్కెట్లుతిని కాగితాలు పారేశారు. అవీ లేవు.

నరేంద్ర "ఇక్కడే గదండీ నిన్న మనం కాగితాలు పారేసింది. ఏమైఉంటుం దంటారు" అని ప్రొఫెసర్‌ని అడిగాడు.

"ఏమో...నాకూ అదే అర్థం కావడం లేదు. అడుగుజాడలు కూడా చెరిగి పోయాయి" అని ప్రొఫెసర్ కూడా ఆశ్చ ర్యాన్ని వ్యక్తం చేశాడు. సముద్రం కరిగిన నీటిని మళ్ళీ ట్యూబ్‌లో సేకరిం చాడు ప్రొఫెసర్.

నరేంద్ర మోటార్ స్టార్టు చేశాడు. ప్రసాద్ వెనక కూర్చున్నాడు. వెనక కూర్చుని అటూ ఇటూ ఏవైనా వింతల కోసం చూడసాగాడు.

నాలుగురోడ్ల జంక్షన్ దగ్గర దూరంగా రోడ్డు కిందికి సొరంగ మార్గంలాంటిది కనిపించింది.

వెంటనే ప్రసాద్ "నరేంద్రా, స్టాప్ ది మోటార్" అన్నాడు.

ఇద్దరూ దిగారు. ప్రసాద్ తను చూసిన రోడ్డు కిందుగా పోతున్న మదుంలాంటి టన్నల్‌ని చూపించాడు.

అటువేపు ఇద్దరూ నడిచారు. రోడ్డు కిందికి దిగారు. సొరంగంలాంటి ఆ టన్నల్‌లో చీకటిగా వుంది.

నరేంద్ర "లోనికి దూరి చూద్దామా!" అన్నాడు.

"నో మనం పరిశీలించడానికి వచ్చాం. పరిశోధించడానికి కాదు. మనం చూసిన విషయాలు కెప్టెన్‌కి చెపుదాం. తర్వాత ఇట్ ఈజ్ హిజ్ హెడ్‌ఏక్. మన పని అతను చెప్పినట్లు చెయ్యడమే" అని వెనక్కి తిరిగాడు.

నరేంద్ర అతనిని అనుసరించాడు. ఇద్దరూ రోడ్డు చేరుకున్నారు. నరేంద్ర మోటారుని స్టార్టు చేశాడు. ఇద్దరూ లాక్‌ని చేరుకున్నారు.

"మళ్ళీ ఈ మోటార్‌సైకిల్ నౌక లోనికి ఎందుకు ? ఇక్కడ వదిలేద్దాం. రేపు మళ్ళీ ఎలాగూ రావాలి గదా" అన్నాడు నరేంద్ర.

ప్రొఫెసర్ ప్రసాద్ "యు ఆర్ రైట్. దానికి తాళం వేసే పని కూడా లేదు. ఎవ్వరూ దొంగలు లేరు ఈ విచిత్ర గ్రహంలో. రండి" అన్నాడు నవ్వుతూ.

ఇద్దరూ ఎయిర్‌లాక్స్ దాటి అశ్వని నౌకలోనికి ప్రవేశించారు.

ప్రొఫెసర్ ప్రసాద్ తను జేబులో తెచ్చిన విత్తనాలను, మళ్ళీ సముద్రంలో కాస్త కరిగిన నీటిని డాక్టర్ సరోజకు ఇచ్చాడు.

సరోజ ఆ నీటి బొట్టుని మైక్రో స్కోప్‌లో చూసింది. చిత్రం. అందులో కొన్ని మూడు కాళ్ళ సూక్ష్మక్రిములు ఈదులాడుతూ కనిపించాయి.

ఆమె కెవ్వున అరిచినంత పనిచేసింది. "ప్రొఫెసర్! దేర్ ఈజ్ బాక్టీరియా ఇన్ దిస్" అంది.

గబగబా ఒకరి తరవాత ఒకరు మైక్రో స్కోప్‌లో వాటిని గమనించారు. నీటిలో అవి తమ మూడు కాళ్లను మునగదీసు కుంటూ, సాగదీసుకుంటూ పైకీ, కిందికీ ఈదుతున్నాయి.

జగదీష్ "మీరెప్పుడైనా ఇలాంటి ఆకారంగల క్రిములని చూశారా డాక్టర్!" అని అడిగాడు.

డాక్టర్ సరోజ "నెవ్వర్. దిస్ ఈజ్ ఎ న్యూ స్పెసిమన్ టు మి" అంది.

జగదీష్ "అయితే మన భూమ్మీదనే పొద్దు పొడవడం లేదన్నమాట. ఈ విశాల విశ్వంలో జీవకోటి వుంది" అని తన ఉద్దేశాన్ని తెలియచేశాడు.

డాక్టర్ సరోజ అందరినీ ఉద్దేశించి, "ఈ సందర్భంలో మీకు ఒక సూచన. ఇకమీదనుంచి మీరు గ్రహంలో సంచరించిన తరవాత నేను మిమ్మల్ని పూర్తిగా స్టెరిలైజ్ బాత్ చేయించిగాని లోనికి రానివ్వను. మీ ఆరోగ్యాలు చూడవలసిన బాధ్యత నాది. కొత్త జబ్బులు సంక్రమిస్తే మన దగ్గర మందులు లేవు. మీరు దేనినీ గ్లోవ్స్ లేకుండా ముట్టుకోవద్దు" అని హెచ్చరించింది.

ఆ విత్తనాలను కూడా పరిశీలించి, "ఇవి ఎన్నేళ్ళ క్రితంవో మనం ఇప్పుడే చెప్పలేము. అది భూమి మీది వృక్ష శాస్త్రజ్ఞులు చూసుకుంటారు. కాకపోతే మన భూమి మీద కూడా కొన్ని వేల సంవత్సరాల తరవాత కూడా మొలకలెత్తగల విత్తనాలున్నాయి. ఉదాహరణకు తామర విత్తనాలు రెండువేల సంవత్సరాల తరవాత కూడా నాటి నీరుపోస్తే మొలుస్తాయని నేను చదివాను. కనుక వీటిలో ప్రాణం లేదు అని ఎవ్వరూ చెప్పలేరు" అంది.




ప్రొఫెసర్ ప్రసాద్, నరేంద్ర చూసిన సంగతులు, టన్నెల్ మొదలైన విశేషాలు విని డాక్టర్ సరోజ కూడా వాళ్ళతో వస్తానని బయలుదేరింది.

జగదీష్ భూమినుంచి ఏ సంగతి తెలిసినా ఆ మెసేజ్ గ్రహంలోనికి ప్రసారం చెయ్యమని హనుమాన్‌కి ఆదేశించాడు. మెసేజ్ రాకపోయినా గంట తరవాత మాట్లాడమని చెప్పాడు.

అందరూ గ్రహంలోనికి ప్రవేశించారు. ప్రతాప్ వాళ్ళకి అవసరమైన సామానులు మోస్తూ వెనక బయలుదేరాడు.

లాక్స్ దాటిముందుగా లోనికి వచ్చిన నరేంద్రకు షాక్ తగిలినట్లయింది. నిన్న తాము విడిచిపెట్టి వెళ్ళిన మోటారు సైకిల్ అక్కడలేదు. అటూ ఇటూ పరికించి చూశాడు. కనుచూపుమేర ఎక్కడా దాని దర్శనం కాలేదు.

ఆ విషయాన్ని గుర్తించిన ప్రొఫెసర్ ప్రసాద్ కూడా తన కళ్ళను నమ్మలేక పోయాడు.

నరేంద్ర జగదీష్‌తో "ఇక్కడేనండి నేను దానికి స్టాండు వేసింది. ఎలాగూ మళ్ళీ మనం లోనికి వస్తాం గదా మోటారు సైకిల్ మీదే తిరగడం మంచిది. టైము కలిసివస్తుందని ఇక్కడే వదిలేశాం" అని వివరించాడు.

ప్రొఫెసర్ "అవునండి. లాక్ వెయ్యక పోయినా పరవాలేదు, ఇక్కడికెవరూ దొంగలురారు అని నేను జోక్ కూడా చేశాను" అని ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ చెప్పాడు.

కెప్టెన్ ఆశ్చర్యపోయాడు. డాక్టర్ సరోజ మనస్సు పరిపరి విధాలపోయింది. ఏదో ప్రమాదాన్ని కూడా శంకించింది.

ఆమె "ఉన్న వస్తువు ఉన్నట్లు ఎలాగ మాయమౌతుంది. ఎవరో దానిని కాజేశారన్నమాటే గదా! దీనిని బట్టి ఏవో జీవాలు




ఇంకా వున్నట్టే. మనం లేనప్పుడు ఈ ప్రాంతంలో తిరిగాయి" అంది.

"ఆ సంగతి తెలుస్తూనేవుందిలెండి. అంటే మనం ప్రమాదంలో వున్నామన్న మాటే గదా! ఇదివరకటిలాగ మనం అశ్రద్ధగా తిరగకూడదు. లేసర్ గన్‌ని రెడీగా వుంచుకోండి" అని జగదీష్ అందరినీ హెచ్చరించాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ "సర్, మనం అణుబాంబులని ఈ గ్రహంలోనికి తరలించి దీనిని పేల్చేసే ప్రయత్నాలు ఆరంభిద్దాం. భూమినుంచి కూడా గొడవ చేస్తున్నారు. మనం ఈ గ్రహం నుంచి ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది" అని తన అభిప్రాయాన్ని తెలియజేశాడు.

దానికి సమాధానంగా జగదీష్ "అలాగే చేద్దాం. ఆ ప్రాణిని ముందు స్పాట్ చేసి దాని ఫొటోలు భూమికి పంపించాలి. భూమికి ఈ విషయాన్ని తెలియజేద్దాం. వాళ్ళ అభిప్రాయం మనం సమాచారం పంపిన ఒకగంటలో వచ్చేస్తుంది. అప్పుడు వాళ్ళు చెప్పినట్లు చేద్దాం'' అన్నాడు.

అందరూ జాగ్రత్తగా ముందుకి సాగారు. ప్రతాప్‌ని అక్కడేవుంచి ఏదైనా వింతజంతువు కనిపిస్తే బంధించమని చెప్పి అక్కడే వదిలిపెట్టిపోయారు. అంతా తిరిగి బాగా అలిసిపోయిన తరువాత బీచ్ చేరుకున్నారు. వాళ్ళు తెచ్చుకున్న ఆహారం తిని వాటి పై రేపర్ కాగితాలు పారేశారు. వాటర్ బోటిల్‌ని నేలమీద వుంచి అటూ యిటూ తిరగసాగారు.

జగదీష్ బైనాక్యులర్స్‌లో ఏదైనా వింత జీవి కనిపిస్తుందేమో అని చూడసాగాడు. ఎంత మలినం చేసినా మళ్ళీ శుభ్రం అయిపోతోంది. కాలి గుర్తులు కూడా చెరిగిపోతున్నాయి. నిజంగానే హాస్యానికి అనుకున్నట్లు ఈ జీవులుగాని అదృశ్యరూపులా అనే భయం వాళ్ళకి పట్టుకుంది.

నరేంద్ర తన బైనాక్యులర్స్‌లో దూరంగా ఏదో రోడ్డు మీద వేగంగా దొర్లుకుంటూ రావడం చూశాడు. అందరికీ చెప్పాడు.

అందరూ దానిని చూడసాగారు. అది నిశ్శబ్దంగా వాళ్ళున్న ప్రాంతానికే రాసాగింది. అందరూ లేసర్ గన్స్‌ని పొజిషన్‌లోకి తీసుకుని దానికోసం ఎదురు చూడసాగారు. వాళ్ళవేపే రోడ్డుమీదుగా మరింత వేగంగా రాసాగింది.

జగదీష్ అందరికీ ''మీలో ఎవ్వరూ దానిని కాల్చే ప్రయత్నం చెయ్యకండి. అది మన మీద ఎటాక్ చేస్తే తప్ప ఏమీ చెయ్యవద్దు. దానిని మాత్రం అందరూ పరిశీలించండి'' అని సూచనలు చేశాడు.

అందరూ చూస్తుండగానే అది వాళ్ళు ఇందాక తిని పారేసిన కాగితాల దగ్గరకి వచ్చి ఆగింది. అది ఒక పెట్టెలాగ వుంది. అన్ని వేపుల నుంచీ చేతులలాంటివి బయటికి వచ్చాయి. ఆ కాగితాలను ముక్కలు ముక్కలుగా కత్తిరించాయి. పైభాగాన గల మూత తెరుచుకుంది. ఆ ముక్కలన్నిటినీ అందులో ఆ చేతులు వేసేశాయి. చివరికి ఆ పక్కనేవున్న వాటర్ బోటిల్‌ని కూడా ముక్కలు ముక్కలుగా కత్తిరించి ఆ పెట్టెలో వేసేశాయి.

అది కాన్వాస్ గుడ్డ చుట్టూ కుట్టబడిన ఇనుప బోటిల్. దానిని ఎలాగ ముక్కలు చేసేసిందో జగదీష్‌కి అర్థం కాలేదు.

వచ్చిన తోవనే మళ్ళీ వెళ్ళిపోసాగింది. తోవలో అక్కడక్కడ ఆగి చెత్తా చెదారం పెట్టెలోపల వేసుకుంటూ పోతూనే వుంది.

దానికి కాళ్ళున్నాయో లేక ఏవైనా చక్రాలో ఎవరూ కనిపెట్టలేకపోయారు. నిశ్శబ్దంగా జారిపోతున్నట్లు వెళ్ళిపోయింది. ఎడమకి తిరిగి బ్రిడ్జి మీదుగా పోయింది. మరి కనిపించలేదు.

అందరూ శిలాప్రతిమల్లా కాలాన్ని మరచిపోయి దానినే దృష్టి దాటిపోయే దాకా చూస్తూ వుండిపోయారు.

జగదీష్ ముందుగా స్పృహలోకి వచ్చి "చూశారా! ఇలాంటిదే ఆ మోటారు సైకిలుని ముక్కలు ముక్కలు చేసి పట్టుకుపోయి వుంటుంది. అంత గట్టి స్టీలు బోటిల్‌ని కత్తిరించిందంటే ఆశ్చర్యమే" అన్నాడు.



నరేంద్ర "ఇంతకీ ఇది ఒక ప్రాణి అంటారా. లేక ఈ గ్రహంలోని స్కేవెంజర్ రోబాట్ అంటారా? అది అసలెలా చూడగలుగుతుంది?" అని తన అనుమానాలను బయటపెట్టాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ "ఒక దానిని పట్టుకుని స్టడీ చేస్తే తప్ప మనం అలాంటివి ఊహించి చెప్పలేము" అన్నాడు.

నరేంద్ర "అయితే నేనొకదానిని వలవేసి పట్టేస్తాను" అన్నాడు.

జగదీష్ "తొందరపడవద్దు బాబూ! అదేగనక నిజంగా రోబాట్ అయితే మరి ఇక్కడి మనుషలెంత తెలివైన వారో. ఆ సంగతి ఆలోచించావా?" అన్నాడు.

"తెలుసును. కాని వాతావరణం అనుకూలించక చలికి వాళ్ళు మరణించి ఉండవచ్చును గదా! ఒకవేళ జీవించివుంటే మనల్ని లాక్‌దగ్గరే అటకాయించరా?" అని నమ్మకంగా అన్నాడు నరేంద్ర.

ప్రొఫెసర్ కలుగజేసుకుని "హేతువాదరీత్యా నరేంద్ర చెప్పింది నిజమే

కెప్టెన్! లేకపోతే మనం మూడురోజుల నుంచి వస్తూపోతున్నాంగదా. బతికే వుంటే వాళ్ళు ఏదో చేసేవారేగదా" అన్నాడు.

జగదీష్ "అది సరే కాని నరేంద్రలాగ తొందరపాటు కూడదు" అన్నాడు.

ఆ రొబాట్ కనిపించిన దగ్గర్నుంచీ సూర్యకుమార్, డాక్టర్ సరోజ జట్టు విడిచిపెట్టలేదు. వాళ్ళిద్దరూ మాట్లాడు కుంటూ కలిసే తిరుగుతున్నారు.

అది గమనించిన జగదీష్, ప్రసాద్, నరేంద్ర నవ్వుకున్నారు. భూమినుంచి వచ్చిన ఏకైక జంట. భారతదేశపు స్త్రీ డాక్టరయినా, సైంటిస్టయినా చచ్చిపోయే టప్పుడుకూడా భర్తతో జట్టుగానే చని పోవాలనుకుంటుందేమో అనిపించింది.

ఇంతలో అశ్వని నౌకనుంచి హను మాన్ "హలో దిస్ ఈజ్ హనుమాన్! నో సిగ్నల్ ఫ్రమ్ ఎర్త్ సిన్స్ వన్ హవర్. ఎనీ ఇన్‌స్ట్రక్షన్ బాస్" అన్నాడు వైర్‌లెస్‌లో.

జగదీష్ "థేంక్యూ హనుమాన్! నథింగ్. వుయ్ ఆర్ బేక్ ఇన్ హాఫ్ ఎన్ హవర్" అన్నాడు.

హనుమాన్ తరువాత ఏమీ మాట్లాడ లేదు.

జగదీష్ "ఇంక బయలుదేరండి. ఇక్కడ జరిగిన సంగతులు భూమికి వర్తమానం పంపాలి" అని చెప్పాడు.

అందరూ బయలుదేరబోయారు. ఇంత లోనే సముద్రంమీదినుంచి చల్లని గాలి వీచింది. కెరటాలు తీరాన్ని తాకుతూ హోరు పెట్టసాగాయి. ప్రకృతి సిద్ధమైన శబ్దం. జడపదార్థానికి కదలిక. జీవితానికి నాంది పలికే చైతన్యం. ఆ క్షణం ఆ సాగర తీరం పంచభూతాత్మకమైన భూమిలాగే వాళ్ళకి అనిపించింది.

ప్రొఫెసర్ ప్రసాద్ టెంపరేచర్ చూసి "ఈ మూడు దినాలలోనే టెంప రేచరు బాగా పెరిగింది. సముద్రం మొత్తం నీరయింది. అదుగో చూడండి. ఇదివరకు లేని ఎన్నో దీవులు మధ్యమధ్య కనిపిస్తున్నాయి. ఐసుగడ్డ కరిగి నీటి లెవెల్ తగ్గిపోయింది. ఈ గ్రహంలో ఏవో మార్పులు జరుగుతున్నాయి. ఇది రాను రాను మన సూర్యునికి దగ్గర కావడంచేత గ్రహపు ఉపరితలానికి వేడి తగులుతుంది. అందుచేతనే ఈ మార్పులు వస్తున్నా యనుకుంటాను. మనం దీనిలో మరో రెండేళ్లు గనకవుంటే కొన్ని రకాల నీటి జీవులను చూడవచ్చును" అని దీర్ఘోప న్యాసం అందరూ వినేలాగ ఇచ్చాడు.

వాళ్ళందరూ రోడ్డుమీద ఎవరిమానాన వాళ్లు మాట్లాడుకుంటూ వస్తున్నారు. ఎదు రుగా లాక్ కనిపిస్తూంది. వందగజాల దూరంలో మరమనిషి ప్రతాప్‌కోసం ముందుగా చూసింది నరేంద్ర. అప్పటికే అంతా అయిపోయింది.

ప్రతాప్‌ని డిసెక్టు చేసేసి ఒకో ముక్కని తన తొట్టెలో వేసేసుకుం టోంది ఒక స్కేవెంజర్ రొబాట్.

నరేంద్ర ఉద్వేగాన్ని ఆపుకోలేక పోయాడు. చెపితే దగ్గరికి వెళ్ళడానికి జగదీష్ ఒప్పుకోడు. అందుకే దాని దగ్గరకు పరిగెత్తాడు.

దానికి ఆరడుగుల దూరంలో నుంచు న్నాడు. దగ్గర నుంచి పరిశీలించాడు. అప్పటికే అన్ని ముక్కలూ లోనవేసేసు కుంది.

నరేంద్ర మరో రెండడుగులు ముందుకి వేసేడు. అది రెండడుగులు వెనక్కి




జరిగింది. మరో మూడడుగులు బెదిరి స్తున్నట్లు ముందుకి వేశాడు.

ఇదంతా దూరం నుంచి అప్పుడే జగదీష్, మిగిలినవాళ్ళూ చూడసాగారు. వారించడానికి కూడా టైమ్ లేకపోయింది. చూస్తూ వుండిపోయారు.

నరేంద్ర ఎంత ముందుకి వెళితే అదంత వెనక్కి జరగసాగింది. ఎంత వేగంగా వెళితే అంత వేగంగా వెనక్కి పోతోంది. పూర్తి వేగంతో దాని వెంట పడ్డాడు. తరవాత నరేంద్ర, అందరూ చూస్తుండగానే వాయువేగ మనోవేగాలతో పరుగెత్తిపోయింది. నరేంద్ర అలిసి పోయి వెనక్కి వచ్చి వాళ్ళని కలుసు కున్నాడు.

జగదీష్ గబగబా ఎదురువెళ్ళి "నువ్వు చాలా ధైర్యం చేశావు. నీకేమైనా జరిగితే" అని భయాన్ని వ్యక్తం చేశాడు.

నరేంద్ర ప్రతాప్‌ని తలచుకుని "ఏమౌతుంది సర్. చూడండి మన ప్రియతమ మరమనిషి నమ్మినబంటు లాంటి ప్రతాప్‌ని ఏమి చేసిందో! దొరికితే దానిని ముక్కలు ముక్కలు చేసేవాణ్ణి. అదేం చేస్తుండండి, రొబాట్ గదా" అన్నాడు రొప్పుతూ.

ప్రొఫెసర్ ప్రసాద్ "అది జీవకణాలున్న ఏ జీవినీ ఏమీ చెయ్యదు. మనం దానిని పట్టుకోలేము. దానిని రూపొందించిన సృష్టికర్తలు దానిని అస్పృశ్యాలినిగానే ప్రోగ్రామ్ చేసి రూపొందించారు. దానిని నువ్వు తన్నినా నీ కాలికి అందకుండా పరుగెడుతుంది తప్ప ఏమీ చెయ్యదు. అది స్కేవెంజర్ రొబాట్. దానిని సృష్టించిన వాళ్లు నశించినా అది దాని ధర్మాన్ని నిర్వర్తిస్తూనే వుంది. పదండి" అని లాక్ వేపు దారితీశాడు ప్రొఫెసర్.

జగదీష్ ప్రతాప్ పోయినందుకు మనిషి మరణించినంత బాధపడ్డాడు. అతని కళ్ళలో నీరూరడం అందరూ చూశారు.

అది చూసిన డాక్టర్ సరోజ కళ్ళు నిజంగానే వర్షించాయి. కళ్లు తుడుచుకుని "ఆనాడు శూన్యంలో తప్పిపోయి నప్పుడైనా ఊరుకున్నాంకాదు. ముక్కలు ముక్కలుగానరికేసింది. పాపిష్టి రోబాట్" అని ఎంతో విసవిసలాడింది.

సూర్యకుమార్ "టేకిట్ ఈజీ సర్! జరిగిన దానికి ఎవ్వరమూ బాధ్యులము కాము. ఇందులో మీ అశ్రద్ధ ఏమీలేదు. బాధపడకండి" అని ఓదార్చాడు.

ప్రసాద్ జగదీష్ బాధపడడం చూసి ఆశ్చర్యపోయాడు. 'మోటారు సైకిలుకి, ప్రతాప్‌కి ఏమిటో తేడా? రెండూ యంత్రాలే. మరి మోటారు సైకిలుని ముక్కలు ముక్కలు చేస్తే బాధపడలేదేం? ప్రతాప్ పోతే ఎందుకు బాధపడ్డాడు' అను కున్నాడు.

బరువైన హృదయాలతో అందరూ గ్రహం బయటికి వెళ్లి తరవాత అశ్వనిలో ప్రవేశించారు. హనుమాన్ అందరినీ ఆహ్వానిస్తూ "వెల్‌కమ్... వెల్‌కమ్!", అన్నాడు.

జగదీష్ ట్రాన్స్‌మిటర్ ఆన్‌చేశాడు. భూమికి వరుసగా జరిగినదంతా చెప్పాడు. విచిత్ర గ్రహంలోని రొబాట్ ప్రతాప్‌ని ఎలాగ నాశనం చేసింది తెలియజేసే టప్పుడు అతని కంఠం వొణికింది.

అది చూసిన అందరికీ రొబాట్ పోతేనే అంత బాధపడుతున్న జగదీష్ మనిషికి ఏమైనా జరిగితే జీవించగలడా

అనుకున్నారు. నరేంద్ర 'ఇకమీద తను జాగ్రత్తగా వుండాలి. దుడుకుపనులు చెయ్యగూడదు. కెప్టెన్ అనుమతిలేనిది ఏ పనీ చెయ్యకూడదు' అనే నిర్ణయానికి వచ్చాడు.

జగదీష్ ట్రాన్స్‌మీటర్‌లో చివరి పలుకులుగా "ఆ రొబాట్‌ని బంధించి, దానిని పరిశోధించి అది ఏ శక్తితో పనిచేస్తుందో తెలుసుకునేదాకా నిద్రపోను. తరువాత మీకు మళ్ళీ తెలియజేస్తాను. మరోగంటలో మళ్ళీ గ్రహంలోనికి బయలుదేరుతున్నాం. ఓవర్" అని ట్రాన్స్‌మిటర్ ఆఫ్ చేసేశాడు.




మరో గంటలో విచిత్రగ్రహంలోకి వెళ్ళబోతున్నాం అని భూమికి తెలియజేసినా గంటకూడా అతను విశ్రాంతి తీసుకోలేదు. మేనువాల్చినా అతని మెదడు ఆ మరమనిషిని ఎలాగపట్టాలి అనే ఆలోచిస్తోంది. ఒక రొబాట్‌ని పట్టుకుని అది ఎలాగ పనిచేస్తుందో పరిశోధించాలి. ఏదైనా సౌరఘటాలతో పని చేస్తుందా లేక మరేదైనా శక్తా? ఇక్కడి నాగరికత నశించి కొన్ని శతాబ్దాలైనా అయివుంటుంది. అయినా ఈ మరమనుషులు సక్రమంగా తమతమ పనులు నిర్వహిస్తున్నాయి అంటే మాటలా! ఒకవేళ ఈ విచిత్రగహాన్ని ధ్వంసం చెయ్యవలసి వచ్చినా ఒక రొబాట్‌ని మాత్రం భూమికి తీసుకుపోవాలి. ఏ శక్తితో పనిచేస్తుందో ఎనలైజ్ చేసి భూమిమీది శాస్త్రజ్ఞులు తయారుచేస్తారు. ఒకో గ్రామపంచాయితీకి ఒకటి యిచ్చేస్తే ఊళ్ళని పరిశుభ్రంగా వుంచుతాయి.

కనుక్కొని తీరవలసిందే అనుకుని లేచాడు. నరేంద్ర, సూర్యకుమార్‌లతో "మనం వెళ్ళి ఒక రొబాట్‌ని బంధించాలి. నాతో వస్తున్నారా?" అనడిగాడు.

నరేంద్ర లేచినుంచుని "అయామ్ రెడీ!" అన్నాడు.

సూర్యకుమార్ "నేను కూడా సిద్ధమే. కాని అంత అవసరమేమిటి. కాస్త ఆగి భూమి నుంచి రాబోతున్న సందేశం విని వారి సూచనలు కూడా పాటించడం మంచిదికదా" అని తన అభిప్రాయం చెప్పాడు. లేచి నుంచున్నాడు.

ప్రొఫెసర్ ప్రసాద్, డాక్టర్ సరోజ కూడా సూర్యకుమార్ అభిప్రాయాన్ని సమర్థించారు.

మెజారిటీ అభిప్రాయానికి అనుగుణంగా "సరే అలాగే చేద్దాం" అని తను తయారవుతున్న ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

అందరూ వాళ్ళ వాళ్ళ మంచాలమీద విశ్రమించారు. ఎవరి ఆలోచనలలో వాళ్లు ఉన్నారు.

ప్రొఫెసర్ కళ్ళు ఎప్పుడు మూసుకున్నా భూమే ప్రత్యక్షమవుతోంది కళ్లలో. అతని ఆలోచనలలో ఎప్పుడూ హైదరాబాద్ వీధులన్నిటిలోనూ సంచరిస్తుంటాడు.తనతో సుశీలకూడాతిరుగుతూ ఉంటుంది.

సూర్యకుమార్, సరోజలకు ఆ చింత




లేదు. అశ్వని నౌకలోని కంట్రోలు రూములో వాళ్ళకోసం నిర్మించిన ఎపార్ట్ మెంటులో కింగ్ సైజ్ డబుల్‌కాట్ వుంది. వాళ్ళు తలంచుకోగానే నిద్రాదేవత కరుణిస్తుంది. వాళ్ళు ఒకవేళ ప్రసాద్‌లాగే విహరించినా కలల్లోనేగాని ఊహల్లో మాత్రంకాదు.

నరేంద్రది ఒకరకమైన తత్వం. సమయాన్నిబట్టి చెయ్యవలసింది మీనమేషాలు లెక్కపెట్టకుండా చేసెయ్యటం. అంతే! జరిగినదానిని గురించి ఆలోచించి బుర్ర పాడుచేసుకోవడం వుండదు. ఎప్పుడంటే అప్పుడు మైండ్‌ని స్విచ్ ఆఫ్ చేసుకోగలడు. లైట్‌ని ఆఫ్‌చేసి నిద్రపోయినట్లు నిశ్చింతగా నిద్రపోగలడు.

ఇంచుమించు కెప్టెన్ జగదీష్ మనస్తత్వం కూడా నరేంద్ర లాంటిదే! కాకపోతే బాధ్యత అతని నెత్తిమీద కూర్చుంది. అతను ఆలోచించక తప్పడం లేదు. ప్రతాప్ కూర్చునే కుర్చీ ఖాళీగావుంది. అది చూస్తే అతని మనస్సు వెలితిగా వుంది. ఆ ఖాళీని ఈ విచిత్ర గ్రహపు మరమనిషితో భర్తీచేసి తీరుతాను అనుకుని సంతృప్తిపడ్డాడు.

ఇలా ఎవరి ఆలోచనలో వాళ్ళుండగానే భూమినుంచి సందేశం వచ్చే ముందు వచ్చే సిగ్నల్ మోగింది. జగదీష్ లేచివెళ్ళి వైర్‌లెస్ ఆపరేటర్ సీటులో కూర్చుని ఇయర్‌ఫోన్లు తగిలించుకున్నాడు.

"హల్లో దిస్ ఈజ్ స్పేస్‌స్టేషన్ హైదరాబాద్. కెప్టెన్ జగదీష్‌గారూ! మీకొక అర్జంటు వార్త. రష్యా, అమెరికా మీరు విచిత్రగ్రహం మీద దిగి సర్వే చెయ్యడంగుర్తించారు. వాళ్ళు మన సంకేతాలని డిసైఫర్ చేసి గ్రహించినట్లున్నారు. మీరు ఆ గ్రహం మీద దిగారనీ, దానిమీద బాంబులని అమర్చి పేల్చేసే ప్రయత్నంలోనే వున్నారని మన విదేశ వ్యవహారాల మంత్రిత్వ శాఖ తెలియజేస్తోంది. అయినా వాళ్ళకి ఏదో అనుమానం. ఈ దెబ్బతో ప్రపంచంలోని అగ్రదేశంగా భారతదేశానికి గుర్తింపు వస్తుందనుకుంటున్నారు. మీరు ఏం చేస్తున్నారనేది రహస్యంగానే వుంచాం. అయినా మన రాజకీయనాయకులు మిమ్మల్ని వెంటనే ఆ పని పూర్తిచేసుకుని వచ్చేలాగ ఆదేశం పంపమని రోదసీ సంస్థ మీద వత్తిడితెస్తున్నారు. అందుచేత మీరు వెంటనే ఆ విచిత్రగ్రహాన్ని అణుబాంబులతో దగ్ధం చెయ్యండి. హైదరాబాద్ రోదసీ కేంద్రం. ఓవర్" అని సందేశం ఆగిపోయింది.

భూమినించి ఎప్పుడు వార్తవచ్చినా దూరదేశం నుంచి కన్నతల్లి రాసిన ఉత్తరం చదువుతుంటే వింటున్నంత శ్రద్ధగా అందరూ వినడం మామూలే. రికార్డయిన ఆ సందేశాన్ని వేసుకుని మరీ మరీ విన్నారు.

జగదీష్ "మీ ఉద్దేశం చెప్పండి. ఏం చేద్దాం? ఈ రాజకీయాలు చూడండి. దీనికి ఎలాంటి రంగుపూస్తున్నారో. గతంలో వాళ్ళు చేసినవి మరిచిపోయారు. పోటీలుపడి ఒక దేశం మనుషుల్ని పంపి చంద్రుని మట్టి తెప్పిస్తే, మరొక దేశం రిమోట్ ఆపరేషన్‌తో మట్టి తెప్పించి పోటీలుపడ్డారు. అన్నీ తామే కనిపెట్టెయ్యాలనే దాహం. ఇతర దేశాల ఆధిక్యత సహించలేని సంకుచిత భావాలు. మానవుడు ఎంత ప్రగతి సాధించినా ఈ ప్రలోభాల నుంచి బయట పడలేక పోతున్నాడు. చెప్పండి ఏం చెయ్యాలి?" అన్నాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ "రాత్రి నా

ఆలోచనలలో ఒక ఊహ తళుక్కున మెరిసింది. డాక్టర్ శివరామకృష్ణ తెలుసు కదూ! అతని ఊహ ప్రకారం అంతర్ నక్షత్రయానం చెయ్యడానికి గల అవకాశాలను తన థీసెస్‌లో వివరించాడు. దానిలో డాక్టర్ శివరామకృష్ణగారు వివరించిన 'స్వయం సమృద్ధి వ్యోమ నౌక'ని వర్ణించాడు. అది మన విచిత్ర గ్రహాన్ని పోలివుందని నాకు రాత్రి అనిపించింది. నిజంగా ఈ వివరాలని మనం భూమికితెలియజేస్తే అది రష్యా, అమెరికా వంటే మనదేశంమీద ఇంకా ప్రెషర్‌తెస్తారు. మనవాళ్లు దానికి వెంటనే ఒప్పుకొనకపోతే వాళ్లు దీనిని మనతో పాటు పేల్చేసే ప్రయత్నాలు కూడా చెయ్యవచ్చును. అందుచేత గ్రహం మీది మన పని త్వరగా పూర్తిచేసి దీనిని పేల్చెయ్యడం మంచిది" అన్నాడు.

సరేంద్ర "మన భారతదేశపు పేరు ప్రతిష్టలు దీనితో నిజంగా ముడిపడి వుంటే, వాళ్ళకి భయపడి త్వరగా దీనిని నాశనం చెయ్యకూడదు. దాని వలన మన దేశపు ప్రతిష్ట దెబ్బతింటుంది. ఈ గ్రహాంతర భాగాన్ని పూర్తిగా సర్వే చెయ్యాలి. ఈ రోబాట్లు ఏమిటో తెల్సుకోవాలి. ఇంత విజ్ఞానాన్ని నాశనం చెయ్యడమా? చేతనైతే వాళ్ళ సహకారాన్ని కూడా పొంది దీనిలో వున్న విజ్ఞానాన్ని పూర్తిగా తెలుసుకుని ప్రపంచానికి ఉపయోగించాలి. మన శివరామకృష్ణగారి సిద్ధాంతానికి మంచి ప్రచారం తీసుకు రావాలి.కానిదీనిని నాశనం చెయ్యకూడదు" అన్నాడు.

నరేంద్ర నిర్ణయంలోని చిత్తశుద్ధిని, అతనిలోని స్థిరనిశ్చయాన్ని గమనించిన సూర్యకుమార్‌లో కూడా ఉద్వేగం పెల్లుబికింది. "ప్రసాద్‌గారు చెప్పింది అక్షరాల నిజం. విజ్ఞానం ఎక్కడున్నా తెలుసుకోవాలి. ఈ గ్రహం మీద మన శాస్త్రజ్ఞులకు తెలియని ఎన్నో విషయాలున్నాయి. మన శాస్త్రజ్ఞులు ఊహించనైనా లేని యింత పెద్ద గ్రహాన్ని కృత్రిమ వాతావరణం, సదుపాయాలతో నిర్మించి రోదసిలోనికి ప్రవేశపెట్టిన నాగరికులు విశ్వంలో వున్నారు అని తెలిసి వుండి కూడా దానిని గురించి పూర్తిగా తెలుసుకోకుండా నాశనం చెయ్యాలనుకోవడం మూర్ఖత్వం. దీనిని పూర్తిగా పరిశోధించి నేను ఒక పుస్తకం రాయాలని ఎప్పుడో నిర్ణయించుకున్నాను: నేను మాత్రం దీని నాశనానికి ఒప్పుకోను" అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు.

డాక్టర్ సరోజ కూడా భర్త అభిప్రాయానికి వంత పలుకుతూ "నేను ఈ సముద్ర జలంలో కొత్తరకం క్రిమిని చూశాను. దీనిలో మళ్ళీ జీవులు ఉద్భవించే సూచనలు కనిపిస్తున్నాయి.వృక్షజాతి కూడా బయలుదేరుతుంది.దాని ఆధారాలుగా మనకి విత్తనాలు కనిపించాయి. ఇంకా ఎన్ని వింతలున్నాయో? ఇటువంటి విచిత్ర గ్రహాన్ని నాశనం చెయ్యడం అన్యాయం. ఇది భూమిని గుద్దుకోవడం ఖాయం అనే పరిస్థితుల్లో తప్ప అణుబాంబుల్ని వుపయోగించడం నాకు సుతరామూ యిష్టం లేదు" అంది.

అంతే; కెప్టన్ జగదీష్‌కి కొండంత ధైర్యం వచ్చింది "మనమే కాదు. ఈ గ్రహం లోనికి ఒక్కసారి ప్రవేశిస్తే ఎవ్వరూ దీని అందాన్ని చూసిన తరవాత నాశనం చెయ్యాలి అనే ఊహ రాగానే చెంపలు వాయించుకుంటారు. మనం




భూమి మీది రాజకీయనాయకుల సంకుచిత భావాలకు దీనిని బలిచెయ్యవద్దు. అంతకన్నా దేశ దేశాల శాస్త్రజ్ఞులను, మేధావులను సమావేశపరిచి ఈ గ్రహం లోని విశేషాలను ఆ సమావేశంలో వెల్ల డించమందాము. వాళ్ళ అభిప్రాయాలను గౌరవిద్దాము. నా ఉద్దేశం ప్రకారం ఎవ్వరూ గ్రహాన్ని పేల్చెయ్యమని అనరు. ఈ విధంగా దేశదేశాల శతృత్వం నుంచి కూడా మనం బయటపడవచ్చును.

"మరొక సంగతి. వాళ్ళంతా సహ కరించాలే గాని ఈ విచిత్ర గ్రహాన్ని మనం మన భూమి కక్ష్యలో ఉపగ్రహంగా ప్రవేశపెట్టడం అంత కష్టమేమీ కాదు. అలాగైనట్లయితే మరో దశాబ్దంపాటు మన శాస్త్రజ్ఞులకు చేతినిండా పని. దీని రహస్యాలు వాళ్ళు సులువుగా ఛేదించ గలుగుతారు.

"అంతకీ వాళ్ళు ఎదురుతిరిగితే 'మేం దీన్ని నాశనం చెయ్యలేము. మీకు తోచింది మీరు చేసుకోండి. మామానాన మేము అశ్వనిలో ఎగిరిపోతాం. ఇది భూమిని గుద్దేస్తే దానికి మేము బాధ్యులం కాము. అందుకే మీరు సహకరించండి' అని అల్టిమేటమ్ యిద్దాం" అన్నాడు.

అందరికీ జగదీష్ నిర్ణయం నచ్చింది.

జగదీష్ ప్రసార యంత్రం ఆన్ చేశాడు.

"దిస్ ఈజ్ కేప్టెన్ జగదీష్ స్పీకింగ్! హైదరాబాదు రోదసీ కేంద్రం అధికారులకు నా విన్నపం. మీ వార్త యిప్పుడే అందింది. విచిత్ర గ్రహాన్ని సర్వే చేయకుండానే దానిని బాంబులతో వెంటనే పేల్చెయ్యమన్నారు. మనిషి ఎవ్వడైనా సరే మంచీ చెడూ నిర్ణయించు కోకుండా అలాగ చెయ్యలేడు. ఈ గ్రహంలో మనకు తెలియని ఎన్నో విశేషాలుఉన్నాయి. మనకుతెలియనివెన్నో భౌతిక రసాయనిక శాస్త్రాల సూత్రాలతో ఈ గ్రహం నిండి వుంది. దానిని పరిశీ లించి పరిశోధించడం మన కర్తవ్యం. ఒక కొత్త బాక్టీరియాని డాక్టర్ సరోజ గారు గుర్తించారు. 'విశ్వంలో భూమి మీదనే కాదు యితర లోకాలలో కూడా జీవకోటి వుంది' అని నిరూపించడానికి ఈ గ్రహం ఒక ఆధారం. దీనిని మేము అంత తేలికగా నాశనం చెయ్యలేము. ఈ గ్రహం భూమిని చేరడానికి కనీసం యింకా రెండేళ్ళయినా పడుతుంది. ఎందు కంత భయం. భయపడవలసింది మేము. ఈ విషయాన్ని ప్రపంచ దేశాలకు తెలియచెయ్యండి. మళ్ళీ మేము గ్రహం లోనికి బయలుదేరుతున్నాం. వచ్చిన తరవాత విశేషాలు తెలియజేస్తాను. ఓవర్" అని ప్రసార యంత్రాన్ని ఆపుజేశాడు.



8

కెప్టెన్ జగదీష్, ఇంజనీరు సూర్య కుమార్, నరేంద్ర గ్రహంలో ప్రవేశిం చారు. ఎలాగైనా ఆ తుడిచే రొబాట్‌ని పట్టాలని పథకం వేశారు. పొడవైన తాడొకటితీసుకున్నారు. అది వాళ్ళనిచూసి పలాయనం సాగిస్తుందని వాళ్ళకి తెలిసి పోయింది. ఇద్దరు ఆ తాడుని రోడ్డుకి

అడ్డంగా సాగదీసి పట్టుకుని ఆ దిశగా మరొకరు దానిని తరమాలని ప్లానువేశారు. తాడు దానిని అడ్డుతుంది. గబగబా ఆ తాడుని దానికి చుట్టి ముడివేసి తాడుతో లాక్కుపోవాలని ఆలోచించారు.

వాళ్ళు చదువుకోవడానికి తెచ్చుకున్న పాత పుస్తకాలను పట్టుకువచ్చారు. చినిగిన వాటిని మరింత చించి ఆ చిత్తు కాగితాలను రోడ్డుమీద చల్లారు. పక్కనే మాటు వేసి రొబాట్ రాక కోసం ఎదురు చూడసాగారు. వేసిన పది నిమిషాలలోనే ఒక గుండ్రని పెట్టెలాంటిది రోడ్డు మీద నుంచి వస్తూ కనిపించింది. వాటికి సమాచారం ఎలాగ తెలుస్తుందో అని ఆశ్చర్యపోయారు.

కెప్టెన్ జగదీష్, సూర్యకుమార్ రోడ్డు రెండు వేపులా తాడుని బిగదీసి పట్టుకుని నుంచున్నారు. నరేంద్ర రోడ్డు పక్కన నక్కి కూర్చున్నాడు. వాయు వేగంతో ఆ రొబాట్ పనిమనిషి వచ్చేసింది. తన పని మొదలుపెట్టింది. కాగితాలన్నిటినీ మరింత చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి తన తొట్టిలో వేసుకో



సాగింది. ఇంతలో మెల్లగా నరేంద్ర రొబాట్ కి యివతలగా రోడ్డు మీదకు వచ్చాడు. రొబాట్ కదలలేదు మెదల లేదు. తన పని గబగబా చేసుకోసాగింది. మెల్లమెల్లగా దానిని సమీపించాడు. పక్కలనుంచి ఏవో పనిముట్లు గబగబా కరకర శబ్దం చేస్తూ పని చేసుకు

చేశాయి. అది గబగబా స్కేటింగ ఏక పర్ట్ లాగా జారిపోయింది.

జగదీష్ "దీన్ని యిలాగ పట్టు



పోతున్నాయి. మరింత దగ్గరగా వెళ్ళాడు. ఎప్పుడైతే రెండడుగుల దగ్గరకి వెళ్ళాడో అది వెనక్కి జరిగింది: గబగబా ముందుకి నడిచాడు. రొబాట్ తాడు దగ్గరకి వెళ్ళింది. తాడు దానికి తగిలీ తగలగానే ఏవో కట్టర్స్ దానిని టక్‌మని కత్తిరిం

అసాధ్యంలాగుంది. దీనిని పాడు చెయ్యకుండా పట్టలేం అనుకుంటాను. వికలాంగుని చేసెయ్యాలి లాగుంది" అన్నాడు.

నరేంద్ర "అలాగేచేద్దాం. కొంతసమాచారం తెలుస్తుంది. తర్వాత ఏదో మంచి పథకంవేసి ఒక మంచి దానిని నిదానంగా పట్టుకోవచ్చును. ఈ గ్రహంనిండా బోలెడు రొబాట్లున్నాయి" అని జగదీష్ అభిప్రాయాన్ని బలపరిచాడు.

వీళ్లు అలాగ మాట్లాడుకుంటుండగానే ఇందాకటి గుండ్రనిపెట్టె రొబాట్ మిగిలిన పని పూర్తిచేసుకోవడానికి మళ్ళీ వెనక్కి వచ్చింది. పక్కనే వాళ్లున్నా పట్టించుకోనే లేదు. చకచకా మిల్లులాగ శబ్దంచేస్తూ మిగిలిపోయిన కాగితాలను కత్తిరించుకుంటూ తొట్టెలో వేసుకోసాగింది.

జగదీష్ దాని దగ్గరికి వెస్తుపోతూ "దీని దుంపతెగ. అసలు భయమే లేనట్లుంది" అన్నాడు.

వాళ్ళకికూడా ధైర్యం వచ్చింది. ప్రొఫెసర్ చెప్పింది నిజం. జీవుల్ని ఇది ఏమీ చెయ్యదు అనుకున్నారు. సౌంజ్ఞలు చేసుకుని మూడువేపుల నుంచీ దానిని సమీపించసాగారు. దానికి ఏమి సెన్సర్స్ ఉన్నాయోఏమో ఎటు ఖాళీ కనపడితే అటు తప్పించుకోబోయింది.

ఆ విధంగానే అది వాళ్ళు ఎంత ప్రయత్నించినా దొరకకుండా పారిపోయింది.

ఆరడుగులదూరంనుంచే అది వాళ్ళను పసికడుతుందనీ, దానికి ముందూ వెనకా అనేదిలేదనీ, అన్నివేపులా చూడగలుగుతుందనీ మాత్రం గ్రహించారు.

కెప్టెన్ "దీనిని పట్టడంగాని, పడగొట్టడంగాని మనవల్లగాదు. దీనికి మందు మన హనుమాన్ మాత్రమే. హనుమాన్ మరమనిషి. జీవికాదు. హనుమాన్‌ని చెత్త కింద జమకట్టి దగ్గరకి వస్తుంది. హనుమాన్ అప్పుడు దానిని ఏదయినా చెయ్యాలి" అన్నాడు.

అందరూ సరేనన్నారు.

జగదీష్ వైర్‌లెస్ సెట్‌లో "హలో ప్రొఫెసర్ ప్రసాద్‌గారూ. ఇక్కడ హనుమాన్ అవసరం పడింది. హనుమాన్‌ని వెంటబెట్టుకుని ఒక సమ్మెటనీ, కొన్ని పాత పుస్తకాలు కూడా ఒకసంచిలో వేసుకునిరండి. వెంటనే అర్జంటుగారావాలి. ఓవర్" అన్నాడు.

ప్రొఫెసర్ గొంతు రిసీవర్‌లో "అలాగే! పది నిముషాలలో వస్తున్నాం" అని సమాధానం చెప్పాడు. రిసీవర్ నిశ్శబ్దంగా వుండిపోయింది.

ముగ్గురూ కూర్చుని హనుమాన్ రాక కోసం ఎదురు చూడసాగారు. పది నిముషాలలో ముందు ప్రొఫెసర్ ప్రసాద్, వెనకహనుమాన్ లాక్సదాటి వాళ్ళని సమీపించారు.

హనుమాన్ చేతిలో పుస్తకాలు, సమ్మెట వున్నసంచి వుంది.

జగదీష్‌కి నిజానికి హనుమాన్‌ని విచిత్ర గ్రహంలోనికి తీసుకురావడం ఇష్టంలేదు. ప్రతాప్‌కి జరిగినది ఎప్పుడూ జ్ఞాపకం వచ్చి అతనిని కలవరపరుస్తూనే ఉంటుంది. అయినా రొబాట్‌ని పట్టే ఉద్దేశంతో ఈ పని చెయ్యకతప్పలేదు.

ప్రసాద్, హనుమాన్ దగ్గరకు రాగానే జగదీష్ హనుమాన్‌ని సమీపించి "హనుమాన్!" అని పిలిచాడు.

"ఎస్ బాస్! వాట్ కెన్ ఐ డూ" అన్నాడు.

జగదీష్ హనుమాన్‌కి చెయ్యవలసిన పనిచెప్పాడు. మళ్ళీ కాగితాలు చించి పోగులు పెట్టారు. వాళ్ళు నలుగురూ





రోడ్డు పక్కకి తప్పుకున్నారు. దూరంగా ఒక పని మరమనిషి ప్రత్యక్షం! గబగబా రోడ్డుమీద జారుకుంటూ కాగితాల కుప్ప దగ్గరికి వచ్చేసింది. ఇది గుండ్రంగా లేదు. నలుపలకలుగా వుంది. దానిని నలుగురూ గమనిస్తున్నారు.

హనుమాన్‌ని కూడా గమనించారు. హనుమాన్ తన టెలివిజన్ కెమేరాకళ్ళతో తీక్షణంగా రొబాట్ రావడం గమనిస్తున్నాడు. అప్పటికే రెండు చేతులతో సమ్మెటని పైకి లేపిపొజిషన్‌లో పట్టుకున్నాడు.

మరమనిషి రోడ్డు మీది కాగితాలు అన్నిటినీ ఏరుకుంది. మెల్లగా హనుమాన్ దగ్గరకి రాసాగింది. దానికి మెటల్‌ని కత్తిరించడానికి వేరే కట్టర్ వుంది. హనుమాన్ మెటల్ అని గ్రహించేసింది. ఆరు మిల్లీమీటర్ల మందంగల ఇనప రాడ్‌ని కూడా కత్తిరించగల కట్టర్ పలకల పెట్టె కింది నుంచి బయటికి వచ్చింది. హనుమాన్ కాళ్ళని కత్తిరించడానికి రెడీగా తెరిచి పెట్టుకుని మెల్లగా సమీపించ సాగింది.

జగదీష్, ప్రసాద్, నరేంద్ర, సూర్యకుమార్ ఎంతో సస్పెన్సుతో చూస్తున్నారు. ఒక్క క్షణంలో హనుమాన్ కాలు కత్తిరించేసేదే! అదే క్షణంలో ఒక సమ్మెట దెబ్బ దాని మీద పడింది. ఒక్క ఎగురు ఎగిరింది. మళ్ళీ కింద పడింది. ఈలోగా మరో రెండు దెబ్బలు వేశాడు హనుమాన్. పెట్టె పక్కకి పడిపోయింది. నాలుగో దెబ్బ పక్క మీద కూడావేశాడు. కొన్ని కట్టర్లు, కత్తెరల లాంటివి కింది నుంచి బయటికి వచ్చి గిజగిజలాడసాగాయి. తరువాత నిశ్చలంగా ఉండిపోయింది.

వ్యోమగాములు నలుగురూ దగ్గరకు వెళ్ళారు. హనుమాన్ మరో దెబ్బ వేసేవాడే. జగదీష్ సంజ్ఞ చెయ్యగానే ఊరుకున్నాడు.

జగదీష్ దగ్గరగా వచ్చి రొబాట్‌ని పరిశీలించాడు. కింద చుట్టూ చక్రాల లాంటివి అరలలో దూరి వున్నాయి. వాటి మీదే అవి దొర్లుతున్నాయని అందరూ గ్రహించారు.

"దీనిని పరిశోధించడానికి అశ్వని నౌకలోనికి తీసుకుపోవాలి" అన్నాడు కెప్టెన్.

ప్రొఫెసర్ ప్రసాద్ "మొత్తం ఎందుకండి. ఒక చిన్న ముక్కని డిసెక్టు చేసి తీసుకుపోదాం. దానిని ఏ పదార్థంతో చేశారో తెలుస్తుంది. తరువాత తక్కిన భాగాలు పరిశోధించవచ్చు" అన్నాడు.

"దానిని డిసెక్టు చెయ్యడానికి మన దగ్గర పరికరాలు కూడా లేవు. ఉండండి డాక్టరు సరోజతో మాట్లాడదాం" అని వైర్‌లెస్‌లో పిలిచాడు.

"హలో డాక్టర్‌గారూ! మేము ఈ రొబాట్‌ని పడగొట్టేశాం. అంటే మన హనుమాన్ దాని నడ్డి విరగకొట్టాడు. దాని ఒక భాగాన్ని అశ్వనిలోకి తేవాలనుకుంటున్నాం. మీరు పరిశీలించి చెప్పాలి" అన్నాడు.

సరోజ "నో నో! ఆ పని మాత్రం చెయ్యకండి. మంచి పని చేశారు నాకు చెప్పారు. దానిలో ఏవైనా జీవకణాలున్నాయేమో, అదేదైనా జీవి ఏమో మనకేం తెలుసు. ఏదైనా బేక్టీరియా నౌకలోనికి ప్రవేశిస్తే ఇంకా ఏమైనా వుందా! వుయ్ విల్ గెట్ సిక్. నేనే వస్తున్నాను. మీరెవ్వరూ దానిని ముట్టుకోవద్దు. నేనే టూల్స్ తెస్తాను. ఓవర్"

అని రేడియోలో కంగారుగా చెప్పింది.

సూర్యకుమార్‌ని ఎదురు వెళ్లి ఏదైనా సహాయం చెయ్యమని జగదీష్ పంపాడు! సూర్యకుమార్ అశ్వనిలోనికి ప్రవేశించి కావలసిన టూల్స్ అవీ తీసుకుని మళ్ళీ భార్యతో గ్రహంలోకి ప్రవేశించాడు.

ఆ రోజు సూక్ష్మక్రిములు నీటిలో కనిపించిన నాటి నుంచీ గ్లోవ్స్ లేకుండా ఎవ్వరినీ బయటికి పోనివ్వడం లేదు డాక్టరు సరోజ. అందరికీ గ్లోవ్స్ ఉన్నాయని చూసి సంతృప్తి పొందింది.

తలొక వేపూ రొబాట్‌ని పట్టుకుని ఒక్క ముక్కని తెగగొట్టారు. దానిని పరిశీలించారు. అది లోహమో లేక మరొక పదార్థమో అర్థం కాలేదు. కాస్త తెల్లగా హార్డ్ రబ్బర్ లాగవుంది. ఆ ముక్కన్ని కత్తిరించిన దగ్గర నుంచి ఏదో ద్రవం వూరింది. అది పాలలాగ తెల్లగా వుంది. ఆ ద్రవం కొంత టెస్ట్‌ట్యూబ్‌లో సేకరించింది. ఆ పెట్టెని కత్తిరించిన ముక్కలో నుంచి చిన్న భాగాన్ని కత్తిరించి అక్కడికక్కడే మైక్రోస్కోపులో చూసింది. ఆ ద్రవంలోగాని, ఆ ముక్కలో గాని ఎలాంటి జీవకణాలు ఆమెకి కనిపించ లేదు.

"దీనిలో ఏ జీవకణాలూ లేవు. ఈ ద్రవంలో కూడా అంతే. మనం నిస్సందేహంగా నౌకలోనికివీటినితీసుకుపోవచ్చును. అక్కడ కూడా మనం పరిశీలించి ఏమీ తేల్చిచెప్పలేమనే నా ఉద్దేశం. డీప్ ఫ్రీజ్ లో వీటిని భూమికి తీసుకుపోవాలి. వాళ్ళే కమికల్ ఎనలైజేషన్ చేసి ఈ పదార్థమేమిటో కనుక్కోగలరు. పదండి నౌక లోనికి పోదాం" అని దారితీసింది.

నౌకలో అందరూ ప్రవేశించారు. నౌకలో ప్రొఫెసర్ సరోజ మరోసారి మైక్రోస్కోప్‌లో పరీక్షించారు. వాళ్ళకి ఏమీ అంతుపట్టలేదు.

ఆ రొబాట్ ముక్కని డీప్ ఫ్రీజ్ లో వుంచేశారు.

డాక్టర్ సరోజ మళ్ళీ "ఇది జీవి అనడానికీ, నిర్జీవి అనడానికీ సరియైన సూచన ఏదీ దొరకలేదు" అంది.

కెప్టెన్ జగదీష్ "డాక్టర్! నేను బాగా దానిని గమనించాను. దానికి నోరులేదు. ఎలాగ చూడగలుగుతుందో కూడా అర్థం కాలేదు. అది పని చెయ్యడానికి శక్తి ఎలాగ వస్తుందో అవన్నీ కనుక్కోవాలి" అన్నాడు.

దానికి శక్తి ఎలాగ వస్తుందో అని జగదీష్ అన్నమాటలు విన్న ప్రసాద్‌కి ఒక ఆలోచన వచ్చింది. టెస్ట్ ట్యూబ్‌లోని తెల్లని ద్రవాన్ని ట్యూబ్‌తో సహా పరీక్షించాడు. అది గామా కిరణాలను విసర్జిస్తున్నట్లు తెలుసుకున్నాడు.

అందరితో "మనకి తెలియని ఏదో మూలక పదార్థంతో పనిచేస్తుంది. అది ద్రవరూపంలో వుండే రేడియో ఏక్టివ్ ఎలిమెంటు. దాని శక్తితో ఈ రొబాట్ పనిచేస్తుండవచ్చును. ఇంకా బాగా దీని పరమాణువులని పరిశోధిస్తే తప్ప దీని పరమాణు సంఖ్య, అర్ధాయుస్సు లాంటివి చెప్పలేము" అని ఊరుకున్నాడు.

నరేంద్రకి కొన్ని అనుమానాలు బయలుదేరాయి. "మనిషిని కోస్తే రక్తం వస్తుంది. దీనిని డిసెక్టు చేస్తే తెల్లని ద్రవం వచ్చింది. మనిషిని కూడా చావు దెబ్బ కొడితే చచ్చిపోతాడు. ఇదీ చచ్చి పోయింది. అటువంటప్పుడు ఇది జీవికాదు అని మనం ఎలాగ చెప్పగలం" అని డాక్టర్ సరోజని అడిగాడు.




"కాని దీని తెల్లరక్తంలో జీవకణాలు లేవుగదా?" అంది.

నరేంద్ర "డాక్టర్! అసలు ప్రాణం ఏమిటి? పదార్థానికి చైతన్యం ఎలాగ వచ్చింది? చచ్చిన తరవాత ఏమౌతుంది?" అనడిగాడు చిన్నపిల్లవాడిలాగ. పుట్టిన దగ్గర నుంచి చచ్చేదాకా వచ్చే సందేహం అందరికీ అదే. ఏమిటీ బతుకు, ఏమిటీ మాయ అనుకుంటుంటారు.

సరోజ నవ్వి "బాబూ! ప్రాణం ఏమిటో తెలిస్తే ఒక్క మనిషిని కూడా చావనివ్వకుండా చూసేవాళ్ళం. చావు అనే మాటని చెరిపేసేవాళ్ళం. ఆ 'ప్రాణం'అనేదాన్ని తెచ్చి బొందెల్లో పోసే వాళ్ళం. ఈ ఇరవై ఒకటో శతాబ్దంలో నూటికి ఒక్కడు టెస్ట్‌ట్యూబ్‌తో పెరిగి పుట్టినవాడే అయినా స్త్రీ అండాన్నీ, పురుష వీర్యాన్నీ సంధాన పరిచే మేము ఆ కార్యాన్ని సాధిస్తున్నాం. పిండం దానికదే ప్రాణం పోసుకుంటుంది. అవి లేకుండా మాతరంకాదు. ఎన్నో సంకర జాతుల్ని సృష్టించాం. రెండు జాతుల జంతువులని బలవంతంగానో, ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ ద్వారానో కృత్రిమ గర్భధారణ జరిపి కొత్త జాతిని సృష్టిస్తున్నాం. అందులో మా గొప్పలేదు. పసుపూ, సున్నం కలిస్తే పారాణిగా మారి ఎర్రనవుతుంది. దానికది కలుసుకున్నా, ఎవ్వరైనా కలిపినా జరిగే రసాయనానికి క్రియ అది. ఇంతవరకూ మనిషి సృష్టిలో ఉన్నదానినే ఉపయోగించుకుంటున్నాడు. పరిశోధించి తెలుసుకుంటున్నాడేగాని, దేనినీ సృష్టించడంలేదు" అని ముగించింది.

కెప్టెన్ జగదీష్ అడ్డంవచ్చి "ఇప్పుడు వేదాంతం మాట్లాడవద్దు. అందరూ ఆలోచించి ఇది ప్రాణా, కాదా అని తేల్చి చెప్పండి. అది ముఖ్యం" అన్నాడు.

"అయితే ముందు డాక్టరు సరోజగారు ప్రాణులకీ ప్రాణం లేనివాటికీ మౌలికమైన తేడాలను చెప్పమనండి" అన్నాడు ప్రసాద్.

డాక్టర్ సరోజ నవ్వుతూ "బాగుంది. మీకు తెలియకనే అడుగుతున్నారా? ప్రాణులు పుడతాయి, పెరుగుతాయి. సంచరిస్తాయి. ఆహారం తీసుకుంటాయి. తమలాంటి పిల్లల్ని కంటాయి. చనిపోతాయి. ప్రాణంలేని వాటికి ఇవేవీ వుండవు. రాయిలాగ పడుంటాయి" అని చెప్పింది.

ప్రొఫెసర్ "అయితే యిది అటుకీ యిటుకీ చెందేలాగలేదు. దీనికి పెరుగుదల లేదు గాని చలనంవుంది. పిల్లల్ని కూడా కనదు. ఆహారం తీసుకోవడానికి నోరు లేదు. కాని ప్రాణిలాగే చూడగలుగుతుంది, పనిచెయ్యగలుగుతుంది. మనిషిలాగా దానికది చావడం కూడా లేదు" అని వివరించాడు.

సూర్యకుమార్ "అలాగయేటట్లయితే ఇది మనిషీకాదు. మరమనిషీకాదు. అర్ధ మనిషయి వుంటుంది" అన్నాడు.

జగదీష్ "అలాగే కానివ్వండి. దీని వివరాలు భూమిమీది శాస్త్రజ్ఞులు తెలుసుకునేదాకా దీనిని మనం అరమనిషి అని పిలుద్దాం. దీనికి చెత్తాచెదారం పోసుకుపోవడానికి ఒక 'అర' కూడా వుంది" అన్నాడు.

అందరూ ఘొల్లున నవ్వుకున్నారు.

రౌండు టేబిలుచుట్టూ కూర్చుని భోజనంచేస్తూ మరునాటి ప్రోగ్రామ్‌గురించి చర్చించుకున్నారు. కెప్టెన్ భూమికి పంపిన వార్త సంచలనం కలిగిస్తుంది. భూమినుంచి మళ్ళీ వార్తవస్తేగాని ఏ సంగతి తెలియదు అనుకున్నారు.

తరవాత ఎవరికి నిర్దేశించిన మంచం మీద వాళ్ళు విశ్రమించారు. సూర్య కుమార్, డాక్టర్ సరోజ వాళ్ళ ఎపార్టు మెంటులోనికివెళ్ళి తలుపు వేసుకున్నారు.

జగదీష్ ఆరోజు అందరికన్నా అలిసిపోయాడు. కాని ఒక అరమనిషిని పట్టి కొంత సమాచారం సేకరించగలిగి నందుకు తృప్తిగా వుంది. ప్రతాప్ పోయిన తరువాత ఏదో వెలితిగా వుండేది. కాని ఆ వెలితి ఈ రోజుతో పూర్తయింది. అతడు కూడా నిశ్చింతగా నిద్రపోయాడు.




అశ్వనిలోని అందరూ నిద్రపోతూనే వున్నారు. కెప్టెన్ జగదీష్ లేచి నౌక భూమికి ఎంత దూరంలో వున్నదీ, గ్రహం ఎంతదూరం ప్రయాణించినదీ, సూర్యుని ఆకర్షణశక్తి గ్రహంమీద పడటంచేత వేగం, ఎంత పెరిగిందీ తెలుసుకునే ప్రయత్నంచేశాడు.

రిఫ్లెక్టర్ టెలిస్కోప్‌లో భూమిని వెతికాడు. భూమి, దాని పక్కనే చంద్రుడూ కనిపించారు. ఒక పక్కగా సూర్యుడు ఉన్నాడు. సూర్యుడిని డైరెక్టుగా టెలిస్కోప్‌లో చూడడం ప్రమాదం. పక్కకి తిప్పేశాడు. ఎడంగా వెనకవేపు గురుగ్రహం తగిలింది. చూశాడు. సౌర కుటుంబంలోకి అతిపెద్దదైన గురుగ్రహం పిల్లల కోడిపెట్టలాగా కనిపించింది. తన యిరవై ఉపగ్రహాలతో ఎంతో స్వచ్ఛంగా వుంది. భూమిమీద శాస్త్రజ్ఞులు 2075లో గురుగ్రహానికి ఉపగ్రహం అయిన యూరోపామీద అబ్జర్వేటరీని నెలకొల్పిన తరవాత యింతకన్నా స్వచ్ఛమైన ఫొటోలని యూరోపాలోని అబ్జర్వేటరీ భూమికి పంపుతోంది.

విచిత్రగ్రహం పొజిషన్‌నిబట్టిచూస్తే అంగార గ్రహపు కక్ష్యని దాటివేసినట్లే అనిపించింది. భూమికి తమ లొకేషన్ తెలియజెయ్యమని భూమిని ఈమారు అడగాలి అనుకున్నాడు జగదీష్.

విచిత్రగ్రహం వేగాన్నిచూస్తే అది ఇదివరకటికన్నా పెరిగినట్టు అశ్వనిలోని మీటర్ చూపుతోంది.

ప్రొఫెసర్ ప్రసాద్ కెప్టెన్ ఆపరేటర్ సీటులో కూర్చుని మీటర్లని చూడడం, టెలిస్కోపులో ఆకాశాన్ని పరికించడం అంతా గమనిస్తూనేవున్నాడు. అతనికి జగదీష్ నిర్వహిస్తున్న బాధ్యత, దీక్షతో ఆ బాధ్యతల బరువును మోస్తున్న తీరు ఎంతో ఆకట్టుకుంది. అతనికే గాదు అందరినీ అతని క్రమశిక్షణ ఆకట్టుకుంది.

ప్రసాద్ లేచి వెళ్ళి విష్‌చేస్తూ "ఏమిటి పరిశీలిస్తున్నారు. నాకు కూడా చెప్పండి" అనడిగాడు.

"ఏముంది? ఈ విచిత్ర గ్రహాన్ని ఏం చెయ్యాలి. ఇంత సుందర గ్రహాన్ని చివరి ఘడియలలోనైనా నాశనం చెయ్యడానికి మనకి చేతులొస్తాయా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

'నిజమే. తాము సృష్టించని దానిని నాశనం చేసే హక్కు ఎవ్వరికీ లేదు. ఇంత మంచి గ్రహాన్నీ, అందులోని




విచిత్ర ప్రపంచాన్నీ పేల్చెయ్యాలంటే కష్టమే. భూమిమీదవాళ్లు చేసే తొందర చూస్తే చివరికి దానిని బాంబులతో పేల్చెయ్యక తప్పదేమో' అనుకున్నాడు.

"ఏమిటి? మనిషిని ఎదురుగా వుంచుకుని ఆలోచనల్లోకి జారిపోతున్నారు. చెప్పండి మాకూను" అని జగదీష్ నిలదీశాడు.

"ఏమీలేదు" అని మాత్రం చెప్పాడు. తన ఆలోచనలకొక తీరూతెన్నూ వుండదు. ఆ విచిత్రమైన ఆలోచనలను అందుకే ఒకోస్సారి తనలోనే దాచుకుంటాడు.

"ఏదో దాస్తున్నారు. మీ శ్రీమతిని గురించి ఆలోచిస్తున్నారా?" అన్నాడు హాస్యంగా.

"లేదు మహానుభావా! 'సరోజగారు సముద్ర జలంలో చూసిన క్రిములు పెరిగి పెద్దవై మనల్ని మింగేస్తే ఏం చెయ్యాలి' అని ఆలోచిస్తున్నాను" అని చెప్పి తప్పించుకున్నాడు.

"అదా సంగతి. మరేం భయంలేదు లెండి! మన ప్రాణాలకన్నా ఏదీ తీపికాదు. అలాగే గనక జరిగితే శుభ్రంగా బాంబుల్ని బిగించి టైమ్‌సెట్ చేసి అశ్వనిలో ఎగిరిపోదాం. విచిత్రగ్రహం సఫా" అని నవ్వాడు.

వాళ్లు మాట్లాడుకుంటుండగానే అందరూలేచారు. జగదీష్, ప్రసాద్‌లను చుట్టుముట్టారు.

నరేంద్ర వాళ్ళని సమీపించి "అందరం లేచాం గదా! ఇక్కడెందుకు పదండి గ్రహంలోనికి పోదాం. అందులోనే కాలక్షేపం చెయ్యొచ్చు. కొత్త విషయాలు ఏవైనా తెలుస్తాయి" అని తొందర చేశాడు.

డాక్టర్ సరోజ "బాబ్బాబూ...నువ్వు కాస్త ఆగునాయనా! నీకు కాలు ఒకచోట నిలవదులాగుంది. కాసేపు కూర్చో" అని ఖాళీగా వున్న కుర్చీ చూపించింది.

నరేంద్ర "నాకు గ్రహంలోని గురుత్వాకర్షణ కృత్రిమమైనదైనా భూమి మీదలాగే అనిపిస్తోంది. స్వచ్ఛమైన ప్రాణవాయువు, నేల, నీరు అంతా భూమి మీదలాగే వుంటుంది. అందుకే అశ్వనిలో కన్నా అందులోనే బావుంటుంది. పదండి పోదాం" అని తొందర చేశాడు.

నిజానికి అందరికీ అలాగే వుంది. పూర్తిగా గ్రహాన్ని పరిశీలించలేదు. ఒక వేళ ఆ నాగరిక జాతి బతికే వుందేమో? రాత్రి గ్రహంలో గనక నిద్రపోతే వాళ్ళు వచ్చి చంపుతారేమోననే భయం చేతగాని, లేకపోతే గ్రహంలోనే గడిపేద్దురు.

నరేంద్ర ఆ గ్రహాన్ని గురించి అంత బాగా చెప్పడంతో అందరికీ అందులో సంచరించాలనే బుద్ధి పుట్టింది. డాక్టర్ సరోజ కూడా రావడానికి ఉద్యుక్తురాలైంది.

కెప్టెన్ జగదీష్ హనుమాన్‌కి నౌకను ఒప్పచెప్పాడు. గంటగంటకి వైర్‌లెస్‌లో మాట్లాడమన్నాడు.

గ్రహంలోనికి ప్రవేశిస్తూనే వారు మొదట గుర్తించినది 'అరమనిషి' తాలూకు మిగిలిన భాగం కనిపించక పోవడం. అది వాళ్ళు ఊహించిందే! అందు చేత అంత ఆశ్చర్యపోలేదు. కాకపోతే వాళ్లకు కొన్ని అనుమానాలు దూరమై మరికొన్ని తలెత్తాయి.

మొదట సూర్యకుమార్ తన అనుమానాన్ని యిలా వ్యక్తం చేశాడు "మూక ఉమ్మడిగా అవి మన మీద దండయాత్ర

చేస్తాయంటారా?" అన్నాడు జగదీష్‌ని ఉద్దేశించి.

జగదీష్ కాస్తసేపు ఆలోచించి, "అలాగ చేస్తాయని నేను అనుకోను. కాక పోతే ఒక విషయం స్పష్టమైంది. అవి మనం మరణించినా మన శవాలను డిసెక్టు చేసేసి ఈ సముద్రంలో కలిపేస్తాయి. ఈ సముద్రంలోని క్రిములకు ఆహారమై పోతాం. బహుశా ఈ గ్రహం మీద నివసించిన నాగరికుల అవశేషాలు మనకి అందుకే కనిపించడం లేదనుకుంటాను" అన్నాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ "అంతేకాదు. మరొక విషయం కూడా ధృవపడింది. ఈ అరమనుషలు ఒక రసాయనిక పదార్థంతో చెయ్యబడి వుంటాయి. అవి



సజీవంగా వుండడానికీ, చలించడానికీ ఆ తెల్లని ద్రవమే జీవంగా, శక్తిగా ఉపయోగపడుతుందన్నమాట. ఆ తెల్లని ద్రవం పోగానే దానిని చెత్తగా జమకట్టాయనుకుంటాను" అన్నాడు.

నరేంద్రకి మొదట ఎలాంటి ఆలోచనలూ లేవు. ప్రొఫెసర్ అన్న తరవాత ఒక సంశయం వచ్చింది "ఒకవేళ నిశ్చలంగా కదలకుండా చచ్చినట్లు పడుంటే మనల్ని కూడా చెత్తకింద జమకడతాయంటారా?" అన్నాడు ప్రసాద్‌తో.

జగదీష్, నరేంద్రకి "నేనలా అను కోను. వాటికి జీవకణాలను గుర్తించగలిగే సెన్సర్స్ వున్నాయి. లేకపోతే కదులు తున్న హనుమాన్ దగ్గరికీ, ప్రతాప్ దగ్గరికీ చేరేవే కావు" అని సంశయం తీర్చాడు.

ప్రొఫెసర్ ఎన్నో టెస్ట్ ట్యూబ్‌లను సీసాలను జేబులో పెట్టుకున్నాడు



డాక్టర్ సరోజ కూడా కొన్ని టెస్ట్ ట్యూబ్‌లను తనతో నమూనాలను సేకరించడానికి పట్టుకుంది.

వాళ్ళు మాట్లాడుకుంటూ తిన్నగా సముద్రాన్ని చేరే రోడ్డు పట్టుకున్నారు. సగం దూరం వచ్చారో లేదో వాళ్ళ మీద వెలుగు పడినట్లయింది. ఆ వెలుగు దిక్కుగా చూశారు. వృత్తాకారపు సముద్రం మధ్యలో ఒక సూర్యబింబం వెలిసింది. అంత కాంతివంతంగా లేకపోయినా ఉదయపు సూర్యుని లాగ ఎర్రగా కనిపించింది. వాళ్ళ ఆశ్చర్యం వర్ణనాతీతం. ఎవరికివారు నాలుగు కళ్లు చేసుకుని చూడసాగారు. ఆ సూర్యుని కాంతికి వాళ్ళ నీడలు పొడవుగా వెనక్కి లాక్‌దాకా వ్యాపించాయి.

గురుత్వాకర్షణ లేని మధ్యభాగంలో ఆ సూర్యుడు నిలబడ్డం కనిపిస్తూనే వుంది కాని ఆ సూర్యుడిని అలాగ ఎవరు నిలబెట్టారు? లేకపోతే దానికదే ఎలాగ ఆవిర్భవిస్తుంది? అని ఎవరికివారే అనుకున్నారు.

సూర్యకుమార్ పుస్తకాల పురుగు. తనతోపాటు ఎన్నో పుస్తకాలు కూడా తెచ్చుకున్నాడు.

టెక్నికల్ పుస్తకాలు తను రాయడమే కాక ఫిక్షన్ కూడా చాలా చదివాడు. 21వ శతాబ్దపు కాల్పనిక నవలలేకాక వందఏళ్ళ క్రితపు ఇసాక్ అసిమోవ్, ఆర్థర్.సి. క్లార్క్ పుస్తకాలు; రెండువందల ఏళ్ళ క్రితపు జూల్స్‌వెర్న్, హెచ్.జి.వెల్స్ పుస్తకాలుకూడా చదివాడు. సమకాలీన రచయితల పుస్తకాలు సరేసరి!

ఈ గ్రహంలోని సూర్యుడిని చూడగానే కృత్రిమ సూర్యుడు మనస్సులో మెదిలాడు. ఊహ ఇక్కడ నిజరూపం దాల్చింది. 'మేధస్సు ఎంత శక్తివంతమైనది. రెండువందల ఏళ్ళ క్రితపు రచయిత జూల్స్‌వెర్న్ తన పుస్తకం 'ఫ్రమ్ ఎర్త్ టు మూన్' అనే పుస్తకంలో రాసిన విషయాలు పోయిన శతాబ్దంలో నిజమయ్యాయి. మళ్ళీ ఇప్పుడు పాతికేళ్ల నాటి ఊహ నిజమైకూర్చుంది. ఎంత విచిత్రం' అనుకున్నాడు.

సూర్యకుమార్ "ప్రొఫెసర్‌గారూ! మీరు చెప్పింది నిజం. ఇది మన శివరామకృష్ణగారు ఊహించిన వ్యోమనౌక లాంటిదే! అతని పుస్తకం నేను చదివాను. అన్నీ అతను ఊహించినట్లు జరిగితీరుతాయి. అలాగే గనక జరిగితే మనంఈ గ్రహాన్ని విడిచిపెట్టేలోగానే ఇందులో వర్షాలు పడతాయి. ఈ భూమిలోనుంచి రకరకాల వృక్షజాతి బయలుదేరుతుంది. మనకి ఆహారసమస్య వుండదు. కాకపోతే అది మనం తినవచ్చునా లేదా అనేది సరోజ తేల్చవలసి వుంటుంది" అని ముగించాడు.

ప్రసాద్ "అంతేకాదు. ఈలోగా జలచరాలుకూడా బయలుదేరుతాయి. చేపలో లేక అలాంటి మరో జాతో బయలుదేరుతుంది" అని తన ఉద్దేశాన్నికూడా బయట పెట్టాడు.

ఇవన్నీ వింటున్న కెప్టెన్ జగదీష్ 'అదేగనక నిజమైతే ప్రపంచం అంతా ఏకమైనాసరే ఈ గ్రహాన్ని పేల్చెయ్యడం అనే ప్రసక్తే వుండదు. దీనిని ఎలాగైనా భూమికక్ష్యలో ప్రవేశపెట్టే ప్రయత్నం చేద్దాం. భూమికి ఒక అపూర్వకానుకగా ఇద్దాం' అనుకున్నాడు జగదీష్.

డాక్టర్ సరోజ "మీరు 'ఈ విషయాలే ఆలోచిస్తున్నారుగాని, ఇంత మహత్తర




మైన కృత్రిమగ్రహాన్ని రూపొందించిన జీవులు ఒకవేళ గ్రహంలో వున్నారేమో అనేసంగతి ఆలోచించడంలేదు. ఒకవేళ వుంటే మన గతి ఏమౌతుందో ఆలోచించారా?" అని ప్రశ్నించింది.

ప్రసాద్ "సరోజగారూ! మీరు ఆ విషయంలో నిశ్చింతగా వుండండి. మన భూమిమీదికి రోదసీనౌకలో ఇతర గ్రహవాసులు దిగారే అనుకోండి. మనం వాళ్ళని చంపుతామా? చంపం. ఎంత సైన్సు అభివృద్ధి చెందినా, ఎంత నాగరికత పెంపొందినా ధర్మసూత్రాలు నశించవు. మానవత్వం అనేది ఉంటుంది. వారు మనల్ని పరిశోధించడానికి బంధిస్తారేమోగాని చంపరు. భాష ఒక ప్రతిబంధకంగా తయారౌతుంది. మనం ఎందుకు వచ్చిందీ చెప్పలేకపోతాం. ఒకవేళ ఊహలు చదవగల టెలిపతీ యంత్రాలు గనక వాళ్ళదగ్గరుంటే ఆ సమస్యా వుండదు. మన శాస్త్రజ్ఞులుకూడా భూమి మీద అదే ప్రయత్నంలో వున్నారుగదా" అనిఆమె భయాన్ని నివృత్తిచేశాడు.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ సముద్రం ఒడ్డుకిచేరారు. శ్రవణానందకరమైన సముద్రపు హోరు. తలపైకెత్తి చూస్తే ఎర్రని సూర్యుడు! నునువెచ్చని సూర్యకిరణాలు శరీరాన్ని తాకుతుంటే భూమి మీది బాలభానుని కిరణాలస్పర్శలాగే అనిపించింది. అందరూ తన్మయత్వాన్ని పొందారు.

నరేంద్రకి గ్రహాన్ని ఇంకా గాలించే ఉద్దేశం వుంది. అందరూ రాకపోయినా తనొక్కడయినా తిరిగేవాడే! ఆ ఎలక్ట్రిక్ మోటారు గనకవుంటే చెప్పాపెట్టకుండా చెక్కేసేవాడే. దానినికాస్తా ఆ అరమనిషి చెతకుండి పాలుచేసి సముద్రంలో కలిపేశాడు.

మొత్తం గ్రహంలోని భూమి ఉత్తరాంతరార్థ గోళాన్నీ, దక్షిణాంతరార్థగోళాన్నీ కలుపుకుంటే వెయ్యి చదరపు కిలోమీటర్లు వుండవచ్చును. అంత ప్రదేశాన్ని కాలి నడకనే సర్వే చెయ్యడం కష్టమే అనుకున్నాడు. ఉన్నట్లుండి ప్రొఫెసర్ ప్రసాద్, తనూ చూసిన సొరంగ మార్గాలు జ్ఞాపకం వచ్చాయి. వాటిలోనికి ప్రవేశిస్తే ఏవైనా కొత్త విషయాలు తెలియవచ్చును.

వెంటనే కెప్టెన్ జగదీష్‌తో "సర్! ఆ రోజు ప్రొఫెసర్‌గారూ, నేనూ చూసిన రోడ్డు కింది సొరంగాలలోనికి ఎప్పుడు ప్రవేశిద్దాం ? నా ఉద్దేశం ప్రకారం వాటిల్లోనే ఈ గ్రహం నిర్మాతలైన జీవులు నివసించిన గుహాహర్మ్యాలుండవచ్చును" అని తన అభిప్రాయాన్ని తెలియజేశాడు.

ఆ విషయం జగదీష్‌కి కూడా జ్ఞాపకం వుంది. ఈ అరమనుషల గొడవలో పడి పరిశోధన ముందుకిసాగలేదు. 'నరేంద్రకి ఏదో సమాధానం అనుకూలంగా చెప్పకపోతే ఏదోరోజు చెప్పాపెట్టకుండా ఒంటరిగానైనా బయలుదేరే రకం' అనుకుని "నాకూ ఆ విషయం జ్ఞాపకం వుంది నరేంద్రా! దానికి పథకం రూపొందిస్తున్నాను. సూర్యకుమార్, మీరూ, ప్రసాద్ గారూ, నేనూ రేపే బయలుదేరుదాం" అని సముదాయించాడు.

"మనకి ఏమేం అవసరమో తెలియచెయ్యండి. చెబితే నేను సమకూర్చి రెడీగా ఈ రోజె పెడతాను" అన్నాడు.

"ఏముంది. టార్చిలైట్లు అవసరం వుండవచ్చును. లేసర్ గన్స్ ఎలాగూ పట్టుకోవాలి. అంతే" అన్నాడు.

ఇంతలో సూర్యుడు ఉన్నట్లుండి

మాయమయ్యాడు. సూర్యుని స్థలంలో శూన్యం తప్ప మరేమీ కనిపించలేదు. అయినా గ్రహంలో వెలుతురుకి లోటు లేదు. ఎంతో ఆహ్లాదకరమైన కాంతి! స్పష్టంగా ప్రతి వస్తువూ కనిపిస్తూనే వుంది.

జగదీష్ "ఇదేదో అణుశక్తితో పని చేస్తోంది. అంతర్భాగానికి పరోక్షంగా ఎక్కడినుంచో కాంతి ప్రసరిస్తుందను కుంటాను" అన్నాడు.

అందరూ తిరుగు ప్రయాణానికి ఉద్యుక్తులవుతుండగా రేడియోలో హనుమాన్ గొంతుక – "హలో! దిస్ఈజ్ హనుమాన్! ఎ మెసేజ్ ఫ్రమ్ ఎర్త్ బాస్" అన్నాడు.

జగదీష్ "థేంక్యూ హనుమాన్! వుయ్ ఆర్ కమింగ్" అని సమాధానం చెప్పాడు.

హనుమాన్ "ఎస్ బాస్" అని సమాధానం చెప్పాడు. రిసీవర్‌లో మరేమీ విని పించలేదు.

జగదీష్ అందరినీ ఉద్దేశించి "విన్నారు గదా! గబాగబానడవండి. మళ్ళీ రేపు వచ్చి గుహలోని విశేషాలు కనుక్కుందాం" అని ముందుకు నడిచాడు. అందరూ అనుసరించారు.

వాళ్ళెవరూ గమనించనేలేదు గానీ, వాళ్ళకి పది గజాల దూరంలో ఒక అర మనిషి నుంచుని వుంది. వాళ్ళు కదిలిపో గానే మెల్లగా ఆ ప్రదేశానికి వచ్చింది. అంతా శుభ్రం చేసి వెళ్ళిపోయింది.

మరో అర్ధగంటలో అశ్వనిని చేరుకున్నారు. జగదీష్ ముందుగా ఆపరేటర్ సీటులో కూర్చుని హనుమాన్ చెప్పిన వార్త ఏమిటో వినడానికి రికార్డర్ ప్లే చేశాడు. భూమినుంచి వచ్చిన వార్త విని పించసాగింది–

"హల్లో! దిస్ ఈజ్ హైదరాబాద్. స్పేస్ స్టేషన్. కెప్టెన్ జగదీష్‌గారూ! మీ సందేశం అందింది. మీరు చేస్తున్న సర్వే గురించి రష్యా, అమెరికాలకు నివేదిక పంపాం. ఏ స్టేజిలోనైనా మీరు దానిని నాశనం చెయ్యగలరని నమ్మించాం. వాళ్లు తమ శుభాకాంక్షలను మీకు పంపమన్నారు. 'ఏ సహకారం కావాలన్నా అందిస్తాం' అనికూడా చెప్పారు.

మొదటిసారిగా రహస్యంగా వుంచిన మీ సమాచారాన్ని ప్రెస్‌కి రిలీజ్ చేశాం. ప్రతిరోజూ వార్తాపత్రికలలో పతాక శీర్షికలో మీ విషయాలే వేస్తున్నారు.

మీరు పరిశోధించడం అందరికీ ఇష్టమే. మీరు పంపే వార్తల కోసం వెయ్యి కళ్ళతో మేమందరం ఎదురుచూస్తున్నాం.

అలాగని మీరు చిక్కుల్లో పడడం మాత్రం ఎవ్వరూ ఒప్పుకోరు. ఎలాంటి ప్రమాదాలు పొంచివుంటాయో అని అందరూ భయపడుతున్నారు. జాగ్రత్త. ఎంతో ఆలోచించిగాని అడుగు ముందుకి వెయ్యవద్దు.

ఎప్పటికప్పుడు మీరు సర్వే చేసిన విషయాలు వెంటవెంటనే తెలియజేస్తుం డండి. ఓవర్" అని ఆగిపోయింది.

అందరూ నిశ్శబ్దంగా ఆ వార్తని చెవులప్పగించి విన్నారు. వాళ్ళకి ఎంతో ఉత్సాహం వచ్చింది. ప్రపంచం సహకరించాలేగాని వాళ్ళ కోసం ప్రాణాలివ్వడానికి సిద్ధంగా వున్నారు.

జగదీష్ ట్రాన్స్‌మిటర్ ఆన్ చేశాడు. విచిత్ర గ్రహంలో వాళ్లు చూసిన విషయాలు తెలియజేశాడు. ముఖ్యంగా కృత్రిమ సూర్యుడి ఉదంతం పూసగుచ్చి నట్టు చెప్పాడు. ఆ రోజు తెచ్చిన

 

సముద్రపు నీటిలో మరో నాలుగు రకాల సూక్ష్మక్రిములున్నట్లు డాక్టర్ సరోజ చెప్పింది. దానిని కూడాఫ్లాష్ న్యూస్‌లాగా చెప్పాడు. ఆ క్రిముల ఫోటోలు టెలికాస్ట్ చేస్తానని చెప్పాడు. చివరిగా "మేము రేపు గ్రహంలోని గుహలను సర్వే చెయ్యబోతున్నాం. ఓవర్" అని ట్రాన్స్‌మిటర్ ఆఫ్ చేశాడు.




మరునాడు అందరూ మేల్కొని చూసేసరికి నరేంద్ర తయారైపోయివున్నాడు.

జగదీష్ అతనిని చూసి "మీరు రాత్రి అసలు నిద్రపోయారా?" అని అడిగాడు.

నరేంద్ర "ఏమి నిద్ర సర్! నాకలలలో కూడా ఆగుహలలోనే సంచరిస్తున్నానట" అన్నాడు నవ్వుకుంటూ.

"ఓయి నీ అసాధ్యం కూలా...భలేవాడివి దొరికావయ్యా మా ప్రాణాల మీదికి" అని ఎంతో ఆప్యాయంగా నరేంద్ర వంక చూశాడు.

అందరూ గబగబా తయారయ్యారు. డాక్టర్ సరోజ తయారవడం చూసి జగదీష్ వారిస్తూ "సరోజగారూ! మీరు అశ్వనిలోనే వుండాలి. మనం భూమికి చాలా దగ్గరకి వచ్చేశాం. అంగారక గ్రహాన్ని దాటిపోయేవుంటాం. అందుకే వార్త రావడానికీ, పోవడానికీ కూడా అర్ధగంట తీసుకోవడంలేదు. ఈమారు మన లొకేషన్ చెప్పమని అడుగుదాం. అందుకని ఇకమీద ఎవరో ఒకరు రేడియో ఆపరేటర్ డ్యూటీ చెయ్యక తప్పదు. హనుమాన్ మరమనిషి. రితే యంత్రంలాగ విషయాలు విన్నవి విన్నట్లు చెప్పెయ్యడమేగాని ఆలోచించి నిర్ణయాలు తీసుకోలేడుగదా!' అందుకని మీరుండండి. మీకు తోచకపోతే ఎప్పుడంటే అప్పుడు వైర్‌లెస్‌లో మాతో మాట్లాడండి" అన్నాడు.

స్పేస్ సూట్లు తొడుక్కొని, టార్చి హెల్మెట్లు తగిలించుకుని జేబుల్లో లేసర్ గన్స్‌ని కూడా వుంచుకుని నలుగురూ విచిత్ర గ్రహంలోనికి ప్రవేశించారు. ముందుకి గబగబా నాలుగు రోడ్ల జంక్షన్ వేపు సాగిపోసాగారు. వాళ్ళకి నాలుగైదు అరమనుషులు ఎదురయ్యాయి. ఇప్పుడు వాళ్ళు వాటిని పరికించడం కూడా లేదు. ఇప్పుడవి వాళ్ళకి గంగిగోవుల్లాంటి సాధు యంత్రాలలాగ కనిపించసాగాయి.

నరేంద్ర చకచకా ముందుకి సాగిపోతున్నాడు. అతనిని మిగిలినవారు అనుసరించసాగారు. మొదట తగలిన నాలుగురోడ్ల కూడలిదగ్గరవాళ్ళని ఆగమని వాళ్లు చూసిన టన్నెల్ కోసం వెతికాడు. దూరంగా రోడ్డుకిందికి సొరంగం కనిపించింది. రోడ్డు దిగి సొరంగ ముఖద్వారాన్ని చేరుకున్నారందరూ.

నలుగురూ అడుగులో అడుగులు వేసుకుంటూ లోనికి నడిచారు. లోన చీకటిగానేవుంది. హెల్మెట్ టార్చిలు వెలిగించారు. కొంతదూరం గోడలను పరీక్షిస్తూ ముందుకి సాగారు. వాళ్ళ టార్చిలైట్ల వెలుగు మొత్తం టన్నెల్‌ని వెలుగుమయంచేసింది. ఒకచోట ఆ టన్నెల్ ఎడమ వేపు తిరిగింది. ఆ మలుపు తిరిగితిరగ

గానే కిందికి మెట్లు కనిపించాయి. జగదీష్ అందరికీ సూచనలు చేద్దాం అనుకుం టుండగానే టకటకలాడించుకుంటూ మెట్లు దిగి వెళ్ళిపోయాడు నరేంద్ర. దాదాపు ముప్పై మెట్లదాకా వున్నాయి. దిగువనిగల ఒక సమతల ప్రదేశాన్ని చేరుకున్నాడు. జగదీష్ రెండోవాడిగా అక్కడికి చేరుకుని నరేంద్ర రెక్కపట్టుకున్నాడు. తరువాత సూర్యకుమార్, ప్రసాద్ అక్కడికి చేరారు. అక్కడినుంచి నాలుగు దిక్కు లకూ నాలుగు మార్గాలున్నాయి.

అందరికీ జగదీష్ సూచనలు చేశాడు "మనం నలుగురం మన మన వీపులను ఆనించుకుని నాలుగు దిక్కులనూ చూసు కుంటూ ఒకేదిశగా సాగిపోదాం. ముందు మార్గాన్ని ఒకరు, వెనక మార్గాన్ని ఒకరు, కుడికి ఒకరు, ఎడమకి ఒకరు చూస్తూ ఒకరికి ఒకరం ఆనుకునే కదలాలి. లేసర్ గన్స్‌ని పొజిషన్‌లో పెట్టుకోవాలి" అన్నాడు.

సరేనని తలలు ఆడించారు. జగదీష్ ముందు మార్గదర్శి కాగా, వెనక మార్గాన్ని నరేంద్ర కవర్ చేస్తున్నాడు. కుడి వేపు సూర్యకుమార్, ఎడమ భాగం ప్రొఫెసర్ ప్రసాద్ కవర్ చేస్తున్నారు. అందరి వీపులూ ఆనుకునే వున్నాయి.

'రైట్' అని కాషన్‌యిచ్చి కుడికి తిరి గాడు జగదీష్. అందరూ కుడికి తిరిగి వీపుల ఆనుకొని వదలకుండా ఒకే యూనిట్‌లాగ అతనిని అనుసరించారు.

ఒక ఆవరణలో ప్రవేశించారు. కాస్త ముందుకి సాగారో లేదో చీకటి మటు మాయమయింది. వాళ్ళ హెల్మెట్ టార్చిల అవసరమే లేకపోయింది. ఎడమ చేతులతో టార్చి స్విచ్‌లను ఆపుచేశారు. కన్నులకింపైనకాంతి. లోన పెద్దఆవరణ. పాలరాతిని తలదన్నే గాజుస్ఫటికాల లాంటి గోడలు. మధ్య మధ్య స్థంభాలు. వాటిద్వారా కాంతి కూడా ప్రసరించగలంత స్వచ్ఛత. వాళ్ళు సర్వం మరిచిపోయి ఆశ్చర్యంతో చూడసాగారు.

ఆ ఆవరణ అంతా కలయతిరిగారు. ఎక్కడా శబ్దాలుగానీ, ఏ జీవి మనుగడ సాగించిన సూచనలుగానీ కనిపించలేదు. ఆ గది చివర లోనికి మరియొక ద్వారం కనిపించింది.

జగదీష్ "చూశారా ఆ చివర ఎదురుగా ఒక మార్గం కనిపిస్తోంది. ఒక్కరోజే అన్నీ తిరిగెయ్యవలసిన అవసరం మనకిలేదు. ఈ రోజు ఈ ఆవరణఅంతా బాగా పరిశీలిద్దాం" అని కుడికీ, ఎడమకీ ముందుకి కదిలి ఆ పెద్దగదిలోనే కలయ తిరిగారు.

సూర్యానికి ఒక సోఫాలాంటిది కని పించింది. సూర్యకుమార్ చూపిన ఆ సోఫా దగ్గరకి జగదీష్ తోవతీశాడు.

అదే సమయంలో దూరంగా కని పించిన ద్వారంలో నుంచి గబాగబా బయ టికి వచ్చింది ఒక అరమనిషి. వాళ్ళని తప్పించుకుని మరీ బయటికి వెళ్ళి పోయింది. వాళ్ళకి అరమనుషుల స్థావరం ఎక్కడుందో తెలిసిపోయింది. కాని యిలాంటి సొరంగ భవనాలు ఎన్ని వున్నాయో అనుకున్నారు.

నలుగురూ ఆ సోఫాని చేరారు. చలువ రాతి మీద విచిత్రమైన లతలు చెక్కబడి వున్నాయి. ఆ సోఫా వాళ్ళ హృదయా లను దోచుకుంది. కళలకి ఒక ప్రపంచం లేదు. అది ఏ ప్రపంచానికి వెళ్ళినా వుండ వలసిందే. దయ్యాలలోకం వెళ్ళినా అవి నృత్యంచేస్తే కళాత్మకంగానే వుంటుం




దేమో అనుకున్నారు.

నరేంద్ర" వెనక గోడే వుందిగధసర్! మనం సోఫామీద కూచ్చుందామా" అన్నాడు. అప్పటికే నడిచి నడిచి వాళ్ళు అలిసిపోయారు. కాళ్ళు కూడా నొప్పి చేశాయి.

జగదీష్ వొంగి దానిని తడిమి చూశాడు.చంద్రకాంత శిలలాగ చల్లగా వుంది. నొక్కి చూశాడు. ఏమీకాలేదు. వాళ్ళతో జట్టు విడిపోయి, తను ముందు కూర్చున్నాడు.ఏమీ కాలేదు.

మరో క్షణం తరవాత "మీరుకూడా కూర్చొండి" అని కూర్చోమన్నాడు. ముగ్గురూ సర్దుకొని ఆ సోఫాలో కూర్చొన్నారు. ఏదో తెలియనిహాయి.

చూస్తుండగానే ఎదురుగా ఒక టీపాయ్ లాంటిది వచ్చి ఆగింది. దానిలో నుంచి మంచి శ్రావ్యమైన సంగీతం వినిపించ సాగింది. ఆ సంగీతం వింటుంటే ఈ గ్రహంలో లేసర్ గన్స్‌కి ఎప్పుడూ పని వుండదు అనుకున్నారు.

ప్రొఫెసర్ ప్రసాద్ "చూడండి. వాళ్ళ ఏర్పాట్లు. ఇది వాళ్ళ స్నేహహస్తం చాచుతున్నారనడానికి నిదర్శనం" అన్నాడు.

జగదీష్"నిజంగా యిది విచిత్రగ్రహం. రోజుకో వింత. ఇంకా ఎన్ని జరుగబోతున్నాయో ?" అని ఆశ్చర్యాన్ని వ్యక్తంచేశాడు.

మరికాస్త సేపట్లో ఒక విచిత్రాకారం గల అరమనిషి వచ్చి ఆ టేబుల్ మీద కొన్ని తినుబండారాలు పెట్టింది.

నరేంద్ర లేసర్ గన్ పొజిషన్‌లోకి తీసుకోవడం చూశాడు జగదీష్. ఏమీ చెయ్యవద్దని సంజ్ఞచేసి వివరించాడు. ఆ మరమనిషి హానిచెయ్యడానికి రాలేదని అందరూ గ్రహించారు. నరేంద్రకి కూడా ఆ సంగతి తెలుసును. కాని ఎందుకైనా మంచిదని లేసర్ గన్‌ని పొజిషన్‌లో పట్టుకున్నాడు.

తినుబండారాలు పెట్టి ఒక్క క్షణం కూడా ఆగకుండా వెనక్కి వెళ్ళి ఒక చోట ఆ అరమనిషి నుంచుంది. దానిని నలుగురూ శ్రద్ధగా గ్రహించసాగారు.

జగదీష్ "నున్నగా అన్ని విభాగాలూ కన్పిస్తున్నాయి. కళ్ళెక్కడున్నాయో, చెవులెక్కడున్నాయో అసలు తెలియడం లేదు. మనం మన మరమనుషుల్ని మన లాగే తీర్చిదిద్దాము. వాళ్లు దీనిని ఇలాగ చేశారు అంటే వాళ్ళూ ఈ రూపంలోనే వుండి వుంటారు అనుకోవచ్చునంటారా?" అన్నాడు ప్రసాద్‌ని ప్రశ్నార్థకంగా.

ప్రసాద్ "చెప్పలేము. మనం ఇన్ని అర మనుషుల్ని చూస్తున్నాం. ఒకోటి ఒకోరూపు. అది నిర్వహించవలసిన పాత్రని బట్టి దానికి రూపకల్పనచేసి నట్లున్నారు" అని సమాధానం చెప్పాడు.

సూర్యకుమార్ "ఈ గ్రహంలోని ప్రతిదాన్నీ ఒక మాస్టర్ కంప్యూటర్ నిర్వహిస్తోంది. ఆ కంప్యూటరుని వాళ్లు తిరుగులేని విధంగా ప్రోగ్రామ్ చేసి వుంటారు. ఆ కంప్యూటరు ఆదేశాలను ఈ అర మనుషులు పాటిస్తుంటాయి" అని తన ఉద్దేశం చెప్పాడు.

నరేంద్ర "ఇప్పుడు మనం ఈ ఫలహారాన్ని తినాలంటారా?'' అన్నాడు.

జగదీష్ మధ్యలోనే ఆపి "ఆపని మాత్రం చెయ్యకండి. ఈ ఆహారాన్ని ముందు మనం డాక్టరుగారికి చూపించి పరీక్షించమనాలి. తినదగ్గదే అని ఆమె చెప్పేదాకా మనం తినకూడదు"అన్నాడు.

ప్రొఫెసర్ ప్రసాద్ గ్లోవ్స్ తగిలించుకున్న చేతులతో అన్ని పదార్థాలను నమూ

నాలుగు టెస్ట్‌ట్యూబుల్లో స్వీకరించాడు.

జగదీష్ "ఇంక మనం వెనక్కి వెళ్ళడంమంచిది. సూర్యకుమార్ ఊహించినట్లు మాస్టర్ కంప్యూటరు మనం ఆహారం తీసుకోలేదని గ్రహిస్తుంది. దానికి ఏదో అనుమానం రావచ్చును. సామ దాన భేదాల తరువాత దండోపాయంలాగ మనల్ని బంధించే ఏర్పాట్లు చేస్తుందేమో! కీడెంచి మేలెంచడం మంచిది. పదండి పోదాం. మళ్ళీ రేపు రావచ్చును" అని సోఫామీదనుంచి లేచాడు.

అందరూలేచి వచ్చిన దారినే వెనక్కి నడిచిపోసాగారు. వచ్చినప్పుడులాగ ఒకరి నొకరు కవరుచేసుకోకుండా నిబ్బరంగా టన్నల్‌దాటి బయటికివచ్చి రోడ్డెక్కారు.

జగదీష్ ప్రసాద్‌ని చూసి "లోపల జీవులు వుండడానికి ఒక్కశాతమైనా అవకాశం లేదంటారా" అనడిగాడు.

"నో. అటువంటి అవకాశంలేదు" అని సమాధానం చెప్పాడు.

"ఎలాగ చెప్పగలరు" అని తిరుగు ప్రశ్న వేశాడు.

"ఉంటే మనం వేరే గ్రహాలనుంచి వచ్చిన జీవులం అని ఈపాటికి గ్రహించి వుంటారు. పరిచర్యలు అరమనుషుల చేత చేయించినా వాళ్లువచ్చి మనల్ని చూసే వాళ్లు, పరామర్శించేవాళ్లు" అని చెప్పాడు.

జగదీష్‌కి ప్రసాద్ సమాధానం సంతృప్తిని కలిగించింది. అదే నూటికి నూరుపాళ్ళూ నిజమైతే ఎన్ని శతాబ్దాల క్రితం వాళ్లు నశించివుంటారో తెలుసుకోవాలి. ఆనాటి నుంచీ ఈనాటిదాకా ఏ శక్తితో ఈ గ్రహం పనిచేస్తోంది. ఇప్పటికి కూడా ఈ అరమనుషులు పని చేస్తున్నారంటే మాటలా అని ఆశ్చర్య



పోయాడు. అయితే ఇది పెద్ద అణు రియాక్టరుతో పని చేస్తుండివుండాలి. ప్రొఫెసర్ ఉద్దేశంతెలుసుకోవాలి అని ప్రశ్నించాడు-

"దీనికి ఎన్నటికీ తరగని శక్తి ఎలాగ వస్తున్నదంటారు?"

ప్రసాద్ "పెద్దశక్తివంతమైన అణు రియాక్టరు ద్వారా సంక్రమిస్తుందనుకుంటాను. శతాబ్దాలకు సరిపడా అణుయింధనాన్ని ఈ గ్రహం తర్భాగంలో ఎక్కడో సమకూర్చి పెట్టి వుంటారు. ఎక్కడో భారజలం కూడావుండి వుంటుంది. మనం దీనినంతటినీ యింకా ఇంటా బయటా పూర్తిగా వెతకలేదు" అన్నాడు.

సూర్యకుమార్ ఆ సంగతి ఎప్పుడో గ్రహించాడు. అతనొక అంతర్ముఖుడు. ఎవ్వరికీ అనవసరంగా ఏదీ చెప్పడు. విని ఊరుకున్నాడు.

నరేంద్ర అందుకుని "తక్కినది నేను పూర్తిచేస్తాను. కాలానుగుణంగా వాతావరణంలో మార్పులు వచ్చాయి. ఈ అణురియాక్షన్ మనకి తెలిసిన యురేనియంనికాని, ప్లూటోనియంనిగాని ముడి పదార్థంగా వాడుకునేది కాకపోవచ్చును. దానిని పనిచేయించడానికి సౌరశక్తికూడా అవసరమేమో. ఎప్పుడో గ్రహించిన సౌరశక్తి అయిపోయి వుంటుంది. గ్రహాంతర్భాగం శీతలంగా మారిపోయింది. సముద్రం గడ్డకట్టుకుపోయింది. జీవులన్నీ నశించివుంటాయి. మళ్ళీ మన సూర్య భగవానుడు శక్తినందిస్తున్నాడు. ఇది తిరిగీ పని ప్రారంభించింది. సముద్రం కరిగింది. కంప్యూటరు అరమనుషులు యధాతథంగా పనిచేస్తున్నారు. మరి కొన్నేళ్ళలో జీవులన్నీ పునరుద్భవించవచ్చు. అంతేనంటారా ప్రొఫెసర్ గారూ?" అని ముగించాడు.

ప్రొఫెసర్ తలవూపాడు.

జగదీష్ ఆశ్చర్యంగా నరేంద్రని చూస్తూ మెచ్చుకోలుగా "భలేవాడివయ్యా. ఆటలేకాదు సైన్సు కూడా నీకు వచ్చునే" అన్నాడు.

"నేను యమ్.యస్‌సి. ఎలక్ట్రానిక్స్ మెయిన్ సబ్జక్టుతో పాసయ్యానండి. కంప్యూటర్ ప్రోగ్రామింగ్ డిప్లొమా వుంది. కాకపోతే ఆటలంటే మక్కువ ఎక్కువ. ఒలంపిక్స్‌లో ఆడిన తరవాత ఆటగాడిగానే ప్రపంచానికి తెలుసును. సైన్సు అమాత్రం తెలియదంటారా?" అన్నాడు నరేంద్ర. జగదీష్ మెచ్చుకున్నందుకు అతని ముఖం వెలిగిపోయింది.

మరో అర్ధగంటలో అశ్విని నౌకలోనికి ప్రవేశించారు.

డాక్టర్ సరోజ ఎంతో అసహనంతో ఎదురుచూస్తోంది. ఎక్కడో కోట్లాదిమైళ్ళ దూరంలో భూమి. శూన్యంలోకి భూమి దిశగా చొచ్చుకుపోతున్న విచిత్రగ్రహం. దానిమీద వాలివున్న అశ్విని నౌక. ఆ నౌకలో ఒంటరిగా తను. గంటలతరబడి ఒంటరిగా వుండాలంటే మాటలా! అదీగాక విచిత్ర గ్రహంలో రోజుకోవింత. అందులో జీవులున్నాయేమో? మీదపడి చంపేశాయేమో? ఏం ప్రమాదం జరిగిందో ననే భయం. ఇవన్నీ డాక్టర్ సరోజ అసహనానికి కారణాలయ్యాయి.

నలుగురినీ చూడగానే కోపం పోయింది. నవ్వుతూ ఎదురువెళ్ళి "ఆ గ్రహంలో సంచరిస్తుంటే మీకు కాలం తెలియదనుకుంటాను. సస్పెన్స్ భరించలేక చచ్చాననుకోండి. ఏమిటి విశేషాలు?" అని కెప్టెన్ జగదీష్‌ని అడిగింది.

జరిగినదంతా పూసగుచ్చినట్లు




చెప్పాడు. సరోజ ఆశ్చర్యంతో విన్నది.

ప్రొఫెసర్ ప్రసాద్ తను తెచ్చిన ఆహారం శాంపుల్స్ ఆమెకిచ్చాడు. మైక్రోస్కోప్‌లో పరిశీలించింది. "నో డౌట్. దిస్ ఈజ్ స్టెరైల్ ఫుడ్. ఇట్ ఈజ్ ఎడిబుల్. ఒక్క క్రిమికూడా లేదు. ఫ్రెష్‌గా వుంది" అంది.

డాక్టర్ సరోజ కొంచెం నాలుకమీద వేసుకుంది. అమృతం ఎలాగుంటుందో తెలియదు. చాలా రుచైనదని చదివింది. రుచిచూసిన తరవాత యిదే అమృతమేమో అనుకుంది.

తినమని అందరికీ కొంచెం కొంచెం యిచ్చింది. అందరూ లొట్టలువేసుకుని తిన్నారు. భూమిని విడిచిన ఎన్నాళ్ళకు ఎన్నేళ్ళకు ఫ్రెష్ ఫుడ్ తిన్నాం అనుకున్నారు.

"మొత్తం తెచ్చెయ్యవలసింది. పొరపాటు చేశాను" అని వేళ్ళు నాకసాగాడు ప్రొఫెసర్.

జగదీష్ "పోనీలెండి. రేపు మనమందరం అతిథులుగా వెళ్దాం. రేపేమిటి ఇకమీదనుంచి మన భోజనాలు అక్కడే" అన్నాడు.

నరేంద్ర అందుకుని "అయితే నౌకమీదనుంచి గ్రహంలోకి మకాం ఎత్తేద్దామా?" అన్నాడు.

సూర్యకుమార్ "మరేం, తిండికి మొహంవాచే మనం భూమినుంచి బయలుదేరాం" అన్నాడు.

అందరూ ఘొల్లున నవ్వుకున్నారు.

జగదీష్ "ఆ సంగతలా ఉంచండి. భూమినుంచి ఏదయినా వార్త వచ్చిందా సరోజగారూ" అని సరోజని చూసి అడిగాడు.

"వచ్చింది. ఒక అరగంట క్రితమే మాట్లాడారు. మీరు గ్రహసంచారానికి వెళ్ళారని చెప్పాను. తరచు మిమ్మల్ని కాంటాక్ట్ చేస్తుండమని నాకు సలహా ఇచ్చారు. నేనొక్కదాన్నే అక్కనిలో వుంటానని ఊహించారులా ఉంది. నన్ను ఎడ్రస్‌చేసి మరీ చెప్పారు. రికార్డుచేసి ఉంది వినండి. భూమిమీద దిగగానే మీకు బ్రహ్మరథం పట్టేలాగున్నారు ప్రపంచ శాస్త్రజ్ఞులు. వినండి...వినండి" అని పురమాయించింది. రికార్డర్ ఆన్‌చేశాడు జగదీష్.

"హలో జగదీష్‌గారూ! మీకొక శుభవార్త. ప్రపంచ శాస్త్రజ్ఞులు మీ పరిశోధనలో, సూక్ష్మక్రిములు, విత్తనాలు మొదలయినవి తెలుసుకుని అటువంటి గ్రహాన్ని నిర్మూలించడమంత మూర్ఖత్వం లేదని, అటువంటిదాన్ని అందరూ పరిశోధించి తెలుసుకోవాలని, దానిని భూమి కక్ష్యలోకి ప్రవేశపెట్టడం మంచిదని తెలియజేస్తున్నారు. బహుశా అది కార్యరూపం దాల్చవచ్చును. మీరు భూమిని చేరేలోగానే మరోపార్టీ తగిన రాకెట్లతో మీకు ఎదురురావచ్చును.

జగదీష్‌గారూ! తాజావార్తలతో వెంటనే మాట్లాడండి. మీ కబుర్లకోసం ఎదురు చూస్తుంటాం. ఓవర్" అని ఆగిపోయింది.

జగదీష్ ట్రాన్స్‌మిటర్ ఆన్‌చేశాడు. భూమిమీది హైదరాబాదు రోదసీ కేంద్రం అధికారులను ఉద్దేశించి "హలో జగదీష్ స్పీకింగ్. మీ వార్త విన్నాను. ఈ విచిత్ర గ్రహాన్ని భూమి కక్ష్యలోకి ప్రవేశపెడితే బాగుంటుందని మేముకూడా అనుకున్నాం. కాని దానికి ఎంతో సాంకేతిక నైపుణ్యం అవసరం. ప్రపంచ శాస్త్రజ్ఞులందరూ పూనుకుంటే అదేమంత పెద్దపని కాదేమో అని ఇప్పుడనిపిస్తోంది. నిజంగా ఈ

విచిత్రగ్రహాన్ని భూమికి కృత్రిమ ఉపగ్రహంగా ప్రవేశపెట్టాలేగాని మరో దశాబ్దంపాటు శాస్త్రజ్ఞుల మెదడులకు కావలసినంత మేత. మరో శతాబ్దంలో సాధించలేని ప్రగతి ఒక దశాబ్దంలో సాధించవచ్చును. మాకెంతో సంతోషంగా ఉంది. నా ఉద్దేశాన్ని అన్ని దేశాల శాస్త్రజ్ఞులకి తెలియజెయ్యండి. అటువంటి సదభిప్రాయం వాళ్ళకి కలిగినందుకు అశ్వనిలోని క్రూ తరఫున నా ధన్యవాదాలు తెలియజెయ్యండి. ఈరోజున మేము మరికొన్ని విచిత్రాలు చూశాం..." అంటూ ఆరోజు వాళ్ళు గుహ హర్మ్యంలోచూసిన వింత అతిథ్యాన్ని గురించి కూడా వివరించి ప్రసార యంత్రాన్ని ఆపుచేశాడు.

అందరూ జగదీష్ మాట్లాడుతుండగానే రౌండుటేబిల్‌చుట్టూ కూర్చుని ఆహారం సేవించారు. విచిత్రగ్రహవాసుల ఫలహారం రుచిచూసిన వాళ్ళకి భోజనం సయించలేదు. ఎప్పుడు మళ్ళీ గ్రహంలో ప్రవేశిద్దామా అని వాళ్ళు విశ్రమించారు. సూర్యకుమార్, సరోజ వాళ్ళకి నిర్దేశించిన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నారు.

నరేంద్ర కాలక్షేపానికి వీడియో కేసెట్ రికార్డర్‌లో పాత సినిమా వేసుకున్నాడు.

సూర్యకుమార్ వాళ్ళగదిలో టి.వి.లో ఏదైనా స్టేషన్ భూమి నుంచి ఏ చానల్ లోనైనా తగులుతుందేమోనని ప్రయత్నించాడు. ఒకటి రెండు వచ్చాయి కాని చెత్త! ఆఫ్ చేసేశాడు. రేక్‌లోని ఒక పుస్తకం వెతికాడు. చదువుకుందామనుకుంటుండగా,

సరోజ "ఒకమారు ఇలా రండి" అంది.

సూర్యకుమార్ ఆ సిగ్గు చూసి "ఏమిటి కొత్త పెళ్ళికూతురులాగ" అన్నాడు వింతగా చూస్తూ.

సిగ్గుపడుతూనే అతను దగ్గరకి రాగానే చెవిలో గుసగుసలాడింది.

సూర్యకుమార్ ఉలిక్కిపడి "రామాయణంలో పిడకల వేటలాగ ఇదొకటా?" అన్నాడు.

సరోజ "అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాం గదండి. అయినా ఇలాగైంది" అంది తల వంచుకుని.

"ఈ విషయం జగదీష్‌గారికి ఎలాగ చెప్పాలి? భూమి మీదకి చేరడానికి మరో ఏడాదికి పైగా పట్టేలాగుంది. డెలివరీ అశ్వనిలోనే అవుతుంది" అన్నాడు అయోమయంగా. మళ్ళీ తనే "లేకపోతే తీసేసుకోరాదూ..." అన్నాడు.

"వద్దండి. మనకి మధ్యవయస్సు దాటిపోతోంది. అనుకోని విధంగా జరిగిపోయింది. డెలివరీ నో ప్రోబ్లమ్. నేను చూసుకోగలను" అంది.

సూర్యకుమార్ నవ్వు తెచ్చుకుని, "అయితే రోదసీనాథ్ పుడతాడన్న మాట" అన్నాడు.

"పొండి, రోదసీనాథో లేక శూన్యకుమారో ఎవరు చూడొచ్చారు" అని డబుల్‌కాట్ మీద పడుకుంది.

సూర్యకుమార్ ఆమెని గట్టిగా కౌగిలించుకుని "నాకు రోదసీనాథ్ కావాలి; మరో మాట మాట్లాడకు" అని తన పెదవులతో ఆమె పెదవులను మూసేశాడు. సూర్యకుమార్ కళ్ళలోని సంతృప్తిని చూసింది సరోజ. సరోజ కళ్ళలోని వెలుగుని సూర్యకుమార్ గమనించాడు. దాంపత్య జీవితంలోని పరిపూర్ణతని వాళ్లు ఆ రోజు చవిచూశారు.







# 11

మెలకువ రాగానే నరేంద్ర ముందుగా నిత్యకృత్యాలు తీర్చుకున్నాడు. ఈలోగా మిగిలిన వాళ్లు కూడా తయారయ్యారు.

డాక్టర్ సరోజ "నన్ను కూడా రమ్మంటారా?" అని అడిగింది.

"ఎవరో ఒకరు ఆపరేటర్ డ్యూటీ చెయ్యాలి అనుకున్నాం గదా. మీకు ఆహారం తెస్తాంలెండి. అంతా మేమే తినెయ్యం" అన్నాడు నవ్వుతుంటూ జగదీష్.

"అందుకు కాదులెండి. నిన్నటిలాగా ఎక్కువసేపు వుండవద్దు. ప్లీజ్!" అని చెప్పింది.

"అలాగేలెండి. విశేషాలేమైనా వుంటే వైర్‌లెస్‌లో మాట్లాడండి. ఫరవాలేదు" అన్నాడు.

అందరూ గ్రహంలో ప్రవేశించారు. వాళ్లు మరింత ప్రకాశవంతంగా వెలుగుతున్న సూర్యుడిని చూశారు. భూమి మీది నుంచి చల్లని గాలి సముద్రం మీదకి వీయసాగింది. సముద్రపు కెరటాలు భూమిని తాకి నురగలు కక్కసాగాయి.

"ప్రసాద్‌గారూ! ఈ సూర్యుడు ఏకంగా ప్రజ్వరిల్లకుండా మళ్ళీ దానికదే ఆరిపోవడం వింతగా వుంది కదూ?" అన్నాడు నరేంద్ర.

ప్రొఫెసర్ ప్రసాద్ "మన సూర్యుడిలాగ ఏకంగా వెలగడానికి ఇది నిజమైనది కాదుగదా. ఇది కృత్రిమమైన సూర్యుడు. దీనిని ఒక హైడ్రోజన్ బాంబుతో పోల్చవచ్చును. కాకపోతే ఒక్కమారే పేలిపోకుండా దీనిని ఆటోమేటిక్‌గా అదుపు చేసేది ఏదో వుంది. ఈ గ్రహంలోని మొక్కలకు కిరణజన్య సంయోగక్రియకు కావలసినంత కాంతి ప్రసరించగానే దానిలోని ఏదో కంప్యూటర్ దాని అణుసంధాన క్రియని ఆపి సూర్యుడిని వెలగకుండా చేస్తుంది. ఆ వేడితోటే సముద్రం మరగడం, మేఘాలు పట్టడం ఎలాగూ జరుగుతుందనుకొండి. అందుకనే ఘన సూర్యుడితో దీనిని పోల్చలేము" అన్నాడు.

నరేంద్ర ఆశ్చర్యంగా "ఏమిటి మీరనేది. మేఘాలంటున్నారు. అయితే వర్షాలు పడతాయన్నమాట" అన్నాడు.

"పడితీరతాయి" అని ప్రొఫెసర్ ముగించాడు.

ఆలోచించుకుంటూ అందరూ టన్నల్‌లోకి దారితీశారు. ఇదివరకటిలాగా లేసర్‌గన్స్ పట్టుకోలేదు. పరిశుద్ధమైన ఆ ఆవరణలో ప్రవేశించి ఇంటల్లుళ్ళలాగా ఆ సోఫాలో కూర్చున్నారు. వాళ్లు ఊహించినట్లే మళ్ళీ టేబిల్ వచ్చింది. అదో మరొకటో విచిత్రాకారపు అరమనిషి వచ్చి వాళ్ళకి తినుబండారాలు వడ్డించి వెనక్కి జరిగి నుంచుంది.

మొదట ఆ పదార్థాన్ని వాళ్లు తెచ్చుకున్న స్పూన్లతో తినబోయారు. జగదీష్ వాళ్ళను వారించి తను ముందు కొంచెం స్పూనుతో తీసుకుని రుచి చూశాడు. అద్భుతం! వాళ్ళను కూడా తినమని అప్పుడు సంజ్ఞ చేశాడు. అందరూ భోజనం చేశారు.

కెప్టెన్ జగదీష్ తన భార్యకు ఒక కంటైనర్‌లో ముందుగానే తీసి భద్రం చెయ్యడం చూసి తృప్తి చెందాడు సూర్యకుమార్.

వాళ్ళు తినెయ్యగానే ఆ అరమనిషి టేబుల్ ఖాళీ చేసి వెళ్ళిపోయింది.

నలుగురూ లేచారు. ఈ లోగానే ఎన్నో అరమనుషలు రావడం, పోవడం చూసి ఆశ్చర్యపోయారు. 'భూమి మీద ఇంత సమర్థవంతంగా పనిచెయ్యగల డొమెస్టిక్ రోబాట్లని రూపొందించడానికి ఇంకా ఎంతకాలం పడుతుంతో' అనుకున్నారు.

'నిజానికి హనుమాన్‌తో పోలిస్తే వీళ్ళు ఎందుకూ కొరగారు. కాని వేలాది రోబాటను రూపొందించి శాశ్వతంగా పనిచేసే విధంగా ఇలాంటి వ్యవస్థని తయారు చెయ్యడానికి భూవాసులకి ఇంకా చాలాకాలం పడుతుంది. అనుమానం లేదు' అనుకున్నారు.

జగదీష్‌కి విచిత్ర గ్రహంలో సంచరించడానికి ఇంక ఎటువంటి జాగ్రత్తలూ తీసుకోవలసిన అవసరంలేదని తెలిసిపోయింది. అందరూ దర్జాగా ఆ లోపలి ద్వారంగుండా లోనికి దారితీశారు.

కళ్ళకి ఇంపైన కాంతి! ఎంతో కళాత్మకంగా లోని ప్రదేశం రూపొందించబడింది. వాళ్ళ వాస్తు విజ్ఞానానికి అందరూ ఆశ్చర్యపోయారు. 'వీళ్ళు నిజంగా అపరమయులై వుంటారు' అని కూడా అనుకున్నారు.

ఆ లోపలి గదిలోని గాజు స్తంభాలను పరిశీలించారు. లోపలైనా ఆ జీవుల అవశేషాలు దొరుకుతాయేమోనని గాలించసాగారు. సున్నగా ధూళి దుమ్ము లేకుండా వుంది. తలో దిక్కునా తిరుగుతున్నారు.

ఒక మూలగా నడుస్తున్న సూర్యకుమార్‌కి స్థూపాకారంగా వున్న గాజు కట్టడం కనిపించింది. దాని చుట్టూ తిరిగాడు. ఒక ఏంగిల్‌లో ఏదో రాతలాంటిది తళుక్కున మెరిసింది. మళ్ళీ వెనక్కి వచ్చి అదే ఏంగిల్‌లో చూశాడు. ఒకానొక క్రిటికల్ ఏంగిల్‌లో ధర్మామీటరులోని పాదరసంలాగ మళ్ళీ మళ్ళీ కనిపించింది!

"కెప్టెన్‌గారూ! ఇక్కడేదో రాత కనిపిస్తోంది. ఇటురండి" అని పిలిచాడు.

అందరూ ఒకరి తర్వాత ఒకరు చూశారు. ఆ క్రిటికల్ ఏంగిల్‌లో దానిని అతి సులభంగా గుర్తించింది నరేంద్ర ఒక్కడే! తరువాత మిగిలినవారు చూడగలిగారు.

జగదీష్ "ఇది ఈ గ్రహంలోని విశేషాలను, రహస్యాలను ఛేదించడానికి పనికి వచ్చే సూత్రంలాగుంది. మనకి దీనిని తెలుసుకోవలసిన అవసరంలేదు. ఇలాంటి ఎన్నో రహస్యాలు వుంటాయి. అవన్నీ తెలుసుకోవలసింది భూమి మీది మేధావులు. ఎలాగూ ఈ గ్రహాన్ని భూమి చుట్టూ తిరిగే ఉపగ్రహంలా మార్చాలనుకుంటున్నాం. మరో పదేళ్ళ దాకా శాస్త్రజ్ఞుల మెదడుకి మేతలాగా ఈ గ్రహం పనిచేస్తుంది. మన బుర్రలు పాడుచేసుకోవద్దు" పదండి. అన్నాడు.

ఆ స్థూపం పక్కనుంచే మరో గది లోనికి ద్వారం ఉంది. దానిలోనికి నరేంద్ర, సూర్యకుమార్ వెనక జగదీష్, ప్రసాద్ కూడా వెళ్లారు. అందులో ఇంకా చాలా స్థూపాలు కనిపించాయి. అలాంటి క్రిటికల్ ఏంగిల్ కోసం ప్రతి స్థూపాన్నీ వెతికారు. ఆ ప్రత్యేక కోణంలో చిత్రమైన రూపాలు కనిపించాయి. వివిధ




సైజుల్లో రకరకాల జీవుల ఆకారాలు కనిపించాయి.

ప్రొఫెసర్ ప్రసాద్ "చూశారా! నాకిప్పుడు అర్థమైంది. ఇందులో ప్రయాణించే ముందే దీనిని ప్రయోగించిన నాగరికులకు తాము చేరనున్న మరో ప్రపంచాన్ని చేరగలమో లేదో అనే అనుమానం వచ్చింది. అందుకనే అన్ని రకాల జీవులనూ ఈ స్ఫటిక స్థూపాలలో వుంచి గడ్డకట్టించేశారు. ఒకవేళ తాము నశించినా ఈ స్థూపాలలోని ఆకారాలను బట్టి ఈ గ్రహాన్ని ఆక్రమించిన జీవులు తమను గురించి తెలుసుకొనగలుగుతారని ఇలాగ నిక్షిప్తం చేశారు'' అన్నాడు.

కెప్టెన్ జగదీష్ "జల ప్రళయకాలంలో నోవా నౌకలో అన్ని రకాల జంతువులను దాచి వుంచినట్లు బైబిల్‌లో ఒక కథ వుంది. అలాగేనంటారా?'' అన్నాడు.

"సరిగ్గా అలాగే కాదులెండి. జల ప్రళయం నుంచి కాపాడటానికి మచ్చుకొక జాతిజంతువుని ఆ నౌకలో నోవా వుంచాడు. ఇది అలాగ కాదు. ఇవి నిర్జీవంగా వున్నాయన్నమాట. ఈ రెండింటికీ జూకి, మ్యూజియంకీ వున్నంత తేడా వుంది" అని సవరించాడు.

జగదీష్ "ఇవి మరణించాయని మీరు ఎలాగ చెప్పగలరు? ఒక నిర్ణీతకాలమో, లేక నిర్ణీత ఉష్ణోగ్రతతో, లేక నిర్ణీత వాతావరణమో లేక అన్నీ కలిసి వచ్చిన తరవాతనో ఈ స్థూపాలు కరిగి ఆ రూపాలు సజీవంగా బయటపడవని ఏముంది? ఆ స్థూపాలలోపల ఏ లిక్విడ్ నైట్రోజన్‌లోనో జీవకణాలు స్థంభించి వుండవచ్చునుగదా. మళ్ళీ ఉష్ణోగ్రత పెరగగానే జీవకణాలు యధాతథంగా పనిచేసి వాళ్ళు జీవించవచ్చును గదా" అని ప్రశ్నించాడు.

ప్రొఫెసర్ "నిజమే! దానికి కూడా అవకాశం లేకపోలేదు. అవన్నీ మీరన్నట్లు ఇంకా పరిశోధించి తేల్చవలసినవిషయాలు. ఇంక ఈ గ్రహంలో తిరిగి ఖర్చ పాడు చేసుకోవలసిన అవసరం లేదు" అని ఊరుకున్నాడు.

జగదీష్ బయటకు తోవ తీశాడు. ఇంతలో రిసీవర్‌లో "హల్లో జగదీష్ గారూ! భూమి నుంచి ఒక అర్జంటు వార్త. మనం ప్రమాదంలో పడ్డాం. అర్జంటుగా రండి" అంది.

అందరూ ఆశ్చర్యంతో విన్నారు. సూర్యకుమార్ తన భార్యకి ఏమైనా అయిందేమో అని భయపడసాగాడు.

జగదీష్ ట్రాన్స్‌మిటర్‌లో "డాక్టర్! ఆ ప్రమాదం ఏమిటో చెపుతారా?" అన్నాడు.

సరోజ "చెప్పడానికి వ్యవధి లేదు. మెసేజ్ విని మీరే ఏదో చెయ్యాలి. త్వరగా రండి. ఓవర్" అని వినిపించి ఊరుకుంది.

అందరూ ఉరుకులు పరుగుల మీద అశ్వని నౌకని చేరుకున్నారు. లోన ప్రవేశించి ఆపరేటర్ సీటులో కూర్చుని జగదీష్ రికార్డర్ ప్లే చేశాడు. అందరూ జాగ్రత్తగా వినసాగారు.

"హల్లో...దిస్ ఈజ్ స్పేస్ స్టేషన్ హైదరాబాద్. కెప్టెన్ జగదీష్‌గారూ! మీరు శ్రద్ధగా వినండి. మేము మీకు అభిముఖంగా రాకెట్ టీమ్‌ని పంపించడానికి అన్ని ఏర్పాట్లు పూర్తి చేశాం. మరో పదిహేను రోజుల్లో శ్రీహరికోట నుంచి లాంచ్ చేసేసేవాళ్ళమే. ఇంతలో ఒక విషయం బయటపడింది. మన శత్రుదేశం ఒకటి కుట్ర పన్నినట్లు తెలిసింది. మీ

అశ్వనిని ట్రాక్ చేస్తున్న రాత్రి డ్యూటీ ఆపరేటర్ మీకు అయిదు లక్షల మైళ్ళ దిగువగా మరో సిగ్నల్‌ని గుర్తించాడు. అంటే ఆరు నెలల క్రితమే వాళ్ళు ఒక శక్తివంతమైన రాకెట్‌ని అణుబాంబులతో మీరు వస్తున్న విచిత్ర గ్రహాన్ని పేల్చెయ్యడానికి పంపించారన్నమాట. అది మరో ఆరు గంటలలో విచిత్ర గ్రహాన్ని ఢీకొట్టవచ్చును. దానికి ఆధునాతన ఆటోమాటిక్ కోర్సు కంట్రోల్, గైడింగ్ సిస్టమ్ వుంది. వాళ్ళు దానిని ధృవప్రాంతాన్నే తాకేలాగ ప్రయోగించారు. మన అశ్వనితోబాటు విచిత్ర గ్రహం పేలిపోవచ్చు.

అందుచేత మీరు వెంటనే రెండు గంటల వ్యవధిలో ఆ విచిత్ర గ్రహాన్ని విడిచిపెట్టి మన అశ్వనిలో భూమికి వచ్చెయ్యండి. లేకపోతే ప్రమాదం. వెంటనే చెప్పినట్లు చెయ్యండి. ఓవర్!" అని విని

పంచి రికార్డర ఆగిపోయింది.

వార్త వింటుండగానే జగదీష్ భంగిమలో మార్పు వచ్చింది. చూసినవారు భయపడేటంత గంభీరంగా తయారైంది. అందరూ అతనినే చూస్తున్నారు. కాస్త సేపటికి మామూలువాడయ్యాడు.

అందరినీ ఉద్దేశించి "మనం ఈ విచిత్ర గ్రహాన్ని వదిలి అశ్వనిలో పోవాలట. మీ ఉద్దేశం చెప్పండి" అన్నాడు.

ప్రొఫెసర్ "భూమిమీదనుంచి ఆదేశం అలాగ వున్నప్పుడు మనం మాత్రం చేసే దేముంది చెప్పండి" అన్నాడు.

ఎవరికీ విచిత్రగ్రహాన్ని విడిచిపెట్టి వెళ్ళడం సుతరామూ ఇష్టంలేదు. ఈసగాచి నక్కలపాలు చేసినట్లు వాళ్ళందరూ ఎంతో బాధపడసాగారు.

సరేంద్ర "భూమిమీద వాళ్ళుఅలాంటి నిర్ణయం తీసుకున్నంత మాత్రాన మనం భయపడి పారిపోవలసిన అవసరం లేదు. ఈ ప్రమాదం నుంచి గ్రహాన్ని కాపాడ లేమా అన్నది ఆలోచించాలి" అన్నాడు.

సూర్యకుమార్ "మనం ఈ గ్రహం యొక్క గతి మార్చలేం. ఆ వస్తున్న రాకెట్ గైడెడ్ కోర్స్ కంట్రోల్‌తో వస్తున్నది. మనం గ్రహం గతినిమార్చినా వదలకుండా వెంటాడుతుంది గదా" అని విచారాన్ని వ్యక్తం చేశాడు.

జగదీష్ "మీరంతా ఈ అఘాయిత్యాన్ని సహించం. ఎదురు దెబ్బ తీద్దాం అంటే దీనికి తగిన ప్రాయశ్చిత్తం చేద్దాం. మనస్సువుంటే మార్గం వుండకపోదు" అన్నాడు.

సరేంద్రకి మరీ కోపంగా వుంది. ఈ అన్యాయాన్ని ఎలాగైనా ఎదుర్కోవాలనే పట్టుదలవచ్చింది. "నాకు ఈ విచిత్రగ్రహం ఎంతో అమూల్యమైనది. దీనిలాంటి కృత్రిమ గ్రహాన్ని నిర్మించ డానికి మనవాళ్ళకి మరో వెయ్యేళ్లన్నా కావాలి. అలాంటి దానిని నిర్మూలించా లనుకోవడం ఎంత మూర్ఖత్వం. ఒకచిన్న మొక్కని కూడా ప్రజోపయోగం కోసం నాటని మూర్ఖుడు, ఎవరిచేతనో నాట బడి పెరిగి పెద్దదై మధుర ఫలాల నిస్తున్న వృక్షాన్ని నరుకుతాసంటే ఊరుకోగూడదు. అలాంటివాడిని నరికి పోగులు పెట్టాలి. నాప్రాణాలైనా యిస్తాను గాని ఈ అన్యాయాన్ని సహించను" అన్నాడు ఎంతో దృఢచిత్తంతో ఊగిపోతూ. ఆ రాకెట్‌ని వదిలినవారు కనిపిస్తే లేసర్‌గన్‌తో భస్మం చేసేవాడే అను కున్నారు అతని కోపం చూసి.

ప్రొఫెసర్ ప్రసాద్, సరోజలు కూడా అదే ఉద్దేశాన్ని కలిగివున్నారు. కాని, ఆ ప్రమాదాన్ని ఎలాగ ఎదుర్కోవాలో వారికి అంతుపట్టలేదు.

నరేంద్రతో "అది సరే. కాని మనం ఇప్పుడేం చెయ్యగలం" అన్నారు.

జగదీష్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆలోచించాడు. అతనికి హనుమాన్ స్ఫురించాడు. హనుమాన్ తప్పకుండా ఈ గండంనుంచి వాళ్ళను ఆదుకోగలడనే నమ్మకం కలిగింది.

అందరితో "మార్గంవుంది. మనం హనుమాన్‌ని ఉపయోగిద్దాం. దానికి ఎదురు వెళ్ళి దారి మళ్ళించగలడు" అన్నాడు.

హనుమాన్ శక్తి సామర్థ్యాలు వాళ్లకి తెలుసును. చిక్కు ప్రశ్నకు సమాధానం తెలిసినట్లు వాళ్ల హృదయాలు తేలిక పడ్డాయి.

జగదీష్ "మీరు ఊ అనండి చాలు. దీనిలో మనకి పోయేదేమీలేదు. ఒకవేళ హనుమాన్ ఈ పనిని సాధించలేక




పోయినా మనం తప్పించుకోవడానికి ఇంకా మరోగంట వుంటుంది. మన ప్రాణాలకు భయం లేదు" అని వాళ్ళకి ధైర్యం చెప్పాడు.

అందరూ తలలు వూపారు. వెంటనే అందరూ హనుమాన్ దగ్గరకు నడిచారు. యోగనిద్రలో నుంచి మేల్కొన్నట్లు కళ్లుతెరిచాడు.

జగదీష్‌ని చూసి "ఎస్ బాస్" అన్నాడు.

జగదీష్ హనుమాన్‌ని చూసి "హను మాన్!యు మస్ట్ సేవ్ అజ్ నౌ"అన్నాడు.

"యు ఆర్ వెల్‌కమ్ సర్" అని లేచి నుంచున్నాడు.

"కమ్ విత మి" అని రాడార్ కంట్రోల్‌పేనల్ దగ్గరికి నడిచాడు. సెర్చి రాడార్‌ని పనిచేయించాడు. ఆకాశంలో భూమిదిశగా అటూఇటూ గాలించాడు.ఒక చోట ఒక టార్గెట్ తగిలింది. ఫాలో స్విచ్ నొక్కాడు. సెర్చిరాడార్‌ని ఆ టార్గెట్ ఫాలో అవసాగింది. ఆసిలోస్కోప్ మధ్యలో చుక్క కనిపించసాగింది. దాని దూరాన్ని, వేగాన్ని మీటర్లు చూసి తెలుసు కున్నాడు. గంటకు నలభైవేలమైళ్ళ వేగంతో గ్రహం దిక్కుగానే వస్తోంది. నాలుగులక్షల యాభైవేలమైళ్ళ దూరంలో వుంది. అంటే మరో అయిదు గంటల్లో విచిత్రగ్రహాన్ని ఢీకొడుతుందన్నమాట అని అర్థం చేసుకున్నాడు.

"హనుమాన్"అని పిలిచాడు.

పక్కనే కూర్చున్న హనుమాన్ "ఎస్ బాస్! వాట్ కెన్ ఐ డూ" అని పలికాడు.

"యు హేవ్ టు సేవ్ అవర్ షిప్. ఇట్ ఈజ్ ఇన్ డేంజర్" అన్నాడు.

"టెల్ మి వాట్ టు డూ" అని అడిగాడు హనుమాన్.

"హనుమాన్! మన నౌకని ఒక శత్రు దేశం అణుబాంబులతో పేల్చెయ్యాలని చూస్తోంది. నువ్వు ఆ మిసైల్ బాంబుని తోవలోనే ఎదుర్కొని దాన్ని దారి మళ్ళించాలి" అన్నాడు ఇంగ్లీషులో.

హనుమాన్ కూడా ఇంగ్లీషులోనే "అలాగే బాస్! ఏ దిశగా వెళ్ళాలో చెప్పండి.దాని లొకేషన్ చెబితే దారిమళ్ళిం చేస్తాను"అని జవాబిచ్చాడు.

"కాని ఒక ప్రమాదంవుంది. దానికి కోర్సు కరెక్షన్ చేసుకునే శక్తివుంది.నువ్వు దానిని పక్కకి తిప్పినా మళ్ళీ మన నౌక వేపే రాగలదు" అన్నాడు.

"అయితే ఏంచెయ్యమంటారోచెప్పండి"

''మొదట దానిని తొంభై డిగ్రీలు పక్కకి తిప్పి చూడు. మళ్ళీ ఆ నౌక ముఖం తిప్పుకుని గ్రహం వేపు తిరిగితే కొన్ని టూల్స్, కట్టర్స్ ఇస్తాను. దాని ఉపరితలంమీద వైరు కనిపిస్తుంది. దాన్ని కత్తిరించెయ్యి'' అని చెప్పాడు.

హనుమాన్‌కి ఏం చెయ్యాలో సరిగ్గా అర్థంకాకపోతే ఒక పట్టాన ఊరుకోడు. అడుగుతూనే వుంటాడు.

"బి స్పెసిఫిక్ సర్! దానిమీద చాలా వైర్లుంటేనో? దానిరంగు. సరిగ్గా చెప్పండి''

జగదీష్‌కి మాత్రం రంగు అదీ ఎలాగ తెలుస్తుంది. ఎలా వివరించాలా అని కాసేపు ఆలోచించాడు.

"ఫలానా వైరు అంటే-ఆనాడు సంజీవి పర్వతం మీద సంజీవి పుదక కోసం హనుమంతుడు గాలించినట్లు వెతు కుతూ కూర్చుంటావు'' అన్నాడు.

''రిపీట్ బాస్! ఐ కెనాట్ అండర్ స్టాండ్ ఎనీథింగ్" అని బుర్రకొట్టు

కున్నాడు.

అర్థంకానప్పుడు అలాగ బుర్రకొట్టు కునేలాగ హనుమాన్‌ని తయారుచేశారు. అతని మెదడులో ఆంగ్ల నిఘంటువు మాత్రమేవుంది. ఆంగ్లభాషలో లేని పదాలు వాడినప్పుడు అర్థంకావు. 'తెలుగు నిఘంటువు కూడా చిప్‌లోవుంటే ఈ బాధ లేకపోవునుగదా' అనుకున్నాడు.

జగదీష్ తన తప్పు తెలుసుకుని "అయామ్‌సారీ హనుమాన్! నువ్వు శ్రమ పడవద్దు. దాని ఉపరితలంమీద కనిపించే ప్రతి వైరూ కత్తిరించెయ్" అని అర్థమయ్యే లాగ స్వచ్ఛమైన ఇంగ్లీషులోనే చెప్పాడు.

తరువాత హనుమాన్‌కి ఒక మంచి కట్టర్, కొన్ని టూల్స్‌గల కిట్ ఇచ్చారు. ఆ మిసైల్ వస్తున్న దిశని చూపించి వెళ్ళి పని పూర్తి చేసుకురమ్మని ఆదేశించాడు జగదీష్.

హనుమాన్ అశ్వనిలోని లాక్స్ తెరుచు కుని మళ్ళీమూసుకుని బయటకు నడిచాడు.

అందరూ కంట్రోలు గదిలో హనుమాన్‌ని ట్రాక్ చెయ్యడానికి కూర్చు న్నారు.

హనుమాన్ విచిత్రగ్రహం ధృవంమీద నుంచి పైకి ఎగిరాడు. గ్రహాన్ని దాటి శూన్యంలో చాలాదూరంవెళ్ళి తన దిశను మార్చుకుని విచిత్ర గ్రహాన్ని ఓవర్‌టేక్ చేసి మిసైల్ వస్తున్న భూమి దిశగా వేగాన్ని పెంచుకుని ఎగిరిపోయాడు.

కంట్రోలు గదిలోనుంచి గమనిస్తున్న జగదీష్‌కి కాసేపు టెలిస్కోపులో కని పించి మాయమయ్యాడు.

సెర్చ్‌రాడార్ మిసైల్ బాంబర్ని వదిలి పెట్టకుండా ఫాలో అవుతూనేవుంది. ఆసిలోస్కోప్ స్క్రీన్‌మీద తెల్లని చుక్క కనిపిస్తోంది. దానినే అందరూ పరికిస్తున్నారు. వారు చూస్తుండగానే మరో చుక్క దానిపక్కనే ప్రత్యక్షమైంది. అది హనుమాన్ నుంచి వస్తున్న సిగ్నల్‌గా గుర్తించారు.

రెప్పపాటు మాని ఆ చుక్కనే గమ నిస్తున్నారు.

ప్రొఫెసర్ ప్రసాద్ "మనం అశ్వనిని టేక్ ఆఫ్‌కి రెడీ చెయ్యాలేమోగదండీ" అని గుర్తుచేశాడు.

జగదీష్ "రెడీ చెయ్యడానికేముందీ? హనుమాన్ పనికాలేదు అని వైర్‌లెస్‌లో చెప్పగానే వెనక్కి వచ్చెయ్యమంటాం. అప్పటికి అతని దూరాన్ని, వేగాన్ని బట్టి ఎంతసేపట్లో వచ్చేస్తాడో లెక్కకట్టి ఆ తరువాత మరో పావుగంటలో బయలు దేరేలాగ కౌంట్ డౌన్ ఆన్‌చేసేద్దాం. అంతే" అన్నాడు.

సరేంద్ర వాళ్ళమాటలేవీ వినడంలేదు. హనుమాన్‌నుంచి వస్తున్న పల్సెస్‌నే ఆసిలోస్కోప్‌లో చూస్తున్నాడు.

సూర్యకుమార్, సరోజ ఆతృతగా ఏమవుతుందో అని కూర్చుని ఆలోచనల్లో పడ్డారు. 21వ శతాబ్దంలో కూడా మనిషి ఏం సాధించాడు? ఇంకా భవిష్యత్తుని శాసించలేడుకదా! మరుక్షణం ఏమవు తుందో అతనికి తెలియదు. హనుమాన్ మిసైల్‌ని చేరుకుంటాడా? దానిని దారి మళ్ళించగలుగుతాడో లేదో తెలియదు గదా! అంతా సస్పెన్స్. ఇంకా విధి చేతిలో కీలుబొమ్మ మనిషి. ఏమిటి ఆ విధి? లక్, ఛాన్స్, విధి కలిసిరాలేదు. లేక పోతే ఊతపొడిచేసేవాడిని అంటుంటాడు. అంటే ఇంకా తనకి తెలియని, తన చేతుల్లో లేని దేనిమీదో ఆధారపడుతున్నట్లే గదా? ఈ విచిత్రప్రపంచం, ఈ సుందరగ్రహం నాశనం కాకూడదు అనుకుంది.




జగదీష్ ఒకమారు హనుమాన్‌ని కాంటాక్ట్ చేద్దాం అనుకొన్నాడు.

ట్రాన్స్‌మిటర్‌లో ఇంగ్లీషులో "నేను జగదీష్‌ని మాట్లాడుతున్నాను. విని పిస్తోందా హనుమాన్" అని పిలిచాడు.

హనుమాన్ "ఎస్ బాస్. గెటింగ్ యు క్లియర్లీ" అని సమాధానం చెప్పాడు.

"నీకు మిసైల్ కనిపిస్తోందా" అనడి గాడు.

"ఇంకా ఏమీ కనిపించడం లేదండి. నేను సరియైన మార్గంలోనే పోతున్నానా?" అని ఇంగ్లీషులోనే అడిగాడు హనుమాన్.

"ఆ. నువ్వు సరియైన మార్గంలోనే ప్రయాణిస్తున్నావు. ఆ మిసైల్ కనిపించ గానే చెప్పు" అని ట్రాన్స్‌మిటర్ ఆపు చేసేశాడు.

మరో పదినిమిషాల్లో హనుమాన్ గొంతు "సర్! నాకు ఆ మిసైల్ కని పించింది. మొదట అది చుక్కల్లో ఒక చుక్క అనుకున్నాను. ఒకమారు సూర్య కాంతిలో తళుక్కున మెరిసింది. ఇంక పరవాలేదు. దాని అంతు తేలుస్తాను" అన్నాడు.

"దానిని సమీపించగానే ఏమయినా డౌట్స్ వుంటే అడుగు హనుమాన్" అన్నాడు జగదీష్.

"ఈ రాజకీయాలంటే నాకు పరమ అసహ్యం. మనం ఈ గ్రహంమీద దిగి వున్నాం అని తెలిసికూడా ఆ మిసైల్‌ని ఎలా ప్రయోగించారో చూడండి" అన్నాడు సూర్యకుమార్.

"నువ్వింకా కుర్రవాడివి సూర్య కుమార్! ఈ నాయకులు తమ ఆధిక్యత నిరూపించుకోవడానికి లక్షల మందిని బాంబులను పేల్చి చంపేస్తారు. నువ్వూ, నేనూ వాళ్ళకి లెక్కా" అన్నాడు జగదీష్.

ఆ మాటలు విన్న నరేంద్ర "వీళ్ళ కన్నా జంతువులు నయం...ఆకలేస్తే అడివిలో వేటాడితింటాయి. వాటి క్రూరత్వం కంటికి కనిపిస్తుంది. ఛీ" అని అసహ్యించుకున్నాడు.

నరేంద్రని చూస్తూ "సరే. మీరు పేక్ చేసుకునేదెమైనా వుంటే చేసుకోండి. ఒక అర్ధగంటలోగా గ్రహంలోని ఏవయినా విశేషాలు సేకరిస్తే సేకరించండి" అన్నాడు.

నరేంద్ర వెంటనే లేచాడు. నిజమే. ఆ బాంబర్ ఒకవేళ నిజంగానే దీనిని పేల్చేస్తే దాని తీపిగుర్తులుగా ఏవయినా సేకరించు కోవాలి. గబగబా తన పోర్టబుల్ వీడియో కేసెట్ రికార్డర్‌ని పట్టుకుని "మీరూ వస్తారా సూర్యకుమార్‌గారూ?" అని పిలిచాడు.

"పదండి. మిమ్మల్ని ఎస్కార్ట్ చెయ్యడం మంచిదే. లేకపోతే మరో గంటలో పేలిపోతుంది. రావయ్యా అని వైర్‌లెస్‌లో పిలిచినా వస్తున్నాను అంటూనే రాకపోతే మేము చావాలి" అని తనూ ఒక స్టిల్ కెమేరాని పట్టుకుని బయలు దేరాడు.

జగదీష్, సరోజ, ప్రసాద్ హనుమాన్ నుంచి వస్తున్న సంకేతాలు గ్రహిస్తు న్నారు.

రిసీవర్‌లో హనుమాన్ గొంతు మళ్ళీ! "సర్! నాకు ఇప్పుడు ఆ రాకెట్ స్వచ్ఛంగా కనిపిస్తోంది. మరో పది నిమి షాల్లో దానిని సమీపించగలను" అన్నాడు.

జగదీష్ "హనుమాన్... అయితే నీ వేగం తగ్గించుకుని మన అశ్వని నౌక దిక్కుగా తిరుగు. ఆ మిసైల్ నిన్ను దాటిపోయేముందు వేగాన్ని పెంచుకుని దానితో సమానవేగంతో వెళ్ళి దాన్ని

పట్టుకుని తరవాత దానిమీదనే కూర్చో. తరవాత మన పని పూర్తిచెయ్యి" అని చెప్పాడు.

"ఎస్ బాస్. తరవాత మాట్లాడతాను" అని వినిపించి ఊరుకుంది.

పోర్టబుల్ టెలికాస్టింగ్ ఎక్విప్‌మెంటు ఇస్తే హనుమాన్ మొత్తం దృశ్యాన్ని నౌకకి ప్రసారం చేసేవాడే. కాని వేగంగా వెళ్ళాలి, బరువు అని పంపించలేదు జగదీష్.

హనుమాన్ మళ్ళీ రేడియోలో "సర్! నేను మీరు చెప్పినట్లే మిసైల్ మీద కూర్చున్నాను. దాని చివర పట్టుకుని మూడుసార్లు దారి మళ్ళించాను గాని మళ్ళీ మన అశ్వని వేపే తిరుగుతోంది. వైర్లు కత్తిరించెయ్యమంటారా?" అనడిగాడు.

జగదీష్ "ఎస్! ఆ పనిచేసిన తరవాత మళ్ళీ తిప్పెయ్యి" అన్నాడు.

"బాస్! చాలా కేబుల్స్ దాని బాడీమీద వున్నాయి. అన్నీ కత్తిరించడానికి టైమ్ పడుతుంది. మీరిచ్చిన టైమ్ పావుగంటే గదా" అన్నాడు.

"దాని ముక్కుచివర నుంచి వచ్చే కేబుల్‌ని ముందు కత్తిరించు. అప్పుడు తిప్పి చూడు'' అని సలహా ఇచ్చాడు.

డైరక్షన్ ఫైండర్‌నుంచి వచ్చే కేబుల్‌ని కట్ చేశాడు హనుమాన్. కోర్స్ కరెక్షన్‌కి వెళ్ళే కేబుల్ అదే! దానికింక దారీతెన్నూ తెలియకుండాపోయింది. హనుమాన్ తొంభై డిగ్రీలు పక్కకి తిప్పేశాడు దారి మళ్ళిపోయి ఏవో నక్షత్ర మండలాలవేపు పోసాగింది.

హనుమాన్ "జాబ్ ఈజ్ డన్ బాస్. మే ఐ కమ్ బాక్" అన్నాడు.

జగదీష్ సంతోషానికి అవధుల్లేవు. "థేంక్యూ హనుమాన్. యు కమ్ బాక్" అని చెప్పాడు..

హనుమాన్ పంపిన మెసేజ్‌ని గ్రహంలోని నరేంద్ర, సూర్యకుమార్ కూడా విన్నారు. వార్త వినిన వెంటనే గబగబా అశ్వనిలోకి రావడానికి బయలుదేరారు. ఈలోగానే నరేంద్ర తన కేసెట్‌లో విచిత్ర గ్రహంలోని అందాలన్నీ సమర్థుడైన కెమేరామన్‌లాగ బంధించాడు. సూర్యకుమార్ కూడా మంచి మంచి స్టిల్స్ తీశాడు.

నరేంద్ర "పోనీలెండి. ఇదీ ఒకందుకు మంచిదే. లేకపోతే మనం ఇవన్నీ రికార్డు చేసేవాళ్ళం కాదు. భూమి మీద దిగగానే అడిగే ప్రెస్‌వాళ్ళకి బోలెడు మసాలా సంపాదించాం" అన్నాడు.

వాళ్ళిద్దరూ నౌకలోనికి ప్రవేశించిన పావుగంటలో హనుమాన్ కూడా నౌకని చేరుకున్నాడు.

అందరూ హనుమాన్‌నే చూస్తున్నారు. తిన్నగా పోయి తన సీటులో కూర్చున్నాడు. 'హనుమాన్ మరమనిషి గనక సరిపోయింది. లేకపోతే ఎంత ఆర్భాటం చేసేవాడో! ఎన్ని వర్ణించి చెప్పేవాడో' అనుకుని ఆప్యాయంగా హనుమాన్ వేపు చాలా సేపు చూస్తూ వుండిపోయారు.

డాక్టర్ సరోజ కుర్చీలో ఏమీ జరగనట్లే కూర్చున్న హనుమాన్‌ని చూసింది. విగ్రహంలా కూర్చున్న అతనికి చేతులెత్తి దండం పెట్టాలనిపించింది. అందరూ గమనిస్తున్నారు. నవ్వుతారేమో అని వూరుకుంది.

జగదీష్ జరిగిన సంగతి భూమికి వర్తమానం పంపడానికి ప్రసార యంత్రాన్ని ఆన్ చేశాడు.




ఆపరేటరు సీటులో కూర్చున్న జగదీష్‌కి ఏదో ఆనందం. హనుమాన్ ఆ బాంబర్‌ని దారిమళ్ళించిన వార్త వాళ్ళకి తెలిస్తే ఎంత సంతోషిస్తారు.

"హలో! అశ్వని నుంచి జగదీష్‌ని మాట్లాడుతున్నాను. మన రోబాట్ హనుమాన్ శత్రుదేశాల మిసైల్ రాకెట్‌ని దారిమళ్ళించేశాడు. ఈపాటికి వాళ్ళు తెలుసుకునే వుంటారు. బాగానే కళ్ళు తెరిపించాం. ఇంక ఆ సంగతి మరిచి పొండి. మన అశ్వనితో సహా విచిత్ర గ్రహం మీద మేమందరం క్షేమంగానే వున్నాం. మీరు మన కార్యక్రమం ప్రకారం మీరనుకున్నట్లే రాకెట్లతో ఆ టీమ్‌ని పంపించండి. ప్రస్తుతం మా లొకేషన్, ఆ రాకెట్ టీమ్ మమ్మల్ని ఎన్నాళ్ళలో కలుసుకుంటుందో, మేం ఎన్నాళ్ళలో భూమిని చేరుకుంటామో అన్ని వివరాలూ నెక్స్ట్ ట్రాన్స్‌మిషన్‌లో చెప్పండి. ఓవర్" అని ట్రాన్స్‌మిటర్ ఆఫ్ చేశాడు.

జగదీష్ ఆపరేటర్ సీటు నుంచి లేచాడు. భూమి నుంచి కావలసిన సమాచారం సేకరించి వార్త పంపించడానికి బాగానే టైమ్ పడుతుంది. అప్పటిదాకా విశ్రాంతి తీసుకోవడం కోసం తన మంచం దగ్గరకు వెళ్ళి విశ్రమించాడు.

సురేశకుమార్, నరేంద్ర హనుమాన్ వచ్చిన తరువాత చతుర్ముఖ పురాణం వేసుకున్నారు. వాళ్ళు రోదసిలో గడిపిన నాలుగు సంవత్సరాల పైకాలంలోనూ కనీసం ఏడాదైనా పేకాట ఆడివుంటారనడంలో అతిశయోక్తి లేదు.

నరేంద్ర భూమి నుంచి తెచ్చిన ఇరవై సినిమా కేసెట్లను ఒక్కోదానిని ఏ పదిసార్లో చూసి వుంటారు. ప్రతి సంభాషణా కంఠస్థం కూడా వచ్చేసింది.

జగదీష్‌కి కాస్త కునుకు పట్టిందో లేదో భూమి నుంచి సిగ్నల్ వచ్చి ఎవరో తట్టినట్లు లేచాడు.

గబగబా ఆపరేటరు సీటులోకి వెళ్ళి కూర్చున్నాడు.

రిసీవర్‌లో "హలో! దిస్ ఈజ్ స్పేస్ స్టేషన్ హైదరాబాద్! జగదీష్‌గారూ! మీరు పంపిన వార్త అందింది. హేట్స్ ఆఫ్ టు యువర్ ఎఛీవ్‌మెంట్! భారత ప్రభుత్వం మీకు ధన్యవాదాలు పంపమంది. మనదేశం ఇంతకు ముందే ఆ శత్రుదేశానికి నిరసన తెలియజేసింది. మీరు నిశ్చింతగా వుండండి. రాకెట్లను శ్రీహరికోట నుంచి లాంచ్ చెయ్యబోతున్నాం. అవి అధునాతనమైన అణుశక్తితో పనిచేసే అతిశక్తివంతమైనవి. మిమ్మల్ని తోవలో కలుసుకుంటాయి.

మీరు అంగారక గ్రహపు కక్ష్యని కూడా దాటిపోయి భూమి దిశగా వస్తున్నారు. రాకెట్లు చేరిన తరువాత కూడా మీరు విచిత్రగ్రహం మీద వాటిని ప్రయోగానికి అనువుగా ఎసెంబుల్ చెయ్యడానికి మరో నెల రోజులు టైమ్ వుంటుంది. అప్పుడుగాని మీరు భూమ్యాకర్షణ పరిధిలోనికి రారు. అన్నీ అనుకూలిస్తే విచిత్రగ్రహాన్ని భూమిచుట్టూ ఉప

గ్రహంగా ప్రవేశపెట్టడం అంత పెద్ద కష్టమేమీకాదు. ఈలోగా మీరు, సూర్యకుమార్ కలిసి లేండింగ్‌కి చెయ్యవలసిన ఏర్పాట్లు చూడండి. ఓవర్" ప్రసారం ఆగిపోయింది.

జగదీష్ అందరినీ రౌండ్ టేబుల్ చుట్టూ సమావేశపరిచాడు.

"భూమినుంచి వచ్చిన వార్త విన్నారు గదా! ఇంక మనకి ఈ విచిత్రగ్రహాన్ని భూమిచుట్టూ తిరిగేలా ప్రవేశపెట్టేటప్పుడు తప్ప ఏమీ పనివుండదు. అంతే దాదాపు నాలుగు నెలలు గోళ్లుగిల్లుకుంటూ కూచోవాలి. కాకపోతే మనం అవతలి ధృవాన్ని





ఇంకా చూడలేదు. ఆ ధృవంమీదకి
గ్రహాంతర్యాగాన్ని, బ్రిడ్జిమీదనుంచి సము
ద్రాన్ని దాటి దక్షిణ ధృవపు లాక్‌లను
దాటితే ఆ ధృవం చేరుకుంటాం. రాకెట్
లను ఎలాగ దానిమీద లేండ్ చెయ్యాలి,
వాటిని ఎలాగ ప్రతిష్ఠించాలి అన్నదాని
గురించి పథకం తయారుచెయ్యాలి. రేపే
బయలుదేరుదాం" అన్నాడు.

సూర్యకుమార్ జగదీష్‌నిచూసి "సర్
దేర్ ఈజ్ ఎన్ ఎనౌన్స్‌మెంట్"
అన్నాడు.

జగదీష్‌కి అర్థంకాలేదు. ఏమి ఎనౌన్స్‌మెంటు అనుకున్నాడు. "చెప్పండి ఏమిటది?" అన్నాడు.

"నేను చెబితే అంత గొప్పతనం వుండదు. మీరే ఊహించి తెలుసుకోవాలి" అన్నాడు.

కాస్త ఆలోచించి "దేనికి సంబంధించిందో కనీసం చెప్పండి" అన్నాడు.

సూర్యకుమార్ సరోజని ముందుచూసి తరవాత జగదీష్‌నిచూస్తూ "సరోజకూ, నాకూ సంబంధించినది" అన్నాడు.

అయినా జగదీష్‌కి అర్థంకాలేదు. నాలుగేళ్ళలో ఎప్పుడూ ఇలాంటి క్విజ్ యివ్వలేదు. "ప్రొఫెసర్‌గారిని అడగండి ముందు" అన్నాడు.

నరేంద్ర, ప్రసాద్ కూడా చెప్పలేకపోయారు. జగదీష్ కూడా "లక్షాతొంభై ప్రకటనలుంటాయి. ఎలాగ తెలుస్తాయండి. మీరే చెప్పండి" అన్నాడు.

సూర్యకుమార్ సరోజ వేపు చూసి నవ్వుతూ "నువ్వు చెప్పు సరోజా" అన్నాడు.

అంతవరకూ ఏమి ఎనౌన్స్‌మెంటో ఆమెకే అర్థంకాలేదు. డాక్టరు సరోజ గర్భవతి అన్న విషయాన్ని అయిదో నెల వస్తున్నా గుప్తంగానే వుంచారు. కాని ఆ సంగతి ఆమె మరిచిపోయింది.

"మరీబాగుంది నాకేం తెలుసునండి. మీరేదో అనుకుని నన్ను చెప్పమంటే నేనెలాగ గ్రహించగలను" అంది అయోమయంగా.

సూర్యకుమార్ చూపులు తన కడుపు వేపు వెళ్ళడం చూసింది. ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది.

సిగ్గుపడుతూ "మీరే చెప్పండి" అని చివాలునలేచి వెళ్ళిపోయింది గదిలోకి.

అప్పటికే విషయం అర్థమైపోయింది అందరికీ. జగదీష్ నవ్వుతూ "నాన్నవి కాబోతున్నావన్నమాట. గుడ్‌న్యూస్. లెట్ అస్ సెల్‌బ్రేట్" అన్నాడు.

పేరు గురించి తర్జన భర్జనలు జరిగాయి. మగపిల్లవాడైతే 'అంతరిక్ష ప్రసాద్', ఆడపిల్లయితే 'శూన్యరేఖ' అని నిర్ణయంచేసేశారు.

నరేంద్ర సూర్యకుమార్‌ని చూసి "నువ్వు చాలా అదృష్టవంతుడివి. ప్రపంచానికి మొట్టమొదట శూన్యంలో పుట్టిన బిడ్డని యివ్వబోతున్నావు. చరిత్రలో నిలిచిపోతుంది. యూరీగగరిన్, నీల్ ఆరమ్‌స్ట్రాంగ్ చరిత్ర పుటలకెక్కారు. మనం ఎన్నేళ్ళు రోదసిలో కొట్టుకున్నాం. మనకేమైనా పేరా ఊరా? ఏమీ చెయ్యకుండానే చరిత్ర పుటలకెక్కుతాడు నీ కొడుకు. కంగ్రాట్యులేషన్స్" అని ప్రశంసించాడు.

నిజమే. సూర్యకుమార్‌కి అంతవరకూ స్ఫురించనేలేదు. సూర్యకుమార్ హృదయం పులకించింది. తనని మించిన పేరు ప్రఖ్యాతులు తన కొడుకుకి లభించాలని ఏ తండ్రి కోరుకోడు. ఈ విషయం వింటే సరోజ మరీ పొంగిపోతుంది. ఈమారు ఏకాంతంలో సరోజా, తనూ ఈ కబుర్లే ఆడుకోవాలి అనుకున్నాడు.

* * *

దక్షిణధృవాన్ని చేరడానికి విచిత్ర గ్రహంలో ప్రవేశించిన నలుగురు వ్యోమగాములకి లోపల ఎంతో మార్పుకొట్టవచ్చినట్లు కనిపించింది. మొదట వాళ్ళుచూసిన దానికీ, దీనికీ పోలికేలేదు. గాలివెయ్యక ఏ చెట్టు ఆకూ కదలక ఉక్కతో చచ్చిపోతున్న వాతావరణానికీ, తలలూపుతున్న చెట్లూ, పైరుపొలాల మీదనుంచి

 

వీస్తున్న చల్లగాలి గల వాతావరణానికీ ఉన్నంత తేడా కనిపించింది.

సముద్రంమీది నుంచి చల్లనిగాలి వీస్తోంది. ఎంతో ఆహ్లాదంగా వుంది. చక చకా సముద్రాన్ని చేరుకున్నారు. నడు స్తూనే అటూఇటూ గమనిస్తూ ముందుకి సాగిపోతున్నారు. వాళ్ళ గమ్యం బ్రిడ్జి మీదుగా సముద్రాన్ని దాటి లాక్ తలుపులు దాటి అవతలి ధృవాన్ని చేరడమే వాళ్ళ ధ్యేయం గనుక ఎక్కడా ఆగదలచుకో లేదు. బ్రిడ్జిమీదుగా సాగిపోయారు. సగం దూరం వెళ్ళినతరవాత జగదీష్ వాళ్ళని ఆపేశాడు.

నలుగురూ వంతెనకి అటునుంచీ ఇటునుంచీ సముద్రాన్ని పరిశీలించారు. అందరూ బైనాక్యులర్స్‌తో దూరంగా ఆకాశం దిశగా కుడివేపునా, ఎడమవేపునా సముద్రాన్ని దాటడానికి నిర్మించిన రెండు వారధులను కూడా చూశారు.

జగదీష్ "చూశారా! ఈ వంతెనలు బాణంబద్దలాగా మధ్యని వొంగి ఉన్నాయి. మనబరువు ఇప్పుడు చాలాతగ్గింది. వంతెన ఆ చివరగాని, ఈ చివరగాని పంచకిలోలు తూగేవస్తువు ఇక్కడ 25కిలోలుకూడా తూగదు. దానివలన వంతెన ఎన్నేళ్ళకీ చెడిపోదు" అని వాళ్ళ వాస్తువిజ్ఞానానికి విస్తుపోయాడు.

సూర్యకుమార్ "అందుచేతనే మధ్యన ఒక్క స్తంభంలేకుండా ఇది నిలిచి ఉంది. ఒకవేళ దీనిని పేల్చాలన్నా కిందినుంచి పైకే పేల్చాలిగాని పైనుంచి ఎంతశక్తితో ఎంతబరువును వుంచినా ఇది కూలదు" అని తన సాంకేతికమైన ఇంజనీరింగు తెలివితో అర్థంచేసుకుని వివరించాడు.

బ్రిడ్జి దాటి దక్షిణ సాగరతీరాన్ని చేరు కున్నారు. దక్షిణతీర భూమిని గురించి మళ్ళీ ప్రత్యేకంగా పరిశీలించవలసినదేమీ లేదనివాళ్ళకి అనిపించింది. రోడ్డు పట్టుకుని లాక్సుదగ్గరకి సాగిపోయారు.

నరేంద్రకి చెమటలు పట్టసాగాయి. ఎంతో ఉక్కగా వుంది. అందరినీ ఉద్దే శించి "మీకు కూడా చెమటలు పడు తున్నాయా?" అని అడిగాడు.

నిజానికి అందరికీ చెమటలు పట్ట సాగాయి. అలసిపోయాడు అనుకుంటారని ఎవ్వరూ బయటపడలేదు. నరేంద్ర చెప్పగానే అందరూ బయటపడ్డారు.

ప్రొఫెసర్ ప్రసాద్ "ఇది మనం అధికంగా శ్రమించడంచేత పట్టిన చెమట కాదని నా ఉద్దేశం. గాలిలో తేమ ఎక్కు వగా వుండివుంటుంది" అన్నాడు.

సూర్యకుమార్ "అవును. మన భూమి మీదకూడా వర్షం వచ్చేముందు ఇలాగే చెమటలు పడతాయి. ముఖ్యంగా సముద్ర తీరప్రాంతాలలో ఇదెక్కువ" అన్నాడు.

జగదీష్ "డిస్కషన్సు తరువాతచెయ్యొ వచ్చు. త్వరగా నడవండి. ఇంకా లాక్స్ తెరవాలి" అని తొందరచేశాడు.

"మీరు మెల్లగా నడిచిరండి. నేను ముందువెళ్ళి లాక్స్ తెరుస్తాను" అని గబ గబా ముందుకిసాగాడు నరేంద్ర.

కెప్టెన్ జగదీష్, ప్రసాద్, సూర్య కుమార్ లాక్ దగ్గరికి చేరేసరికి నరేంద్ర చెమటలు కక్కుతున్నాడు. "లాక్ తెరుచు కోవడంలేదు సర్" అన్నాడు రొప్పుతూ.

అందరూ ప్రయత్నించారు. వాళ్ళు ఎంత గింజెట్టినా రాలేదు.

జగదీష్ "మనం పొరపాటు చేశాం. హనుమాన్‌ని కూడా తేవలసింది" అన్నాడు.

నరేంద్ర "ఇప్పుడయినా వైర్‌లెస్‌లో చెప్పితే సరోజగారు పంపిస్తారు" అన్నాడు.

జగదీష్ "ఒద్దు. మనం కవర్ చేస్తూ తీసుకురావలసి ఉంటుంది. లేకపోతే అర మనుషులు ఎటాక్ చేస్తాయి" అని భయం వ్యక్తంచేశాడు.

సూర్యకుమార్ "ఫరవాలేదు.. లాక్ దాటి లోన ప్రవేశించిన వెంటనే పదడుగులఎత్తునుంచి ఎగురుతూ రమ్మంటే సరి" అనిచెప్పి మార్గాంతరం సూచించాడు.

అలాగే డాక్టర్ సరోజకు వైర్‌లెస్‌లో చెప్పి హనుమాన్‌ని పంపమన్నాడు. అయిదు నిమిషాలలో ఎగురుకుంటూ వచ్చాడు.

హనుమాన్‌ని అందరూ గమనించారు. మూతి దగ్గర మెటల్ క్రాస్త కరిగి మళ్ళీ ఘనీభవించినట్లు కనిపించింది.

జగదీష్ "హనుమాన్! నీ మూతి కేమైంది?" అని ఇంగ్లీషులో అడిగాడు.

హనుమాన్ "నేను సముద్రం మీద నుంచి ఎగిరి వస్తుండగా మధ్యలో వేడిగా తగిలింది. వెంటనే కిందికి వచ్చేసి నా ఎత్తు తగ్గించుకున్నాను" అన్నాడు.

జగదీష్ అందరివేపూ చూస్తూ ఆశ్చర్యంగా "మనకి కనిపించకపోయినా కృత్రిమ సూర్యుడి వేడి గ్రహం మధ్యలో వుంటుందన్నమాట'' అని వాళ్ళకు వివరించాడు.

హనుమాన్‌కి లాక్ తెరవమని పురమాయించారు. మొదట తెరుచుకోలేదు. కొంచెం కొంచెం శక్తి పెంచుకుంటూ పోయి లాక్ తెరిచేశాడు. ఈలోగా వాళ్ళ మీద వెలుగు పడింది. సూర్యుడు గ్రహం మధ్యలో ప్రకాశించాడు. దూరంగా ఉత్తర ధృవం యొక్క తలుపులు, మూడు లాక్ తలుపులూ బైనాక్యులర్స్‌లో కనిపించాయి.

అందరూ లాక్స్ దాటి దక్షిణ ధృవం మీదకి అడుగుపెట్టారు. చిత్రం! రెండు ధృవాలకీ ఎటువంటి తేడాలేదు "ఆ నల్లటి ఆకాశంమీది చుక్కలే ఇది ఉత్తర ధృవం కాదు అని సాక్ష్యం చెప్పాలి తప్ప రెండు ధృవాలకీ ఏమీ తేడా లేదు" అన్నాడు జగదీష్.

నరేంద్ర "మనకైతే మరో సాక్ష్యం వుందిలెండి. దానిమీద మన అశ్వని నిలబడి లేదు. సమకోణత్రిభుజం కాళీగానే ఉంది" అన్నాడు.

సూర్యకుమార్ "హనుమాన్‌ని మనతో గ్రహంలోనుంచే తీసుకువెళదామా?" అని జగదీష్‌ని అడిగాడు.

జగదీష్ "వద్దు. మనం కవర్ చేసుకుంటూ నడవాలి. ఈ ధృవం మీదనుంచి ఆ ధృవం మీదకు ఎగిరిపోగలడు'' అని హనుమాన్‌కి సూచనలు చేశాడు. చూస్తుండగానే శూన్యంలోకి హనుమాన్ ఎగిరిపోయాడు.

మరో అర్ధగంటసేపు రాబోయే రాకెట్లను ఏయే స్థలాలలో దిగించాలి, వాటిని సేఫ్‌గా లేండ్ చెయ్యాలంటే ఎటువంటి చర్యలు తీసుకోవాలి అనే విషయాలను చర్చించుకున్నారు.

సూర్యకుమార్ "మనం ఇప్పుడే ఇంత తలబద్దలు కొట్టుకోవలసిన అవసరం లేదు. వాటిని రానివ్వండి. వాటిని నేను లేండ్ చేయిస్తాను.ఆ బాధ్యతని నాకొదిలెయ్యండి" అన్నాడు.

జగదీష్ "ఆ రాకెట్లలో కూడా మంచి సమర్థులే వస్తారు. నువ్వు చెప్పిందే నిజం. అందరం కలిసి ఈ పనిని దిగ్విజయం చేద్దాం'' అన్నాడు.

రిసీవర్‌లో సరోజ గొంతు వినిపించింది. "కెప్టెన్ జగదీష్‌గారూ! హనుమాన్ ఇక్కడికి భద్రంగానే చేరాడు. రెండు గంటలు దాటిపోయింది. మీరు కూడా

 

ఇంక బయలుదేరి వచ్చెయ్యండి'' అంది. జగదీష్ సూర్యకుమార్‌ని సమాధానం చెప్పమన్నట్లు సంజ్ఞ చేశాడు.

సూర్యకుమార్ "ఎస్ డార్లింగ్! మరో గంట రెండు గంటల్లో నీ ముందుంటాం. నువ్వు అవతలా, మేము ఇవతలా బాగానే వున్నాం. బయలుదేరుతున్నాం. కంగారు పడవద్దు. ఓవర్" అని ఊరుకున్నాడు.

లాక్స్ ఈమారు తేలిగ్గానే తెరుచుకున్నాయి... మూసుకున్నాయి. చాలా కాలంగా జామ్ అవడంచేత బిగుసుకుపోయి వుంటాయి అనుకున్నారు.

గబగబా రోడ్డుపట్టి నడవసాగారు.

ఉన్నట్లుండి మేఘాలు అలుముకున్నాయి. వర్షంవచ్చే సూచనలు కనిపించాయి. అప్పటికి బ్రిడ్జిమధ్యకే వచ్చారు. మరికొంచెం వేగం పెంచారు. అయినా వాళ్ళు వర్షానికి దొరికిపోయారు. చిన్న చిన్న చినుకులతో మొదలైన వర్షం బాగానే పడింది. తన రుమాలుని తడిపి, ఆ నీటిని సీసాలో నింపాడు ప్రొఫెసర్ ప్రసాద్.

జగదీష్ "అరె... ఈ నీరు మంచిదేనేమో! ఏదైనా తెస్తే పట్టేవాళ్లం" అని విసవిసలాడాడు.

నరేంద్ర "ఈమారు కావలసినంత నీరు పడదాంలెండి. ఇది వర్షాకాలంలాగే వుంది" అన్నాడు.

సూర్యకుమార్ "ఇక్కడ వర్షాకాలం, శీతాకాలం, ఎండాకాలం అని ఋతువులు వుండవు బాబూ! గ్రహంలో వాతావరణం తప్పకుండా నెల మూడు వానలూ పడేలాగ దీనిని రూపొందించారు దీని సృష్టికర్తలు. ఇది రామ రాజ్యానికి మరో పేరు తెలిసిందా?'' అన్నాడు.

అదీ యిదీ మాట్లాడుకుంటూ ఉత్తర సముద్ర తీరాన్ని చేరుకున్నారు.

నరేంద్ర వాళ్ళని వదిలి సముద్రం ఒడ్డున అటూ యిటూ కాస్త సరదాగా పరుగెత్తాడు. ఒళ్లు మరిచిన ఉత్సాహంలో గ్లోవ్స్ లేకుండా కుడి చేత్తో సముద్రపు నీటిని తియ్యబోయాడు. నీటికి చెయ్యి తాకిందో లేదో పెద్ద షాక్ తగిలినవాడిలాగ అరిచాడు. సూర్యకుమార్ గబగబా అతని వద్దకు పరుగెత్తాడు. అతనిని జగదీష్ తరువాత ప్రసాద్ వెంబడించి పరుగెత్తారు.

కిందపడి "అమ్మా...ఏసిడ్, పాయిజనస్ వాటర్'' అని దొర్లసాగాడు.

గ్లోవ్స్ చేతులతో ఇందాకటి రుమాలుతో మణికట్టు దగ్గర గట్టిగా బిగించి కట్టాడు సూర్యకుమార్. ముగ్గురూ భుజాల మీద నరేంద్రని మోస్తూ పరుగులూ ఉరకలు మీద అశ్వనిలోనికి చేర్చారు.

డాక్టర్ సరోజ నౌకలో ప్రవేశించిన వారిని చూసింది. నరేంద్ర గిజగిజా గింజుకుంటున్నాడు.

జరిగిన సంగతి సరోజకు వివరించారు. వెంటనే తన మెడిసిన్ బేగ్‌లోనుంచి ఒక ఇంజక్షన్ తీసి ముందు నరేంద్రకి చేసింది. చేతికి ఒక మందు రాసింది. ఐదు నిమిషాలలో గుణం కనిపించింది. అరవడం మానేశాడు. తన చెయ్యి చూసుకున్నాడు. కుడిచేతి వేళ్లు సగం దాకా కాలిపోయాయి. పొక్కులు కూడా వచ్చాయి. నరేంద్రని రెస్టు తీసుకోమన్నారు. అతను పడుకొన్నాడు. సరోజ చేసిన మత్తు ఇంజక్షన్ అతని మీద పని చేసింది. అతనికి నిద్రపట్టేసింది.

జగదీష్ విచారంగా "మనం రోదసీ యాత్ర మొదలు పెట్టిన నాటినుంచీ అంటే దాదాపు ఐదేళ్లు కావస్తోంది. ఇంతవరకూ

వివ్వరం బ్రతుకు చికలేదు. ఈనాడు ఈ ప్రమాదం జరిగింది. ఇదే మొదటి ఇంజక్షన్ అనుకుంటాను. అవునుకదండీ" అన్నాడు.

"అదిసరే, ఈ మందేదో భలేగా పని చేసింది. నీ దగ్గర మందులుండవేమో అనుకున్నాను" అని అడిగాడు సూర్య కుమార్.

డాక్టర్ సరోజ "నేను ముందే ఆ క్రిముల మీద పరిశోధన చేసి సిద్ధంగా వున్నాను. ప్రొఫెసర్‌గారు తెచ్చిన క్రిములను పరిశీలించసాగాను. అని ఒక టెస్ట్ ట్యూబ్‌లో అభివృద్ధిచెందసాగాయి. సగం క్రిముల మీద ఏంటీ బయొటిక్స్ వాడాను. ఒకటి పని చేసింది. దానిని నీటిలో కలపగానే మొత్తం క్రిమి చచ్చింది. నరేంద్ర తాకింది ఆ సముద్రం నీటినే గదా! అవే ఎటాక్ అయినట్లు తెలుసుకుని ఆ మందు రాశాను. ఆ క్రిమి కాస్త చచ్చి అతను స్వాస్థ్యత పొందాడు. మరొక విషయం కూడా నా పరిశోధనలో తేలింది. ఆ ట్యూబ్ నుంచీ ప్రాణవాయువు బయటపడసాగింది. నా ఉద్దేశం ప్రకారం ఈ గ్రహం ప్రాణ వాయువుతో నిండి వుండడానికి కారణం ఆ క్రిములే! శాస్త్రజ్ఞులు ఇంకా ఈ విషయాన్ని బాగా పరీక్షించి ధృవపరచాలనుకొంది" అని చెప్పింది.

ప్రసాద్ ఏదో స్ఫురించినవాడిలాగ "డాక్టరు గారూ! ఇందాక జగదీష్‌గారు చెప్పిన తరువాత నాకు జ్ఞాపకం వచ్చింది. నాకు ఏడాది కొకమారైనా జలుబు చేసేది. ఇక్కడ ఈ ఐదేళ్ల నుంచీ తుమ్మనేలేదు. కారణం ఏమిటంటారు" అని తన సందేహాన్ని వ్యక్తం చేశాడు.

సరోజ "మీ మాట అటుంచండి. మావారు ఎక్కడో ఆమడ దూరంగా ఎవరైనా తుమ్మితే ఇక్కడ సమాధానంగా తుమ్మేవారు. అతనికి రొంప అంత ఎలర్జీ. అయినా ఈ అశ్వనిలోకి వచ్చిన తరువాత ఒక్కమారు కూడా జలుబు చెయ్యలేదు. దానికి కారణం మనం భూమి నుంచి స్టెరిలైజ్ చెయ్యబడి ఇందులోకి వచ్చాం. భూమి మీది వాతావరణంలో ఎంతో కాలుష్యం. అంతా పొల్యూషన్. ఒకరి నుంచి ఒకరికి ఫిజికల్ కాంటాక్ట్ వల్లా ఇతరత్రా బోలెడు జబ్బులు సంక్రమిస్తాయి. ఇక్కడ అలాంటి అవకాశం లేదుగదా! అందుకే ఆ క్రిమిని చూడగానే మీరంతాజాగ్రత్తగావుండాలని చెప్పాను" అని ప్రసాద్ అనుమానాన్ని నివృత్తి చేసింది.

ప్రొఫెసర్ తను తెచ్చిన నీటిని ఆమెకి ఇచ్చాడు.

పరిశోధించి "ఇది ప్యూర్ వాటర్ హెచ్ టూ ఓ.. శుభ్రంగా తాగవచ్చును" అని చెప్పింది. ప్రొఫెసర్ ప్రసాద్ కూడా ఆమె చెప్పినది నిజమేనని ఫైండింగ్స్ చూసి గ్రహించాడు.




భూమి నుంచి రాకెట్ను తెస్తున్న టీమ్ బయలుదేరి మూడునెలలు కావస్తోంది. మరో వారం పది రోజులలో వాళ్లు విచిత్ర గ్రహంమీద దిగుతారు. అందరూ వెయ్యి

కళ్ళతో ఎదురుచూస్తున్నారు.

డాక్టరు సరోజను నెలలు నిండాయి. ఆమె ఇదివరకటిలాగా వాళ్ళ గది విడిచి రావడంలేదు. కావలసినవన్నీ ఆ గదిలోకే అందిస్తున్నాడు సూర్యకుమార్.

ఒకరోజు అశ్వనిలోని అందరూ నిద్ర పోతున్నారు. ఉన్నట్లుండి జగదీష్‌కి మెలకువ వచ్చింది. సూర్యకుమార్, సరోజల గదిలో మూలుగులు వినిపించ సాగాయి. జగదీష్ లేచినుంచుని అందరినీ లేపాడు. ప్రసాద్, నరేంద్ర కూడా లేచారు. కొండల్లను పిండి చెయ్యగల ధీమంతులు ఏమి చెయ్యాలో తోచక గది బయట పచార్లు చెయ్యసాగారు.

రాను రాను సరోజ ఎక్కువ బాధ పడుతున్నట్లు వాళ్ళకి అర్థమైంది. జగదీష్ తలుపుతట్టి సూర్యకుమార్‌ని పిలిచాడు. సూర్యకుమార్ తలుపు సగం తెరిచి బయటికి చూశాడు. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.. మరో ఆడదిక్కులేని సమయంలో సరోజకి పురుడురావడం, ఆమె బాధలు పడడం అందరికీ ఆవేదన గానే వుంది.

ఓ అరగంట తరువాత పసిపిల్లవాడి రోదన వినిపించింది. అందరూ ఊపిరి పీల్చుకున్నారు. మరో పదినిమిషాలలో సూర్యకుమార్ బయటికివచ్చి "బోత్ ఆర్ సేఫ్...బోయ్" అన్నాడు నవ్వుతూ.

"కంగ్రాట్యులేషన్స్" అని అందరూ ఏక కంఠంతో అన్నారు. జగదీష్ భూమికి వార్త వెంటనే పంపేశాడు.

పదినిమిషాల్లో సమాధానం వచ్చింది. అందరూ ఎంతో సంతోషించారు. ప్రపంచంలోని పత్రికలన్నీ ఆ వార్తని ప్రముఖంగా ప్రచురించాయని తరువాత తెలిసింది.

మూడు రోజుల తరువాత డాక్టరు సరోజ నవ్వుతూ అందరికీ కనిపించింది. ఆమె చెప్పిన మందులనే క్రమం తప్పకుండా బలవంతంగా వాడించాడు సూర్యకుమార్. పొత్తిళ్ళలో పసిపాపని ఆడించిన పాపాన ఎవ్వరూ పోలేదు.

ముందుగా జగదీష్ బాబుని తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు. "నాటీ బోయ్. పుట్టినవాడివి మరో రెండేళ్ళు ముందే పుట్టక పోయావురా. మాకు టైమ్‌పాస్ అయ్యేది" అన్నాడు.

ఒకరు తరువాత ఒకరు మెల్లగా ముద్దు పెట్టుకున్నారు. ఆ పసిపాపడు విశ్వ రహస్యం తెలిసినవాడిలాగ కళ్ళు మూసుకుని వాడిలో వాడే నవ్వుకోసాగాడు.

* * *

విచిత్రగ్రహంమీద రాకెట్లు దిగడానికి మరొక రోజు మాత్రమే వ్యవధి వుంది. తగిన పథకం రూపొందించమని భూమి నుంచి గంటక్రితమే వైర్‌లెస్ మెసేజ్ వచ్చింది. జగదీష్, సూర్యకుమార్ విశ్రాంతి లేకుండా దాని గురించి ఆలోచించసాగారు. విచిత్రగ్రహంయొక్క ఉత్తర ధృవం మీద అశ్వని దిగింది. విచిత్రగ్రహంయొక్క దక్షిణ ధృవం భూమివేపు వుంది. గనక ఉత్తర ధృవంమీద అశ్వని విచిత్రగ్రహాన్ని వెంబడించి దానిమీద దిగింది.

అలాగే వచ్చే రాకెట్లను లేండ్ చెయ్యడం తేలికే కాని ఆ రాకెట్లను దక్షిణ ధృవానికి తరలించాలంటే గ్రహంలోపల నుంచి లాక్‌లు దాటించి తీసుకుపోవాలి. రాకెట్లు లాక్‌లలో నుంచి దూరవు. అందుకని దక్షిణధృవం మీదనే దించాలి. అంటే విచిత్రగ్రహాన్ని రాకెట్లు దాటిపోయి వేగాన్ని తగ్గించుకుంటూ దక్షిణధృవం

మీద దిగవలసివుంటుంది.

జగదీష్ సూర్యకుమార్‌తో "దక్షిణ ధృవం మీద దిగడం కష్టంతో కూడుకున్న పనే. ఏంచేద్దాం" అన్నాడు.

సూర్యకుమార్ "చెయ్యటానికి ఇంకా టైమ్ వుంది. ముందు రాకెట్లు రానివ్వండి. వాళ్ళు, మనం ఆలోచించుకుని చేద్దాం" అన్నాడు.

జగదీష్ ట్రాన్స్‌మిటర్‌లో భూమిని కాంటాక్ట్ చేశాడు "హలో! దిస్ ఈజ్ అశ్వని కెప్టెన్ జగదీష్ స్పీకింగ్. స్పేస్ స్టేషన్ హైదరాబాద్..డూయు రిసీవ్ మి" అని ఆగాడు.

గంటకు యాభైవేలమైళ్ళ వేగంలో విచిత్రగ్రహం కోట్లాదిమైళ్ళు ప్రయాణించి భూమికి దగ్గరౌతుండడంచేత టైమ్‌లేగ్ బాగా తగ్గిపోయింది. ఇప్పుడు రేడియో సిగ్నల్ భూమిని చేరడానికి మూడు నిమిషాలు మాత్రమే తీసుకుంటోంది. ఆరు నిమిషాలలో సమాధానం రావాలి. కాని అయిదు సెకెండలలోనే–

"హలో! రిసీవింగ్ యు. దిస్ ఈజ్ రాకెట్ ఫోర్స్. క్రూ కమాండర్ వెంకటాచలంని మాట్లాడుతున్నాను. జగదీష్ గారూ! గుడ్ డే. మనం మరో రోజులో కలుసుకోబోతున్నాం. మేము కూడా విచిత్రగ్రహం మీద దిగి దాని విచిత్రాలు

చూడబోతున్నాం" అని వినిపించింది.

జగదీష్‌తో బాటు అందరూ విన్నారు. వెంకటాచలం వాళ్ళందరికీ తెలుసును- ఒక్క డాక్టర్ సరోజకు తప్ప. వాళ్లు భూమికి సంకేతం పంపితే మధ్యలో వీళ్లు వెతుకుతున్న తీగలాగ కాలికి తగిలారు.

జగదీష్ "హలో వెంకటాచలం గుడ్‌డే! మళ్ళీయిన్నాళ్ళకు మనం యిలా కలుసుకోనబోవడం చాలా సంతోషం. యు ఆర్ ఆల్ వెల్‌కమ్. విచిత్రగ్రహం మిమ్మల్ని ఆహ్వానిస్తోంది" అన్నాడు.

ఇంతలో భూమినుంచి "హలో జగదీష్ గారూ! మీ పిలుపు వినిపించింది. మీరు రాకెట్ ఫోర్స్‌ని కాంటాక్ట్ చేస్తుండండి. ఇదే ఫ్రీక్వెన్సీ. ఓవర్" అని వినిపించింది.

తరువాత వెంకటాచలం వైర్‌లెస్‌లోనే అతనితోబాటు వస్తున్న ఇతర వ్యోమగాములతో పరిచయం చేశాడు.

రాకెట్లను రిమోట్ కంట్రోలు ద్వారా కూడా దించడానికి అవకాశముంది. కాని వాటిని తగిన విధంగా విచిత్రగ్రహం మీద అమర్చడానికి మనుషుల అవసరం వుండడం చేత మనుషులని కూడా వాటిలో భూమినుంచి పంపడం జరిగింది.

* * *

మరునాడు రాకెట్లు ఆకాశంలో కనిపించాయి. వాటిని విచిత్రగ్రహం మీద దించే ఏర్పాట్లు జగదీష్ సూర్యకుమార్‌కి ఒప్పజెప్పాడు.

సూర్యకుమార్ అశ్వనిని టేక్ ఆఫ్ చేశాడు. తోవలోనే వాటిని కలుసుకుని గ్రహం దిశగా వాటిని కూడా మళ్లింప చేశాడు. మొదట అందరినీ అశ్వనిలోనికి తరలించాడు.





పథకం ప్రకారం జగదీష్, నరేంద్ర, ప్రొఫెసర్ దక్షిణ ధ్రువం మీద వెయిట్ చేస్తున్నారు. వారి పక్కనే హనుమాన్ జగదీష్ ఆజ్ఞలకోసం సిద్ధంగావున్నాడు.

సూర్యకుమార్‌తో బాటు డాక్టర్ సరోజ అశ్వనిలోనేవుంది.

ఒకో రాకెట్‌ని రిమోట్ కంట్రోల్ ఆపరేషన్‌తో సూర్యకుమార్ పర్యవేక్షణలో రాకెట్లను ఒకటి తరువాత ఒకటి చక్రాలు గల బేస్‌తో సహా దించారు.

దిగిన ప్రతిరాకెట్‌ను జగదీష్,నరేంద్ర వాటిని అధిష్టించి వాటి చక్రాల బేస్‌ని నడిపి పక్కకి జరిపి రెండోదానికి సమత్రిభుజం మీద దిగడానికి జాగా ఖాళీ చేశారు.

సూర్యకుమార్ అశ్వని మీదనుంచి నిర్వహించిన పాత్ర అపూర్వం. వ్యోమగాములందరూ ఆశ్చర్యపోయారు.

అన్ని రాకెట్లనీ విచిత్రగ్రహం మీద దించగలిగారు. చివర దిగిన రాకెట్‌ని మధ్యలో సమకోణ త్రిభుజంలోనే వుంచేశారు. దాని చుట్టూ పదకొండు రాకెట్లనూ వాళ్లు ఇదివరకు మార్కు చేసుకున్న విధంగా జగదీష్ సర్దాడు. ఎక్కడ బలప్రయోగం అవసరమో అక్కడ హనుమాన్ సహాయం చేశాడు.

విచిత్రగ్రహం మీద ఆ రాకెట్లు దిగిన దృశ్యం, ఒకపెద్ద వృత్తాకారపు అయస్కాంతం పదమూడు ఇనప ముక్కలను వెంటాడి ఒక్కొక్కదానిని తన దక్షిణ ధ్రువంతోఆకర్షించినట్లున్నా, పదమూడో యినప ముక్క దానికి దూరంగా జరుగుతూ దానికి దొరకకుండా వికర్షితయై పారిపోయినా ఉత్తర ధ్రువం వెనక నుంచి ఆకర్షించినట్లూ రోదసిలో నుంచి చూసినవారికి అనిపిస్తుంది.

సూర్యకుమార్ అశ్వనిని ఎంతో సునా

యాసంగా మళ్ళీ ఉత్తరధృవంమీద దించాడు.

వైర్‌లెస్‌లో "జగదీష్‌గారూ! ఇక్కడ మేము జాగ్రత్తగా అశ్వనిలో దిగాం. మీరు ముగ్గురూ ఇంక వచ్చెయ్యండి. రేపు తీరికగా వాటిని పరిశీలించి సర్దుదాం. ఓవర్" అని చెప్పేశాడు.

హనుమాన్ పావుగంటలో ఎగిరి అశ్వనిలోనికి వచ్చేశాడు. తరువాత మరో గంటకి జగదీష్, నరేంద్ర, ప్రసాద్ అశ్వనిని చేరుకున్నారు.

ఆరోజు అశ్వని వ్యోమగాములతో కిటకిటలాడింది. ఎంతో ఘనంగా అతిథి మర్యాదలు జరిగాయి. కొత్తగా విచిత్ర గ్రహాన్ని చేరిన పన్నెండుమంది విచిత్ర గ్రహంలోనికి వెళ్ళాలని తొందరచేశారు. వాళ్ళని ఒక గంట ఆపడం గగనమైంది.

నరేంద్ర వాళ్ళని గ్రహంలోనికి తీసుకువెళ్ళి చూపించి ఒక్కొక్కటి వివరించాడు. వాళ్ళ కళ్ళని వాళ్లే నమ్మలేక పోయారు. అది ఒక స్వప్నలోకం అని భ్రమించారు. తరువాత అందరూ అశ్వని లోనికి వచ్చి విశ్రమించారు.

జగదీష్ సేఫ్ లేండింగ్‌కి సంబంధించిన ప్రతి విషయం భూమికి వివరంగా తెలియజేశాడు. మరి కాస్త సేపట్లో భూమి నుంచి జగదీష్‌నీ,అందరు వ్యోమగాములనీ అభినందిస్తూ వాళ్ళ సంతోషాన్ని వ్యక్తం చేస్తూ వార్త కూడా చేరింది. జగదీష్ కూడా నిద్రకుపక్రమించాడు.

* * *

వారంరోజులు వ్యోమగాములు విచిత్ర గ్రహపు దక్షిణ ధృవంమీద విశ్రాంతి లేకుండా పనిచేశారు. ఆ రాకెట్లను వాటి లోనే అమర్చబడివున్న ఎలక్ట్రిక్ మోటార్లను పనిచేయించి తలకిందులుగా అమర్చారు. సమకోణ త్రిభుజంలో వున్న దానినిగాక మిగిలిన పన్నెండు రాకెట్లను సరియైన దూరంలోనికి సర్ది పద్మంలాగ చేశారు. ఇనుప స్థంభాలతో ఆ రాకెట్లన్నిటినీ నట్ బోల్టులతో కలిపారు. ఆ రాకెట్ల మొత్తం బేసులనన్నిటినీ కలిపి ఒక పెద్ద విశాలమైన ఒకే మట్టంలాగ చేశారు. ఒకదానికొకటి కలపడం వలన అన్నీ ఒకే యూనిట్‌లాగ తయారయ్యాయి.

ఇంక రాకెట్లను బ్లాస్ట్ చెయ్యడమే వుంది. అన్ని వ్యోమ నౌకలశక్తి సంఘటితంగా దానికి వ్యతిరేక దిశలో పనిచేసి విచిత్ర గ్రహానికి బ్రేకుల్లాగ పనిచేసి దాని వేగాన్ని తగ్గిస్తాయి.

గంటకు యాభైవేల మైళ్ళ వేగంతో పోతున్న విచిత్రగ్రహం గంటకు ఇరవై అయిదువేల మైళ్ళ వేగానికి గనక తగ్గిపోతే భూమికి ఉపగ్రహంగా మారిపోతుంది. భూమి ఆకర్షణ పరిధిలోనికి వచ్చేలోగా దాని వేగాన్ని తగ్గించడానికి భారతదేశపు రోదసీ శాస్త్రజ్ఞులు రూపొందించిన పథకం అది.

విచిత్ర గ్రహం తన ఇరుసు మీద భ్రమణాలు చేస్తూండటం, సరిగ్గా దాని దక్షిణపు ఇరుసు భూమి దిశగానే వుండడం వాళ్ళ పనిని సులభంచేసింది. లేకపోతే వేరే రాకెట్ల శక్తితో ధృవాన్ని భూమివేపు తిరిగేలా చెయ్యవలసి వచ్చేది.

అందరూ అశ్వనిలోనికి చేరారు. మొదట మధ్య రాకెట్‌ని పనిచేయించారు. టెలివిజన్ తెరమీద దాని జెట్ స్ట్రీమ్ కనిపించింది. దక్షిణ ధృవంలో వాళ్లు ప్రతిష్ఠించిన టెలివిజన్ ప్రసార యంత్రం మొత్తం రాకెట్లు కనిపించేలాగ అమర్చబడింది. టెలివిజన్ తెరమీద అన్ని

రాకెట్లూ కంట్రోల్ రూములో కూర్చున్న వారికి కనిపిస్తున్నాయి.

ఒకటి తరువాత ఒకటి అన్నిటినీ బ్లాస్ట్ చేశారు. విచిత్ర గ్రహం వెలాసిటీ ఏమైనా మారుతోందా అని పరిశీలించారు. వేగం కొంచెం కొంచెం తగ్గసాగింది. ఒకగంటసేపు ఫుల్‌బ్లాస్ట్ చేయించగా గంటకు వెయ్యి మైళ్ళ వేగం మాత్రం తగ్గింది సంతోషించారు.

"ఇప్పుడే వేగాన్ని తగ్గించేస్తే విచిత్ర గ్రహం భూమికి చేరడానికి టైము పట్టేస్తుంది. భూమిని మరో రోజులో చేరుతాం అనగా రాకెట్లను పనిచేయిద్దాం. ప్రస్తుతం ఆపెయ్యండి" అన్నాడు.

అణురియాక్షన్ తగ్గించి తగ్గించి చివరికి రాకెట్లనన్నిటినీ ఆపేశారు.

* * *

పది రోజులు విచిత్ర గ్రహం అంతా కలయతిరిగారు. సౌరంగ హర్మ్యాలలో అతిథులుగా గౌరవ మర్యాదలు పొందారు.

ఒకరోజు భూమి నుంచి "భూమి గురుత్వాకర్షణ పరిధిలోనికి రాబోతున్నారు. మరో రోజులో భూమి చుట్టూ కక్ష్యలో మీరు ప్రవేశించాలి. రాకెట్లను బ్లాస్ట్ చెయ్యండి" అనే వార్త వచ్చింది.

రాకెట్లను పనిచేయించారు. గంటకొక వెయ్యి మైళ్ళ చొప్పున తగ్గుతూ, భూమికి పక్కగా 25 వేల మైళ్లు ఎడంగా ప్రయాణిస్తూ సూర్యుని వేపు పోతున్న విచిత్ర గ్రహం తన దిశని మార్చుకుని భూమి ఆకర్షణ శక్తిలో పడిపోయి కోడి గుడ్డు ఆకారపు కక్ష్యలో ప్రవేశించింది. రాకెట్లను ఆపేశారు.

విచిత్ర గ్రహం కక్ష్య పరిధులను లెక్కకట్టి అది భూమికి పెరిగీలో 25వేల మైళ్లు దగ్గరికి, ఎపొగీలో యాభై వేలమైళ్ళ దూరానికీ పోతున్నట్టూ భూమి నుంచి శాస్త్రజ్ఞులు తెలియజేశారు. వంద ఏళ్ళ తరువాత మళ్ళీ కరెక్షన్ చెయ్యకపోతే శూన్యంలోకిపోయే కక్ష్యలో ప్రవేశిస్తుందని తెలియజేశారు.

వ్యోమగాములు టెలిస్కోప్‌లో భూమిని పరిశీలించారు. ఒకవేపు భూమి నీలపు వాతావరణంలో ఎంతో అందంగా కనిపించింది. అలాగే చంద్రుడు మరొక దిశగా స్వచ్ఛంగా తన ముఖం నిండా ఉల్కాపాతాల వల్ల సంభవించిన క్రేటర్సుతో చక్కగా కనిపించసాగింది.

జగదీష్ "చూశారా! మనం అనుకున్నది సాధించాం. విచిత్ర గ్రహాన్ని భూమికి ఉపగ్రహంగా మార్చగలిగాం. ఇది ఒక అందమైన పరిశోధనశాలగా భూమిమీది శాస్త్రజ్ఞులకు పనికిరాబోతోంది. ప్రపంచ శాస్త్రజ్ఞులు దీని మీదికి వస్తూ పోతూ వుంటారు" అన్నాడు.

అందరూ భూమిని చూసి ఎంతో పులకించారు. సరోజకి ఆనంద భాష్పాలు వచ్చాయి. వెయ్యికోట్ల జనాభాని తన ఒడిలో మోస్తున్న కన్నతల్లి అనుకుంది. ప్రొఫెసర్ భూమిని చూసి పులకితుడయ్యాడు. భూమి నుంచి అశ్వని మీద వచ్చెయ్యమని సంకేతం వచ్చింది.

అశ్వని విచిత్ర గ్రహాన్ని విడిచిపెట్టింది. తన వేగాన్ని తగ్గించుకుంటూ వలయాలు చేస్తూ వాతావరణంలో ప్రవేశించింది.

* * *

రోదసీలో ఎక్కువ కాలం గురుత్వాకర్షణ లేకుండా భారరహిత స్థితిలో వున్న వ్యక్తి కొన్ని శ్రద్ధలు తీసుకోవాలి. భూమ్యాకర్షణ శక్తి వాళ్ళ మీద రాను

రాను పనిచేసి కొంత ప్రభావం చూపుతుంది.

శూన్యంలోనేకాక తక్కువ గురుత్వాకర్షణగల చంద్రునిలో చాలా కాలం వున్న వ్యక్తులు కూడా ఇటువంటి శ్రద్ధ తీసుకోవాలి. తదనుగుణ్యమైన సూచనలు అశ్వనిలోని వ్యోమగాములకు అందాయి. రెండు మూడు నెలలు రోదసిలో ఏక బిగిని గడపడం వ్యోమగాములకు పెద్ద ప్రశ్న కాదు. అది వాళ్ళకు అలవాటే. అందుచేత అయిదు సంవత్సరాలకుపైగా రోదసిలో గడిపిన జగదీష్, ప్రొఫెసర్ ప్రసాద్, సూర్యకుమార్, నరేంద్ర, డాక్టరు సరోజకు ఆ సూచనలు ప్రత్యేకంగా వెళ్ళాయి.

అంతరిక్ష ప్రసాద్ కోసం ఒక స్పేస్ సూట్ . ఒక సంస్థ ప్రత్యేకంగా కెప్టెన్ జగదీష్ అభ్యర్థన మీద తయారు చేసి రాకెట్ ద్వారాచేత పంపింది. దానిని ఆ బాల వ్యోమగామికి తొడిగారు.

విచిత్ర గ్రహాన్ని విడిచిన మరునాడు సాయంకాలానికి శ్రీహరి కోటలోని రోదసీ నౌకలు దిగే బేస్ మీద సూర్యకుమార్ మెల్లగా దింపాడు. అందరినీ స్పెషల్ రూములలోనికి తీసుకుపోయారు. బయట మొత్తం పత్రికలవారు ఎదురుచూడ సాగారు. నౌక దిగడం వంటివన్నీ దూర దర్శన్‌వాళ్ళు రికార్డు చేశారు.

నౌకనుంచి బయటకు దిగుతున్న కొన్ని ఫొటోలను ప్రెస్. రిపోర్టర్లు తీసుకున్నారు.

జర్నలిస్టులు వాళ్ళని ఇంటర్వ్యూ చెయ్యడానికి అనుమతి కోసం రోదసీ సంస్థ అధికారులను కోరారు. వాళ్ళు మూడు రోజులు మెడికల్ చెకప్‌లో వుండాలని, ఎవ్వరూ చూడ కూడదని అనుమతించలేదు.

వాళ్ళని డాక్టర్లు పరీక్షించారు. అందరూ ఆరోగ్యంగా వున్నట్లు పరీక్షలలో తేలింది. అయినా మూడురోజులూ వాళ్లని పరీక్షలోనే ఉంచారు.

నాలుగోదినం వాళ్లు బయటికి వచ్చారు. బయట జనసందోహం. వాళ్ల మీద ఫ్లాష్‌లు మెరుపుల్లాగ కురిశాయి.

* * *

ఎవరి బంధువులు వాళ్ళకోసం ఎదురు వచ్చారు. శ్రీమతి సుశీల అశ్వని దిగిన రోజునే శ్రీహరికోట చేరుకుంది. ఆమెకు అన్నిఏర్పాట్లూ రోదసీసంస్థ వాళ్ళే చేశారు. వెంటనే భార్య వచ్చిన సంగతి ప్రొఫెసర్ ప్రసాద్‌కి తెలిసింది. స్పెషల్ రూమ్ నుంచి టెలిఫోన్‌లో మాట్లాడాడు.

నాలుగోరోజు ఉదయం వేయికళ్లతో ఎదురుచూస్తున్న సుశీల మెడికల్‌చెకప్ నుంచి బయటపడి వస్తున్న భర్తను చూసి తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. చెక్కు చెదరకుండా వెళ్ళినమనిషి వెళ్ళి నట్లు రావడం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. వెళ్ళిననాటికి ప్రొఫెసర్ ప్రసాద్ తల సగం నెరిసివుంది. వచ్చేనాటికి పూర్తిగా నెరిసిపోతుంది అనుకుంది. కాని ఒక్క వెంట్రుక కూడా ఎక్కువ నెరవక పోవడం ఆశ్చర్యంతోపాటు ఆనందాన్ని కలిగించింది.

ప్రొఫెసర్ ప్రసాద్‌కూడా భార్యని చూసి ఆశ్చర్యపోయాడు. ఐదేళ్ళ క్రితం చూసిన సుశీలకాదు ఈమె అనుకున్నాడు. ఎక్కడో ఒక్క వెంట్రుక నెరిసిన సుశీల తల సగానికి పైగా నెరిసిపోయింది. తన మీద పెట్టుకున్న బెంగేమో అను కున్నాడు. పక్కనే నుంచున్న కొడుకు వెళ్ళేనాటికి ఏడాదివాడు. ఏడోఏడు ప్రవే శించి తండ్రిని ఆశ్చర్యంగా చూడసాగాడు.

పుత్రోత్సాహం పెల్లుబకగా కొడుకుని గాఢంగా కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

సుశీలా, ప్రొఫెసర్‌ని మరే అడ్డంకీ ఆపలేకపోయింది. అక్కడే గాఢంగా కౌగలించుకున్నారు. సుశీల కళ్లు ఆనంద భాష్పాలను వర్షించాయి.

"ఊరుకో సుశీలా! కళ్లు తుడుచుకో. మనల్ని ఇంక ఏ శక్తీ విడదీయలేదు. మనకి ఏ ఎడబాటూ వుండదు" అని ఊరడించాడు.

సూర్యకుమార్, సరోజ, నరేంద్ర సుశీలను పలకరించడానికి వచ్చారు. సుశీల కళ్లు తుడుచుకోవడంచూసి సరోజ కళ్లు చెమర్చాయి. తను ఈ ఎడబాటు బాధ భరించలేకనేగదా భర్తను అనుసరించింది. సీత కన్నా ఊర్మిళ ఎంత ఉత్తమురాలో సరోజకు నిజంగా అర్థమయింది.

ప్రొఫెసర్ ప్రసాద్, కెప్టెన్ జగదీష్, సూర్యకుమార్, నరేంద్ర, డాక్టర్ సరోజని కలుసుకోవడానికి వచ్చినవారు, వ్యోమగాములందరూ కాస్త ముసలివాళ్ళయి తల నెరిసి ఎలాగో కాస్త మార్పుచెంది ఎదిగే వస్తారనుకున్నారు. కాని వారి ఆలోచనలు తారుమారయ్యాయి. ఎలాగ వెళ్ళినవారు అలాగే రావడం చూసి వాళ్ళంతా ఆశ్చర్యపోయారు.

మొదసారి ప్రొఫెసర్ ప్రసాద్‌ని అతని భార్య సుశీలనీ కలిపి చూసిన నరేంద్ర సూర్యకుమార్‌తో "ఈ విషయం గమనించారా ? ఇదివరకు మన ప్రొఫెసర్ ముసలాయనలాగా, సుశీలగారు యవ్వనవతిగా కనిపించేవాళ్లు. వాళ్ళమధ్య పదిహేను సంవత్సరాల వ్యత్యాసం వున్నట్లు అనిపించేది. ఇప్పుడిద్దరి మధ్యా అంత వయోభేదం ఉందని ఎవ్వరూ అనుకోరు" అని ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు.

డాక్టర్ సరోజ "నిజం చెప్పారు నరేంద్రగారూ. వీళ్ళిప్పుడు ఒకళ్ళకోసం ఒకరు సృష్టించబడ్డ రతీమన్మథుల్లాగ వున్నారు. ఏమంటారు?" అని జోక్ చేసింది.

సూర్యకుమార్ కూడా కొట్టవచ్చినట్లున్న ఆ తేడాని ముందే గమనించాడు. "అయితే ఐన్‌స్టెయిన్‌గారి థీరీ ఆఫ్ రిలేటివిటీ సిద్ధాంతం నిజమేనన్నమాట. సుశీలగారు ఐదేళ్లు ఎదిగారు. ప్రొఫెసర్ గారు అలాగే వుండిపోయారు" అని వయోభేదాలు దగ్గరకావడంలో గల చిక్కుప్రశ్నకి సమాధానం చెప్పాడు.

అప్పుడే వచ్చిన జగదీష్ "రోదసిని వదిలి భూమిమీద కాలుమోపినా మీరింకా సైన్సుని వదలలేదన్నమాట. బై! మళ్ళీ కలుసుకుందాం" అని ప్రసాద్ వాళ్ళ అబ్బాయి బుగ్గమీద చిటికవేసి తనకారులో వెళ్ళిపోయాడు. ఎవరికార్లలో వారు వెళ్ళిపోయారు.

* * *

అశ్వని నౌకలో పరిశోధించడంకోసం కొన్ని క్రిములను శాస్త్రజ్ఞులు వుంచారు. అవి వాళ్లు తీసుకునివెళ్ళారు. విచిత్ర గ్రహంనుంచి ప్రొఫెసర్ ప్రసాద్, డాక్టర్ సరోజ గ్రహించిన శాంపిల్స్‌కూడా వెంటనే పరీక్షించడానికి తీసుకున్నారు.

వాళ్ళ మొదటి పరీక్షలో విచిత్ర గ్రహాన్ని ఆ గ్రహవాసులు పదివేల సంవత్సరాలక్రితం ప్రయోగించారని తెలుసుకున్నారు.

ప్రొఫెసర్ ప్రసాద్ విచిత్రగ్రహంలోని మ్యూజియంనుంచి స్ఫటికశిలని




సేకరించాడు. దానిలో పరమాణుసంఖ్య 150 గల ఒక ధాతువు కనిపించింది. అంతవరకూ భూమిమీద 2079లో కనుగొనబడ్డ కొత్తధాతువులో 141 పరమాణు సంఖ్యగల ధాతువునే కనుక్కున్నారు.

ఈ కొత్త ఎలిమెంట్ కూడా రేడియో ఏక్టివ్ ఎలిమెంటు అనీ, దాని అర్ధాయుష్షు అయిదు ఫంధల సంవత్సరాలనీ, దాని రేడియో ఏక్టివ్‌డికే ఆధారంతో ఆ గ్రహం 10 వేల సంవత్సరాలక్రితం బయలు దేరిందనీ కనుక్కున్నారు.

అప్పటికి భూమిమీది మనుషులు రాతి యుగంలో వుండేవారని, పచ్చిమాంసం తినేవారని జీవ శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడ్డారు. రానురాను నాగరికులై, విజ్ఞానవంతులై సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించి విచిత్ర గ్రహాన్ని పాలపుంతనుంచి వస్తుండడం గ్రహించడమేగాక దానిని భూమిచుట్టూ ప్రవేశపెట్టగలిగేటంత తెలివి గలవారయ్యారని, లేకపోతే ఈపాటికి భూప్రళయం వచ్చేదని పేపర్లలో రాశారు.

ప్రొఫెసర్ ప్రసాద్, సుశీల హైదరాబాదులోని వాళ్ళ గృహం చేరుకున్నారు.

సుశీల రోదసీ యాత్రకి తన భర్త వెళ్ళిననాటినుంచీ తను సేకరించిన పేపరు కటింగ్స్ అతని ముందుంచింది.

కొన్ని పత్రికలు సైన్సుని సైన్సులాగే రాసి చక్కగా పాఠకులకు విషయాన్ని విశదీకరించాయి.

కొన్ని పత్రికలు రాసిన వ్యాఖ్యానాలు ప్రసాద్‌కి నవ్వు తెప్పించాయి.

ఒక పత్రిక "విచిత్రగ్రహం అలనాడు స్వర్గం నుంచి తొయ్యబడిన త్రిశంఖుని, తల్లకిందులుగా పడకుండా కాపాడడానికి సృష్టించినది. ఇదే త్రిశంఖ స్వర్గం అయివుంటుంది" అని రాసింది.

మరో పత్రిక మర మనిషి హనుమాన్ చిత్రాన్ని వేసి "హనుమంతుడు చిరంజీవి అని అందరికీ తెలుసును. మన పురాణాలు అలా ఘోషిస్తున్నాయి. ఆ హనుమంతుడే ఈ హనుమాన్‌లో దూరి ఆ అద్భుతాలు చేయించి వుంటాడు. హనుమాన్ చిత్రానికి పూజలు చేయాలి" అని రాసింది.

ఆ వార్తలను చదివిన నరేంద్ర, సూర్యకుమార్, కెప్టెన్ జగదీష్ బాగా నవ్వుకున్నారు. ఏది జరిగినా దేవుడికి అంటగట్టడం మనిషి వీక్‌నెస్ అనుకున్నారు.

మొదటి విడత విచిత్ర గ్రహాన్ని పరిశోధించడానికి వెళ్లబోయే శాస్త్రజ్ఞులను భారతదేశం ఎన్నిక చేసింది. అందులో స్పేస్‌మెన్ ట్రయినింగు పూర్తి చేసినవాళ్ళకి ప్రిఫరెన్సు యిచ్చారు. వాళ్ళకి గైడ్‌గా వెళ్ళడానికి ప్రొఫెసర్ ప్రసాద్‌ని ఎన్నిక చేశారు. ఈ వార్త విన్న సుశీల పిడుగు పడ్డట్లు బాధపడింది.

"ఈమారు నేను కూడా స్పేస్‌మెన్ ట్రయినింగు పూర్తి చేసి మీతోనే వస్తాను. లేకపోతే మీరిలాగే వుండిపోతారు. నేను ముసలిదాన్నయిపోతాను" అని ఆందోళన వ్యక్తం చేసింది.

ప్రొఫెసర్ ప్రసాద్ నవ్వుతూ "అలాగే. యికమీదనుంచి ఎక్కడికివెళ్ళా లన్నా యిద్దరం కలిసే. పద" అని బెడ్‌రూమ్‌లోనికి తీసుకువెళ్ళాడు. కింగ్ సైజ్ డబుల్ కాట్ వాళ్లని ఆహ్వానించింది. ఐదు సంవత్సరాల ఎడబాటును ఆ ఒక్కరాత్రే అధిగమించాలని నిశ్చయించుకున్న వారిలో రక్తం ఉప్పొంగింది. 

# ఐదు విషయాలు

ఆరోజు ఆగస్టు పదిహేను. పొద్దున హైస్కూల్లో పతాక వందనం జరగబోతోంది. విద్యార్థులందరూ వరుసలో నిలుచున్నారు. హెడ్మాస్టర్‌గారు, మరో ఖద్దరు బట్టలాయనతో కలసి వచ్చారు. ఆ కొత్తాయన జెండాని ఎగురవేశారు. జెండాలో కట్టి ఉన్న గన్నేరు పూలు జల్లున కింద పడ్డాయి. ఆ కొత్తాయన ఏమిటో చెప్పాడు. పిల్లలు అతడు చెప్పిన దానిని కొంత అర్థం చేసుకున్నట్లున్నారు. మరికొందరికి మాత్రం ఆవలింత లొచ్చాయి.

అంతకుముందు వారం రోజులుగా జరుగుతున్న ఆటల పోటీలు, పాటల పోటీలు తదితర పోటీలలో బహుమతులు గెల్చుకున్న వారికి ఆయా బహుమతు లందజేశారు. పిల్లలందరిని క్లాసు రూముల్లోకి పంపి తలాగుప్పెడు పప్పు బెల్లాలు పంచారు. పిల్లల ముఖాలలో స్వాతంత్ర్యదినోత్సవం జరుపుకుంటున్నామన్న సంతోషం కన్నా బెత్తాలు ఝుళిపిస్తూ అటూ ఇటూ తిరిగే పంతుళ్ళబారి నుండి ఓ రోజుకి విముక్తి కలిగిందన్న ఆనందం వెల్లివిరుస్తోంది.

అంతా అయింతర్వాత పిల్లలు గుంపులు గుంపులుగా చేరి ఆరోజు తామే ఆటలు ఆడాలో, ఏ బావుల్లో – చెరువుల్లో ఈతలు కొట్టాలో చర్చించుకుంటూ ఇళ్ళ ముఖాలు పట్టారు.

ఆ సాయంకాలం వారిలో ఎనిమిదో తరగతి విద్యార్థులు కొందరు పార్కులో సమావేశమయ్యారు. వారు ఆడినంత సేపు ఆడి చివరకు పార్కు రేడియో దగ్గర పచ్చిక మీద చతికిలబడ్డారు. ఆగస్టు పదిహేను సందర్భంగా రేడియోలో ఏమి




# కతలు




దేమిటో కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి.

సమయం ఎనిమిది గంటలయింది. రేడియోలో 'స్వాతంత్ర్యదినోత్సవ సందర్భాన భారతరాష్ట్రపతి దేశ ప్రజల నుద్దేశించి ఇచ్చిన సందేశం మీరిప్పుడు వింటారు' అని ప్రకటించడం జరిగింది.

దేశంగూర్చి తెలిసినది స్వల్పమే అయినా, పాఠ్య పుస్తకాల ఫలితంగా విద్యార్థులలో దేశభక్తి మెండుగానే ఉంది. అందులోనూ దేశ అధినేత ఉపన్యాసం గదా! విద్యార్థులంతా ఆంగ్లంలో అనర్గళంగా సాగిపోతున్న భారత రాష్ట్రపతి ఉపన్యాసాన్ని శ్రద్ధగా ఆలకించసాగారు.

ఉపన్యాసం అయిపోయిన తర్వాత ఆ ఎనిమిదవ తరగతి విద్యార్థుల సమూహంలో దానిని గూర్చి చర్చ మొదలయింది. "అసలు ఆయన చెప్పిందేమిటో మాకేం అర్థం కాలేదు" అన్నారు కొందరు జంకుతూనే.

"నాకు అర్థం అయింది. ముఖ్యంగా అందులో ఐదు విషయాలు బాగా అర్థమయ్యాయి" అన్నాడు చెన్నయ్య. చెన్నయ్య వారిలోకెల్లా కాస్త చురుకయిన విద్యార్థి.

ఏమిటేమిటి అని అందరూ ఆసక్తిగా అడిగారు. "అవును. అయిదు మాటలు నాకు బాగా అర్థం అయ్యాయి. ఆన్, ఇన్, ఇట్, ది, ఫర్ అనేవి అవి" గంభీరంగా సమాధానమిచ్చాడు చెన్నయ్య.

—సంధ్యారాణి.

# పొదుపు పాఠం

పిసినిగొట్టు పరంధామయ్యగారు ఓ మధ్య తరగతి బిజినెస్‌మేన్. ఓ మాదిరిసొంత ఇల్లూ, కొద్దిపాటి బేంక్ బేలెన్సూవున్నాయి.

ముచ్చటగా ఓ కూతురూ, ఓ కొడుకూ. కొడుకు కాలేజీలో ఇంటర్ రెండో సంవత్సరం చదువుతున్నాడు. కూతురు తొమ్మిదో తరగతి చదువుతోంది. భార్య ఉత్తమ గృహిణి. పరంధామయ్య పొదుపు మనిషి. దుబారా ఖర్చుల అలవాటు లేదు. అందుకే వీలున్నప్పుడల్లా పొదుపుగా ఎలా బతకచ్చో కూతురికీ, కొడుక్కీ నూరి పోస్తుంటాడు. పిల్లలు కూడా బుద్ధిగా తల లూపుతారు అర్థమయిందన్నట్లు.

ఆరోజు పరంధామయ్య ఆఫీసునుండి పెందరాళే ఇంటికొచ్చాడు. పిల్లలు ఇంకా



ఇల్లు చేరుకోలేదు. భర్తను చూసి వంట గదిలోకెళ్ళి కాఫీ, టిఫిను పట్టుకు వచ్చింది భార్య. పరంధామయ్య బట్టలు మార్చుకుని వచ్చికుర్చీలో కూర్చునేలోగా "టిఫిన్ తింటూ ఉండండి కాఫీ కలుపుకొస్తాను" అనేసి లోపలికెళ్ళిపోయింది భార్య.

ప్లేటు ఖాళీచేసి భార్య అందించిన కాఫీ కప్పు అందుకుంటూ "పిల్లలింకా రాలేదేం" అనడిగాడు భార్యను.

"వస్తారు. బస్సు దొరికి వుండదు. అయినా! మీరు పొదుపు గురించి పిల్లలకి నూరిపోస్తున్నారా... మీ పాఠాలు బాగానే పని చేస్తున్నాయి సుమండీ..." అంది భార్య మెచ్చుకోలుగా.

"మరేమనుకున్నావ్. వాళ్లనా పిల్లలు" గర్వంగా అన్నాడు పరంధామయ్య. పేపరు పక్కనపెట్టి "ఇంతకీ ఏమిటి సంగతి? మనవాళ్లు ఏం పొదుపు చేశారటా?" అనడిగాడు.

"ఏముందీ...వాసుపుట్టినరోజు వస్తోంది గా వచ్చే నెల్లో. వాడికీసారి కొత్తబట్టలూ వగైరా ఏమీ వద్దట. ఐదు రూపాయల కన్నా ఎక్కువ ఖర్చు చేయద్దు నా పుట్టిన రోజుకి అంటున్నాడండీ"

"నిజంగానా...బావుంది గాని...మరీ ఐదు రూపాయలకి ఏమొస్తాయంటావు కొనడానికి" సంబరపడిపోతూ అడిగాడు పరంధామయ్య.

"వాడడిగిన వస్తువైతే వస్తుందిటమరి"

"ఏమడిగాడేమిటి?"

"ఏముందీ! ఈసారికి ఐదు రూపాయలు పెట్టి మన ఇనప్పెట్టెకి డూప్లికేట్ కీలు చేయించి ఇస్తే చాలన్నాడు"

పరంధామయ్య కళ్ళు బైర్లు కమ్మి అప్పుడే లోపలికి వస్తున్న కొడుకు రూపం మసక మసగ్గా కన్పించింది.

—శాంతి





# గోరీ

ఆ ఆడవాళ్ళంతా అరమైలు దూరం నుండి మంచినీళ్ళు తెచ్చుకుంటున్నారు పాపం. బిందెలు భుజంపై పెట్టుకుని అరమైలు దూరంనుండి వాళ్ళు అలా నడిచివస్తుంటే చూసేవాళ్ళకు 'పాపం!' అన్పించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

అలా నీళ్ళు తెచ్చే ఆడా మగా, పిల్లా పాపలందరికీ ప్రతిరోజు ఊరి మధ్యలో



ఎదురౌతుంది ఒక గోరీ. అలా ఆ వూళ్లో- అందునా ఊరి మధ్యలో గోరీ, అందులోనూ స్కూలుకు ఎదురుగా వుండటం ఎవరైనా కొత్తవారికైతే ఏమోగాని, ఆ ఊరి ప్రజలు చాలా రోజులుగా చూస్తున్నదే కనుక ఎలాంటి అనుమానమూ రాదు, భయమూ వెయ్యదు.

నాలుగడుగుల ఎత్తున్న ఆ గోరీ చక్కగా, నున్నగా సిమెంటుతో కట్టించబడి వుంది. ఊరికి నడిబొడ్డున గొప్ప మోడల్‌లా నిలిచివుంది.

ఆ ఊరికి కొత్తగా ట్రాన్స్‌ఫర్ అయి వచ్చిన రామారావు పంతులుకి 'బడికి ఎదురుగా, ఇలా ఊరి మధ్యలో గోరీ వుండటం ఏమిటా?' అని అనుమానం పట్టుకుంది. కోపమూ వచ్చింది. భయమూ వేసింది. ఆ గోరీలోంచి భూతం లేచి వస్తుందేమోనని బెదురూ పుట్టింది. ఒక్కోరోజు ఆయన కలల్లో ఆ గోరీ, గోరీలోంచి భూతం వచ్చినట్లు కనిపిస్తుండేది. ఇంతకూ అసలా గోరీ ఎవరిదా అని తెలుసుకోవాలని చాలాసార్లు ప్రయత్నించాడు రామారావు. ఆ గోరీ ముందుభాగంలో వివరాలు చెక్కిన రాయికూడా వుంది. కానీ ఆ రాతిపై ఎవరో పేడ, మట్టిముద్దలు కొట్టారు. వెళ్ళి ఆ మట్టి తుడిచి చదవచ్చుగానీ దగ్గరికివెళ్తే గోరీలోని దెయ్యం మీదబడి చంపుతుందేమోనని భయం.

ఉండీ ఉండీ ఒకరోజు తన స్కూల్లోనే వుండే ఒక కుర్రకాడిని "ఈ గోరీ ఎవర్దిరా?" అని అడిగాడు రామారావు పంతులు.

ఆ మాటలకా కుర్రవాడు "అది గోరీ కాదు సార్! నాలుగేండ్ల కిందట ఈ చుట్టుపక్కల వూళ్ళకు మంచినీళ్ళ నల్లాలు పెట్టిస్తానని మంత్రిగారొచ్చి ప్రారంభం చేశారు. అప్పుడు కట్టారుదాన్ని. అదలాగే వుందిన్నాళ్ళూ. ఆ నల్లాలు రాలేదు. మా ఊరివాళ్ళకు నీళ్ళు దూరం నుండి తెచ్చుకోక తప్పలేదు" అన్నాడు.

ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చుకుని, భయం వదిలిపెట్టి గట్టిగా నవ్వుకున్నాడు రామారావు.

—వసంతరాయ్

**Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.**

